# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



నెహ్రూ వంశ పాలనను రద్దు చేయాలని విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌కు నిజంగా శ్రద్ధ ఉన్నట్టయితే ఆయన చేయ వలసిన మొట్ట మొదటి పని తన పార్టీని, లేదా ఉద్యమం అని ఆయన పిలిచే జనమోర్చాను రద్దు చేయడం. మోర్చా ఒక బెడదగా తయారయింది. అది ప్రతిపక్షానికి బలం చేకూర్చే బదులు వాస్తవంలో అనైక్యతకు దారి తీసింది. అది ఏ లక్ష్యాన్నీ సాధించడం లేదు. రాజీవ్ గాంధీ పదవి మీద రాజా గారి కన్ను ఉంటే, అంతకు మించి ఆయన మరేమీ చేయదలచుకోకపోతే, ఇప్పుడేం చేస్తున్నారో అదే చేస్తూ ఉండవచ్చును, కాని ఆయన బెడదగా తప్ప మరో రకంగా ఉండరు. కొంత కాలం తర్వాత ఆయనకు ఆ స్థానం కూడా ఉండక పోవచ్చు.

భారతదేశంలో మూడే రాజకీయ బృందా లున్నాయి. కాంగ్రెస్ వాదులు, మాజీ కాంగ్రెస్ వాదులు, కాంగ్రెసేతరులు. నాలుగో బృందం కూడా ఉందనుకోండి. అది నకిలీ కాంగ్రెస్ వాదుల బృందం. కమ్యూనిస్టులు ఈ బృందం కిందికే వస్తారు కాని వాస్తవానికి వాళ్ళు కాంగ్రెస్ వాదుల బృందంలో భాగమే. విశ్వనాథ ప్రతాప్ సింగ్‌తో సహచరులుగా ఉన్నవాళ్ళలో చాలామంది మాజీ కాంగ్రెస్ వాదులూ, నకిలీ కాంగ్రెస్ వాదులూను. అయితే జీవితమంతా కాంగ్రెస్ వాదిగా గడిపిన వ్యక్తికి ఇది సహజం. ఒక కాంగ్రెస్ వాదికీ, మాజీ కాంగ్రెస్ వాదికీ తేడా స్థాయిలోనే, గాని సారాంశంలో కాదు. ఎన్. డి. తివారీకి, రామకృష్ణ హెగ్డేకు మధ్యన నాకు తేడా ఏమీ కనిపించదు. ఒకే ఒక్క తేడా ఏమంటే వాళ్ళిద్దరూ వ్యతిరేక శిబిరాలలో ఉండడం తటస్థించింది. తివారీ ప్రజాసోషలిస్టుగా ప్రారంభించి చిట్ట చివరికి కాంగ్రెస్ వాది అయ్యారు. నీతినియమాల గురించి ఏమంత పట్టించుకోని కాంక్షా పరులయిన రాజకీయ వేత్తలందరిలాగానే ఆయనా ప్రవర్తించారు. హెగ్డే తమ రాజకీయ జీవితంలో అత్యధిక భాగం కాంగ్రెస్ వాదిగానే గడిపి ఇప్పుడు వ్యతిరేక శిబిరంలో చేరారు. కానీ మీరు వారితో మాట్లాడి చూస్తే చాలా విషయాల గురించి వారు ఒకేరకంగా ఆలోచిస్తున్నారని గుర్తించగలరు. వారు ఒకరి సాహచర్యంలో




మరొకరు సంతోషంగా కూడా ఉండగలరు.

చంద్రశేఖర్ మాజీ సోషలిస్టు. బహుశా ఇష్టపూర్వకంగా కాకపోయినప్పటికీ ఆయన కూడా మాజీ కాంగ్రెస్ వాది అయ్యారు. ఆయన కూడా మధుదండావతే కన్నా ఎన్. డి. తివారీకి దగ్గరగా ఉంటారు. అరుణ్‌నెహ్రూ, వి. సి. శుక్లాతో సహా చాలా మంది మాజీ కాంగ్రెస్ వాదుల విషయంలో ఇది సరైనదే. నిజానికి నా సందేహం ఏమిటంటే వీళ్ళందరూ నిజంగా "మాజీ" కాంగ్రెస్ వాదులేనా అని. వాళ్ళు పార్టీకి, రాజీనామా చేసి రాలేదు. వాళ్ళను పార్టీ నుంచి తోసేశారు. తోసేయడం అంటే రాజీనామా చేయడం కాదు. నాకూ, నాలాగనే నా మిత్రులు చాలామందికి కూడా ఒక ఆలోచన వస్తుంది. కొన్ని విషయాలు సర్దుబాటు అయితే వీళ్ళందరూ తమ పాత పార్టీతో సంధి కుదుర్చుకోవ డానికి ఏమి ఇబ్బంది పడరేమో అని. ఆ కొన్ని విషయాలు ఏమిటనేది మనకు ఖచ్చితంగా తెలియదనుకోండి.

మాజీ కాంగ్రెస్ వాదుల లక్షణమేమంటే వాళ్ళు ఎప్పుడూ అతి జాగ్రత్తగా ఉంటారు. ఎందుకంటే గోడమీది పిల్లి ఎటు దూకుతుందో తెలియదుగదా. శ్రీ సింగ్ కూడా తను పాత పార్టీని వదిలి వచ్చిన నాటి నుంచీ చేయడానికి ప్రయత్నిస్తున్నది ఇదే. ఒక సంవత్సరం కింద ఆయన పార్టీని వదిలేసినప్పుడు ఆయనే దూకాడా, ఆయనను తోసేశారా? మొన్న ఒక రోజున శ్రీ సింగ్ మహేంద్రసింగ్ తికాయత్ ప్రదర్శన కోసం మీరట్ కూడా వెళ్ళారు. కాని నాకు గుర్తున్నంత వరకు వాళ్ళిద్దరి మధ్య సాన్నిహిత్యం ఏమీ లేదు. మనను ఇవాళ ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో ఏ ఒక్కదాని మీద·నైనా శ్రీ సింగ్ అభిప్రాయాలేమిటో మనకు తెలియదు. ఎవరికీ తెలియదు. పంజాబ్ గురించి కాని, శ్రీలంకలో మన పాత్ర గురించి గాని, సుభాష్ ఘీషింగ్, ఆయన జి. ఎన్. ఎల్. ఎఫ్. గురించి కాని, లక్షలాది మంది పన్ను చెల్లింపుదార్లపై ప్రభావం చూపే కొత్త ప్రత్యక్ష పన్నుల చట్టం గురించి గాని, అంబేద్కర్ గురించీ, ఆయన రిడిల్స్ గురించి గాని శ్రీ సింగ్ ఏమీ మాట్లాడలేదు. ఆయన బోఫోర్స్ గురించి మాట్లాడింది చాలా తక్కువ. ఫెయిర్ ఫాక్స్ గురించి ఎక్కువగా మాట్లాడారు ఎందుకంటే ఆ వివాదంలో ఆయనకు స్వయంగా జోక్యం ఉన్నది గనుక. పార్లమెంటులో ఆయన ఒకే ఒక్కసారి మాట్లాడారు. అదీ ఫెయిర్‌ఫాక్స్ చర్చ సందర్భంలో తన మీద నిందను రూపు మాపుకునేందుకే. శ్రీ విశ్వ నాథ ప్రతాపసింగ్‌కు తమ విషయాల్లో తప్ప మరే విషయంలోనూ ఆసక్తి లేదా? భారత దేశానికి ఆర్థిక మంత్రిగా, రక్షణమంత్రిగా, అతి పెద్ద రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పని చేసిన వ్యక్తి ఆలోచించడానికి ఫెయిర్ ఫాక్స్ అన్న ఒక్క విషయమే ఉన్నదా? ఏ విషయంలోనయినా ఆయన చేర్చగలిగిన కొత్త విషయాలేమీ లేవా? మరి అటువంటి వ్యక్తి గురించి మనం ఎందుకు ఉత్సాహం చూపాలి?

పంజాబ్, శ్రీలంకల గురించి తాము ఏమను కుంటున్నారో శ్రీ సింగ్ మనకు చెప్పాలి. మన ఆర్థిక వ్యవస్థ దిగజారు తున్నదని ఆయన అను



కుంటుంటే, ఎందుకు అలా అనుకుంటున్నారో చెప్పాలి రాబోయే బడ్జెట్ ఎలా ఉండాలనుకుంటున్నారో చెప్పాలి ఫెయిర్ ఫాక్స్ కన్నా, చివరికి బోఫోర్స్ కన్నా కూడా చాలా ముఖ్యమైన విషయాలు ఇవి శ్రీ సింగ్ ఒక రాజకీయవేత్త ఆయన కాదన్నప్పటికీ అందరూ అలాగే అనుకుంటున్నారు కనుక ఆయన ప్రజల వోట్లను కాంక్షిస్తూ ఉండి ఉంటారు ఆయన కూచున్న గోడమీది నుంచి దిగి తాను ఎంచుకున్న దానికంటే కాస్త ఎక్కువగా తన గురించి మనకు చెప్పుకోవాలి ఎందుకంటే ఇప్పటి దాకా ఆయన చాలా తక్కువ చెప్పుకున్నారు

నిజానికి ఆయన నిలబడవలసిన, అక్షరాలా నిలబడవలసిన సమయం ఆసన్నమైంది జరగనున్న ఏదో ఒక ఉపఎన్నికల్లో పోటీ చేస్తూ ఆయన నిలబడాలి అమితాబ్ బచ్చన్ పోటీ చేసినా చేయక పోయినా సింగ్ అలహాబాద్ నుంచి పోటీ చేయాలి ఎందుకంటే ఈ ఆటపాల మనిషి అక్కడ నిలబడి గెలిస్తే, ఇక పాలక ముఠా తాను పరీక్షలో గెలిచానని వేలాది ఇళ్ళక్కి అరుస్తుంది. విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ మీద అమితాబ్ గెలవగలడు గనుక ఈ ఇళ్ళక్కి అరవడానికి వీల్లేకుండా చెయ్యవచ్చు సాధారణ ఎన్నికలకు మొదటి ఎత్తు వేసినట్లే అవుతుంది గెలిచినా గెలవక పోయినా ఎన్నికల్లో పోటీ చేయకుండా విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ తన మోర్చాకు గాని, ప్రతిపక్షానికి గాని నాయకుడిగా చెప్పుకోవడానికి వీలులేదు ఢిల్లీ గద్దెకు పోటీదారుగా ఆయనను తీవ్రంగా గుర్తించాలంటే ఆయన అటూ ఇటూ జాగ్రత్తగా ఉండడం అసాధ్యం

ఇప్పటికే సింగ్ ఏడాది క్రితం కాంగ్రెస్‌ను వదిలినప్పటి కన్నా ఎక్కువ ప్రతిపక్ష పార్టీలున్నాయి పార్టీ అవునో కాదో స్పష్టం కాని జనమోర్చా ఉంది తికాయత్ భారతీయ కిసాన్ యూనియన్ ఉంది అది కూడా పార్టీ అవునో కాదో తెలియదు పుణే లోనూ, చుట్టుపట్ల శరద్ జోషి స్వంత రైతుల సంస్థ ఉంది బొంబాయిలో, మహారాష్ట్రలో కూడా శివసేన ఉంది తమిళనాడులో ఒకటి బదులు రెండు ఎ ఐ ఎ డి ఎం కె లు వచ్చాయి ఎన్నికలకు ముందు ఈ అన్ని బృందాలు కూడా తమతమ వాటాలు అడుగుతాయి కాంగ్రెస్ కోరుకునేది అదే వాస్తవానికి ఈ అన్ని బృందాలు పాలక పార్టీ కనుసన్నలలో నే ప్రారంభించ బడ్డాయేమోననే ఊహ కూడా ఉంది వాస్తవంగా వాటిని ఆవిర్భవింప జేసింది పాలక పార్టీ కాకపోవచ్చు అవన్నీ అంతిమంగా పాలకపార్టీకే ఉపయోగపడతాయని అనుమానం ఉంది కేంద్రంలో మిశ్రమ ప్రభుత్వం గురించి రామకృష్ణ హెగ్డే మాట్లాడడం మొదలు పెట్టారు భారతీయ వోటర్లకు మిశ్రమ ప్రభుత్వమంటే అసహ్యం ప్రతిపక్షాన్ని తీవ్రంగా పరిగణించాలంటే అది అతుకుల బొంతలాంటి మిశ్రమ ప్రభుత్వం కన్నా శ్రేష్ఠమైన దాన్ని రూపొందించ గలగాలి

జనమోర్చాను రద్దు చేయడం ద్వారా విశ్వనాద ప్రతాప్ సింగ్‌ని నాంది పలకనివ్వండి ఎందుకంటే పేరు తప్ప మోర్చా అంటూ ఏమీ లేదు ఉన్నదల్లా ప్రజల్ని గందరగోళ పరచడానికే రెండు, మూడు ఏకాభిప్రాయం గల పార్టీల, బృందాల మిశ్రమ సంఘటన సాధ్యమవుతుంది లేదా సుసాధ్యమైన ప్రతిపాదన అవుతుంది కాని ఓ డజను బృందాలు ఉంటే, అవన్నీ దేనిదారిన అది నడుస్తుంటే సంఘటన సాధ్యం కాదు రాజకీయాలలో ఇద్దరు ఉండడం కూడా గుంపే □

## నీతి - రీతి

చేట పెయ్యని చూపి
చేపిన పాలని కడవల్లోకి పితికి
కాసులకమ్ముకునే నీతి'
ఎన్నికల వాగ్దానాల
ఎరలో చిక్కిన ఓటర్ల
అమాయకత్వపు మంచితనం
అసమర్థతగా తీసుకొనే రీతి''

–బలిజేపల్లి సత్యనారాయణ






## ఉట్టిపడేలా చేసే లిరిల్ తాజాదనం.

# లిరిల్

తాజాదనపు సబ్బు

వళ్లు పులకరింపజేసే నిమ్మకాయల తాజాదనంతో.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం . 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు (1938-1972)

6 5.88, 13 5 88

శ్రీ విభవ నామ సం. వైశాఖ బ పంచమి బ ద్వాదశి

**సంపుటము 80 : సంచికలు 37; 38**

ముఖ్య సంపాదకుడు

**శివలెంక రాధాకృష్ణ**

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు

**మతుకుమల్లి మాధవరావు**

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 3.00 |
| పోస్టులో 6 నెలల చందా | రు 87 10 |
| పోస్టులో 12 నెలల చందా | రు 174 20 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి సుమలత

(ఫొటో ఈశ్వరి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :






## సీరియల్స్

'విశాలనేత్రి మాధవి ముఖచిత్రంతో వెలువడిన 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా చూడ ముచ్చటగా ఉంది మా అభిమాన రచయిత "మల్లాది" గారి "వినాయకరావు పెళ్ళి' సీరియల్ సూపర్బ్ ఎన్నో ప్రత్యేకతలతో పరుగులు తీస్తూ, ఆసక్తి కల్గిస్తూ తదుపరి సంచిక కోసం ఎదురు చూసేలా చేస్తున్నాయి

– మడగల గోవిందరావు, అనకాపల్లి

★ ★ ★

ఆంధ్ర సచిత్ర వారపత్రిక మాధవి ముఖ చిత్రంతో అత్యంత రమణీయంగా ఉంది రచయిత్రి దేవినేని ఉషగారి కొత్త సీరియల్ ఆదిలోనే ఆకట్టుకుంది మల్లాది గారి వినాయకరావు పెళ్ళి సీరియల్ చదువుతుంటే వినాయకరావు (రాజేంద్రప్రసాద్) శాస్త్రి (చంద్రమోహన్)గా భావించుకొని ఓ కామెడీ పిక్చర్ చూస్తున్నట్టుగా ఫీలవు తున్నాము ఇంత చక్కటి హాస్యభరితమైన సీరియల్ అందించిన మల్లాదిగారికి నా కృతజ్ఞతలు

– మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

★ ★ ★

మల్లాది వెంకట కృష్ణమూర్తి గారి సీరియల్స్ ఏ సీరియల్ కా సీరియల్ స్పెషల్‌గా ఉంటాయి సినిమాను దృష్టిలో పెట్టుకొని సినిమా తీయాలనుకొనే నిర్మాతలకు గాని, డైరక్టర్లకు గాని ఏలాంటి ఇబ్బందులు లేకుండా, అనుకూలంగా రాస్తుంటారు "వినాయకరావు పెళ్ళి ని ఇదే పేరుతో సినిమా తీస్తే చాలా అద్భుతంగా ఉంటుందని నా అభిప్రాయం ఈ వారం ప్రారంభ మయిన సీరియల్ మరోమలుపు చాలా బాగుంది రచయిత్రి దేవినేని ఉషగారి రచనలు ఏది ఇంతవరకు చదవలేదు ఇదే ప్రథమం

– టి శ్రీహరినాయుడు, నెల్లూరు

★ ★ ★

మాధవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో దేవినేని ఉషగారి మరో మలుపు సీరియల్ చాలా బాగుంది

– ఎస్ ఎం భాషా, మచిలీపట్నం

★ ★ ★

దేవినేని ఉషగారి 'మరో మలుపు' ఆరంభంలోనే ఆకట్టుకుంది ముచ్చటగొలిపే శైలి పనసతొనలు అరటాకులో మేం తిన్నట్టుగానే ఫీల్ అయ్యాం

– రాజవనిత, గుంటూరు

★ ★ ★

11,18–3–88 సంచిక మాధవి ముఖచిత్రంతో వెలువడిన సంచికలో కొత్త సీరియల్ దేవినేని ఉషగారి 'మరో మలుపు" సీరియల్ మమ్మల్ని మొదట్లోనే ఆకట్టుకొంది పవిత్రపాపి సీరియల్ కోసం ఎదురు చూస్తున్నాము

– ఎల్ వి సుబ్బయ్య, కె ప్రేమామణి, గూడూరు

★ ★ ★

కొత్త సీరియల్ దేవినేని ఉషగారి మరోమలుపు సూపర్బ్ రెండు విభిన్న మనస్తత్వాలు గల సారది, ఆనంద్‌ల చేత కథ నడిపించడంలో సఫలీకృతురాలు అయినారు రచయిత్రి

– ఎ సురేష్‌కుమార్, హైదరాబాద్

★ ★ ★

ఈ వారం ప్రారంభమైన మరో మలుపు కొత్త సీరియల్ వాస్తవ జీవితాలకు దగ్గరగా వుంది స్టోరీ స్లోగా సాగుతున్నా, ఒక డబ్బు గలవాడికి, సామాన్యుడికి (ప్రేమలో) తేడా ఏమిటో ఈ సీరియల్‌లో ఆనంద్. సారధి పాత్రలతో అల్లిన కథ చాల బాగుంది రచయిత్రి దేవినేని ఉషగారిని ఈ సీరియల్ ప్రారంభంలో ఇంత చక్కగా వ్రాసి చదివేటట్టు చేసినందుకు అభినందిస్తున్నాను

– చలపాక ప్రకాష్, విజయవాడ

★ ★ ★

దేవినేని ఉషగారి కొత్త సీరియల్ 'మరోమలుపు ప్రారంభంలోనే ఆకట్టుకుంది

– జె సుబ్రహ్మణ్యశాస్త్రి, జక్కరసకుప్పం

★ ★ ★

## కథలు

11,18–3–88 నాటి మాధవి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో కుమారి కె కుమారి గారి ప్రేమకాటు కథ ఆడదాని మనసు పూర్తిగా తెలుసుకోలేక మనసులోనే ప్రేమించే వారికి హెచ్చరికగా వుండి రాజశేఖర్ లాంటి ఎందరో వున్న మన సమాజంలో కాస్తయినా మార్పు రావాలని కోరుకుంటున్నాను రచయిత్రికి దన్యవాదాలు'

– బందిగి బాలరాజు, నారాయణపేట

## ధర్మపథం

11,18–3–88న వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక మాదవి ముఖచిత్రం మనోహరంగా వుంది

డబ్బు ఉన్నందుకు ఖర్చు చేయవలసినదే' కాని, చేసే వ్యయం అనవసరమైనది కాకుండా సముచితమైనదిగా ఉండాలి యీ సందేశాన్ని తమ ధర్మపథం శీర్షికలో చక్కగా వివరించారు శ్రీ బులుసు వేంకట రమణయ్య గారు

– జిట్టా మణిమాలా మోహన్, కడప

## గమనిక

24-4-88, 29-4-88 సంచికలోని 54వ పేజీలో "ఆడపిల్లలు-అనుభవాలు సీరియల్ నవల పేరు, రచయిత హరికిషన్ పేరు ఉన్న బాగం కొన్ని కాపీలలో సరిగా ముద్రణ కాలేదు పాఠకులకి కలిగిన ఈ అసౌకర్యానికి చింతిస్తున్నాము

★ ★ ★

**సకాలానికి అందని కారణంగా ఈవారం "షేర్ మార్కెట్‌లలో పెట్టుబడులు" శీర్షిక ప్రచురించలేకపోతున్నాము. —సం.**

సీరియల్



# వినాయకరావు పెళ్ళి

మల్లాది వెంకటకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

ఆ రోజు వుదయం రమణమూర్తి ఇంట్లోంచి గట్టిగా సుప్రభాతం వినిపిస్తున్నా మెలకువ రాలేదు వినాయకరావుకి

అబ్బబ్బ! చెవులు చిల్లులు పడేలా ఏమిటీ గోల? విసుక్కున్నాడు పూజారి శతబిషం

వినాయకరావు నాలుగైదు రోజుల నించి ఇదివరకటిలా రమణమూర్తిని పట్టించుకోవడం లేదండి ఉదయం నీళ్ళు ఆదిలక్ష్మి పట్టుకునే దాకా ఆగి ఆ తర్వాతే పట్టుకుంటున్నాడు హక్కుల కోసం పోరాడటం లేదెందుకో చెప్పింది శతబిషం భార్య

కనుక్కుంటా నుండు

శతబిషం వినాయకరావు గదిలోకి వెళ్ళి అతన్ని నిద్ర లేపాడు బద్ధకంగా ఆవలిస్తూ లేచిన వినాయకరావు అడిగాడు–

ఏమిటి సంగతి?

ఆ రేడియో వాల్యూం విన్నావా నాయనా? లేచి వెళ్ళి లంకలోకి హనుమంతుడు ప్రవేశించినట్లుగా మరణమూర్తి ఇంట్లోకి వెళ్ళి రేడియో కట్టేసిరా

పుణ్యాం వస్తుంది విందాం చెప్పాడు వినాయకరావు

అంత గట్టిగానా? నీ వరస మాకేం నచ్చడం లేదు నాయనా ఇంటి వాళ్ళతో పోట్లాడుతుంటే కాని మన మాట వినరు

అది నిజమే అనుకోండి ఓ సంవత్సరం పాటుకి సరిపడ ఈ రెండు నెలల్లో పోట్లాడేసానుగా

వాళ్ళ మాటలు వింటున్న శాస్త్రి చెప్పాడు–

వినాయకరావు ఇదివరకటి వినాయకరావు కాదండి, ఇప్పుడు కొత్తవాడు

ఎందుకీ మార్పు నాయనా? అడిగాడు శతబిషం

ఎందుకంటే అకస్మాత్తుగా మనవాడు

శాస్త్రి మాటలకి అడ్డు వచ్చాడు వినాయకరావు–

స్టాప్ దట్ నాన్‌సెన్స్!

ఇప్పుడు లలిత సంగీతం వినిపించింది రమణమూర్తి రేడియోలోంచి వినాయకరావు చెవులు రిక్కించి విన్నాడు

మొదట కుమారి శృతి స్వీయ రచనతో పాడిన పాట "సందియవేళ అందెల రవళి" వింటారు

వినాయకరావు తాదాత్మ్యంగా ఆ పాట వింటూండి పోయాడు శాస్త్రి, శతబిషం మాట లతని చెవిన పడలేదు శతబిషం విసుక్కుంటూ బయటికి వెళ్ళి పోయాడు

వినాయకరావు వంటి మీద టవల్ కప్పుకుని బయటకి వచ్చాడు చేటలో ఆవాలని పోసి ఎండలో పెట్టడానికి వచ్చిన ఆదిలక్ష్మిని చూసాడు ఆమె కూడా వినాయకరావుని చూసింది ఇద్దరి చూపులూ కలుసు కున్నాయి సిగ్గుగా నవ్వింది ఆదిలక్ష్మి వినాయకరావు పలకరింపుగా నవ్వాడు పాట పూర్తయ్యాక

**జరిగిన కథ – 9.** పెళ్ళిచూపుల దగ్గర పాట పాడిన ఆదిలక్ష్మే శృతి అని వినాయకరావు తెలుసుకుంటాడు పోలీసులను కొట్టి నిశ్చితార్థం గండం నుంచి గట్టెక్కిన వినాయకరావు తండ్రితో కేంప్ ఉందని చెప్పి బయట పడ్తాడు ఆదిలక్ష్మి వినాయకరావులు మనసులు ఇచ్చి పుచ్చుకుంటారు సుబ్బలక్ష్మికి వినాయకరావు మనసు తెలిసి పోతుంది ఆదిలక్ష్మికి ఒక బావ ఉన్నాడని అతనితో ఆదిలక్ష్మికి పెళ్ళి నిశ్చితార్థం జరగబోతోందని అధైర్యాలైన తప్పించే ఆలోచన చెప్పమని శాస్త్రిని అడుగుతాడు వినాయకరావు

# పెరుగుదలకి ఒక రుచికరమైన మార్గం గురించి రాశిఫలం చెప్తోంది

# ఫారెక్స్



**వృషభరాశి బాబు**
ఏప్రిల్ 21–మే 21

మీకు రాశిచక్రాలలో నమ్మకం వుంటే, వృషభరాశిలో జన్మించిన బాబు తనకు తానే ఏ పనయినా చేయగలడని భావించవచ్చు సహజరీతిలో ముగ్ధులను చేసే స్వభావం కలిగి తాను నేర్చుకున్న కొత్త విద్యలతో బాబు కుటుంబసభ్యు-లను, ఇంటికి వచ్చేవారిని వినోదపరుస్తూ వుంటాడు బాబును మీరు బలవంతం చెయ్యక్కరలేదు తొందరపెడితే బాబుకు యిష్టం వుండదు తనంతట తానే ఆలోచించాలనుకొంటాడు అతి చిన్న వయసులోనే మీ బాబుకు అందమైన వస్తువులంటే అవగాహన ఏర్పడుతుంది

బాబుకు పువ్వులు చూస్తూవుండడమూ, మీ నగలను పట్టుకు లాగడము యిష్టం బాబు ఏదైనా చెయ్యాలని మీకు వుంటే బుజ్జగించండి ఎందుకంటే బాబుది లొంగని స్వభావం బాబు ఎంతో ముద్దొచ్చేలా వుంటాడు తనని కౌగలించుకుని ముద్దెట్టుకోవాలని కోరుకుంటాడు

మీకు రాశిచక్రాలలో నమ్మకం వున్నా లేకపోయినా పోషకాహారం విషయానికి వస్తే మీరు నమ్మదగినది ఒకటి వుంది— అదే ఫారెక్స్

**4** నెలల నుంచీ మీ బాబుకు 'పాలతో కూడిన ఫారెక్స్ సీరియల్' యివ్వండి. సమగ్రమైన గోధుమ సీరియల్‌తోనూ, సంపూర్ణమైన పాలతోనూ తయారు చేసిన దీనిలో కాల్షియం, మినరల్స్ విటమిన్లు మరియు ప్రొటీన్లు వుండి శీఘ్రంగానూ, అన్ని విధాలా బాబు పెరగడానికి కావలసిన పోషకత్వం అవి అందచేస్తాయి.

**6** నెలల నుంచీ రకరకాల రుచుల కోసమే కాక పూర్తి పోషకత్వం చేరిన ఆహారం కోసం బాబుకి 'ఫారెక్స్-వెజ్' కలిపి యివ్వండి.









**పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

GX/44/244 TEL

# వినాయకరావు పెళ్ళి

వినాయకరావు గట్టిగా చప్పట్లు కొట్టి చెప్పాడు–

వండ్రఫుల్, మార్వలెస్

ఏమిటీ? అంత చెత్త పాటకి, అంత రోత గొంతుకి వండ్రఫుల్లా? మార్వలెస్సా? అడిగాడు శాస్త్రి కావాలని

కోకిల గానం నవ్వులాటకయినా అలా అనకు ఆ కంఠం కేవలం దేవతలకి తప్ప అనితరసాధ్యం చెప్పాడు వినాయకరావు కోపంగా

ఆదిలక్ష్మి సిగ్గుతో తల వంచుకుంది

అబ్బే! నీ టేస్ట్ చాలా పూర్ టేస్ట్ చెప్పాడు శాస్త్రి మళ్ళీ గట్టిగా

నీదే అసలా కంఠం బావుండబట్టే రేడియో స్టేషన్ పని చేస్తోంది శృతి, బాలమురళీకృష్ణ లాంటి వాళ్ళ పాటలు ప్రసారం చేయకపోతే ఎప్పుడో అంతా రేడియోలు అమ్మేసుకునే వారు "

ఏమిటి నాయనా? ఆ పాట నీ కంతగా నచ్చిందా?" అడిగింది ఆదిలక్ష్మి తల్లి కనకమహాలక్ష్మి ఆప్యాయంగా

అవునండి ఆ పాట వింటూంటే ఆపిల్ జ్యూస్ తాగినట్లుంది '

"నిజంగానా? అడిగిందావిడ

అవునండి కుమారి శృతికి సన్మానం చేసి 'నైటింగేల్ ఆఫ్ ఇండియా లాంటి




బిరుదేమయినా ఇవ్వాల్సిందే

ఆవిడ మనసులో ఎంతో సంతోషపడింది

నీ నోటి నించి విసుగు, చిరాకు తప్ప ఇలా పొగడ్త ఎప్పుడూ వినలేదు" చెప్పిందావిడ సంతోషంగా

ఆ రోజు ఆఫీసుకి వెళుతూ గట్టిగా చెప్పాడు వినాయకరావు శతభిషంతో

'సాయంత్రం ఆఫీస్ నించి తిన్నగా ఇంటికి రానండి ఓ ముఖ్యమయిన మనిషిని కలుసుకోవాలి

అలాగా? నేను నిన్ను అడగలేదుగా బాబూ! సాయంత్రం ఆఫీసు నించి తిన్నగా ఇంటికి వస్తున్నావా లేదా అని?

అడక్క పోయినా చెప్తున్నాను మీకు సాయంత్రం పబ్లిక్ గార్డెన్‌లో హెల్త్ మ్యూజియం దగ్గర ఒకరిని కలుసుకోవాలి సరిగ్గా అయిదున్నరకి

'మంచిది

చాలా ముఖ్యమయిన వ్యక్తి '

'అప్పులిచ్చిన వాళ్ళా?' అడిగాడు శతభిషం

కాదు

శాస్త్రితో బయటికి సైకిల్ మీద వెళ్ళి పోయాడు వినాయకరావు. గుమ్మం ముందు కూర్చుని చాకలికి బట్టలు వేస్తూ లెక్క రాసుకుంటున్న ఆదిలక్ష్మి చిన్నగా నవ్వింది ఆ సంభాషణకి అది తనని వుద్దేశించి మాట్లాడిందని గ్రహించింది ఆదిలక్ష్మి

"మా సుబ్బులుతో పెళ్ళి తప్పించుకో డానికి మంచి ప్లేన్ ఆలోచించావా గురూ?" అడిగాడు వినాయకరావు శాస్త్రిని దారిలో

"ఆహ ఇదివరకటి ప్లేనే కొద్దిగా మార్పులు చేసాను "

"ఏమిటది?" అడిగాడు వినాయకరావు ఆసక్తిగా

"నిన్ను నిశ్చితార్థానికి పిలిచింది ఎప్పుడన్నావ్?

'వచ్చే ఆదివారం "

ఇంకా చాలా టైం వుంది రాత్రి బీర్ కొట్టించు ఆలోచిస్తాను

'నో!

అయితే–

నేనూ నో నే చెప్పాడు శాస్త్రి

* * * * * * * * *

ఆ రోజు సాయంత్రం అయిదుంపావునించే వినాయకరావు పబ్లిక్ గార్డెన్‌లో హెల్త్ మ్యూజియం ముందు బీటు వేసాడు అతను వూహించినట్లుగానే ఆదిలక్ష్మి వచ్చింది, అరగంట ఆలస్యంగా

అమ్మయ్య! మీకు అర్థం అయిందో లేదో. వస్తారో రారో అనుకుంటున్నాను" చెప్పాడు వినాయకరావు ఆనందంగా

'బయటికి రావాలంటే మా అమ్మేం అనదు కాని నాన్నగారితోనే చిక్కు" చెప్పింది ఆదిలక్ష్మి

ఇద్దరూ పచ్చటి గడ్డిలో కూర్చున్నారు

"ఇది చదవండి " ఓ వుత్తరం ఇచ్చింది ఆదిలక్ష్మి అతనికి

గబగబా దాన్ని చదివాడు వినాయకరావు

మద్రాస్

డియర్ ఆదిలక్ష్మి,

నేను రాసిన వుత్తరానికి నీ నించి సమాధానం రాలేదు నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో నీ కర్థం కాదు ఐ లవ్ యూ వెరీమచ్ అన్న మాట నాన్నగారు నా పెళ్ళికి నిశ్చితార్థం గురించి 'బయల్దేర మంటూంటే, నేనే వాయిదా వేస్తున్నాను 'నా కిష్టం బావా త్వరగా రండి.' అన్న నీ వుత్తరం చదివితే కలిగే ఆనందం గురించి ఆగాను నీ కోరిక ప్రకారం బేంక్‌లోనే వుద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను రమ్మని రాయి, రెక్కలు కట్టుకుని వచ్చి వాల్తాను అంటే విమానంలో అన్న మాట

నీ

కామేశ్వరరావు

"బేంక్ వుద్యోగం ఏమిటి?' అడిగాడు వినాయకరావు ఆ వుత్తరాన్ని తిరిగి ఆదిలక్ష్మికి ఇచ్చేసి

"మొన్న మా అక్క పెళ్ళిలో చెప్పాడు నన్ను చేసుకోవాలని వుందని ఆ పిచ్చి సినిమా ఇండస్ట్రీలో వున్న వాళ్ళని నేను చేసుకోను ఎల్ ఐ సి లోనో, బేంక్‌లోనో వుద్యోగం చూసుకోమని చెప్పాను ఇది మీ గురించి పూర్తిగా తెలియనప్పటి సంగతి."

"మన కిప్పుడు రెండు సమస్య లున్నాయి ఒకటి మా సుబ్బులు, రెండు మీ కామేశ్వరరావు" దీర్ఘంగా నిట్టూర్చి చెప్పాడు వినాయకరావు

"మనం త్వరపడాలి లేకపోతే తండ్రిచాటు బిడ్డని మా నాన్నగారి సంగతి తెలుసుగా, తిక్క కోపం "

"అంతగా అవసరం అయితే మీ అక్కలా రిజిస్టర్డ్ మేరేజ్ చేసుకుందాం '

"అల్లాంటి సందర్భమే వస్తే ఏ రకం పెళ్ళి చేసుకున్నా దాన్ని లేచి పోవడమే అంటారు నా కది ఇష్టం లేదు మా అక్క ఇంట్లోంచి వెళ్ళిపోయి బావగార్ని చేసుకున్నప్పుడు ఎన్ని గొడవలయ్యాయో, ఎవరెంతగా బాధ పడ్డారో నేను స్వయంగా చూసాను ట్రెడిషనల్‌గా అంతా సవ్యంగా జరగడమే బావుంటుంది" చెప్పింది ఆదిలక్ష్మి.

"అసలు మీ నాన్నగారు నేనంటేనే మండిపడు తున్నారుగా. మరెలా సాధ్యం?" అడిగాడు వినాయకరావు.

"మునిసిపాలిటీ వాళ్ళొచ్చినప్పుడు మీరు మా బంధువుగా నటించి టేక్సు పెరగకుండా చేసారుగా. ఇప్పు డాయనకి మీమీద కోపం లేదు."

"గుడ్డిలో మెల్లన్న మాట."

"ఏదీ. ఓ పాట పాడండి" అడిగాడు వినాయకరావు.

"ఇంత మందిలో నా? నాకు సిగ్గు" చెప్పింది ఆదిలక్ష్మి చుట్టూ చూసి.

"పెళ్ళయ్యేదాకా మనకి ఏకాంతం కుదరడం సాధ్యం కాదు" చెప్పాడు వినాయకరావు నిస్పృహగా.

"ఎల్లుండి కొత్త పాట రికార్డింగ్ వుంది. పదహారో తారీకు ప్రసారం చేస్తారట."

"వెరీగుడ్! పెళ్ళయ్యాక ఈ పాటల మీద వచ్చే ఆదాయంతో బోల్డన్ని చీరలు కొనుక్కోవచ్చు" నవ్వాడు.

ఆదిలక్ష్మి కూడా నవ్వి చెప్పింది.

"అమ్మ కూడా ఆ మాటే అంది. పాటల మీద వచ్చిన డబ్బు బేంక్‌లో నే వుంది. పెళ్ళయిన తర్వాత చీరలు కొనుక్కో మంది."

ఇద్దరూ కాసేపు మౌనంగా వుండి పోయారు.

"ఏమైనా మాట్లాడండి" చెప్పింది ఆదిలక్ష్మి.

"ఏం మాట్లాడాలా అని ఆలోచిస్తున్నాను."

"ఏదైనా?"



# నాటి పెళ్ళి ముచ్చట్లు

నాటి పెళ్ళి ముచ్చట్లు అంటే పెళ్ళి చూపులనించి ఎత్తుకోవాలి కదండి మరి

నేను పెళ్ళి చూపులకు వెళ్ళాను పదిహేనేళ్ళ క్రితం నన్ను ముందు గదిలో కూర్చోబెట్టారు ఈ పెళ్ళి కూతురు ఎలా వుంటుందోనని ఈస్ట్మన్ కలర్‌లో ఊహిస్తున్న సమయంలో, నా ముందు ఒక బస్తా పడేసినంత శబ్దం అయింది 'అర్జునా' 'అర్జునా' అనుకొని

**అంతా వరహీనం అన్నారు!**

తలెత్తాను నిజంగా బస్తాలాగా వుందా అమ్మాయి ఆమె నన్ను చూసి గొప్ప సిగ్గుపడిపోయింది అప్పుడు నా పరిస్థితి, ఎవరైనా ఒక కుండతో నీళ్ళు ఇస్తే బ్రతుకుతానన్నట్లుంది

మమ్మల్ని లోపలి గదిలో కూర్చోమన్నారు ఆ గది గోడలకి బిసి నాటి ఫోటోలు వున్నా [illegible]గా చూస్తున్నాను అమ్మాయిని తీసుకు వచ్చారు

సేమ్ ఫిగర్ గున్న ఏనుగులా వున్న ఆ బస్తా శబ్దం చేసిన అమ్మాయే శారీరకంగా ఏ రకమైన గాయం లేకుండా



పెళ్ళిచూపులు జరిగాయి

అమ్మాయికి నేను అమితంగా నచ్చానుట కారణం నేను నాజూగ్గా వున్నానుట బోలెడు కట్నం అమ్మాయి పేరున ఒక ఇల్లు వుంది

నేను నా గదిలో కూర్చుని "వరలక్ష్మి తల్లీ నిన్నెట్లా ఎత్తుకొందునమ్మా' అని పాట పాడుకొంటున్నాను

"తప్పు నాన్నా అలా అనకూడదు డబ్బు ఎలా వస్తుందిరా? ఆ అమ్మాయి నువ్వంటే పడి ఛస్తోంది" అంది మా అక్క

సరే ఆ అమ్మాయిని చంపడం ఇష్టంలేక వప్పేసుకున్నాను పెళ్ళిలో అందరూ 'వరహీనం' అన్నారు

పెళ్ళిపీటలో మూడు వంతులు ఆమెకే ఒక వంతు నాకు ఆమె కొంచెం జరిగినప్పుడు నేను క్రిందకు పడిపోబోయాను చాలాసార్లు ఎలాగో తాళి కట్టాను పెళ్ళిలో 'అర్జునా' అన్న పదం అనుకుంటూనే ఉన్నాను మేము కట్టించిన దండలు బానే ఉన్నాయి కాని అమ్మాయి వేపువారు కట్టించిన దండలు అమ్మాయి సైజు దృష్టిలో పెట్టుకొని కట్టించి వుంటారు నేను ములిగి పోయాను

తలంబ్రాలు పళ్ళెం ఎత్తి నామీద పోసింది నేను దోసిట్లో బియ్యం వేయబోతున్నాను నా చేతిలో బియ్యం పళ్ళెంలో పోసి, నా తలంబ్రాలు కూడా నా నెత్తిమీదనే పోసింది "తప్పు బుజ్జి అల్లుడిగార్ని పోయనియ్యమ్మా" అంటూంది ఆమె తల్లి

బిందెలో ఉంగరం వేశారు తియ్యమన్నారు ఆమె ముందు బిందెలో చెయ్యి పెట్టింది ఇంక నా చెయ్యి పెట్టడానికి ఖాళీ లేదు యాక్షన్ చేశాను

చివర్న ఫోటో తీస్తుంటే నా ప్రక్కన నిలబడబోయి నిద్ర మత్తులో తూలింది క్షణంలో గండం తప్పింది

ఇక ప్రతి వ్యక్తి జీవితంలో ఆసక్తి కరమైన సంఘటన శోభనం-

తప్పు చెప్పకూడదు అదిగో నా శ్రీమతి చాలా కోపంగా చూస్తోంది శెలవా మరి

-కె. బి. కృష్ణ, పలాస

**ముహూర్తానికింకా టైముంది**

## వినాయకరావు పెళ్ళి

మన పెళ్ళాయ్యాక- నిమ్మకాయలు కొనేప్పుడు పల్చని తోలున్న వాటిని ఎంచుకోవాలి ఎందుకంటే వాటిలో రసం ఎక్కు వుంటుంది కాసేపు ఆలోచించి చెప్పాడు వినాయకరావు

ఫక్కున నవ్వింది ఆదిలక్ష్మి

మళ్ళీ కాసేపు ఇద్దరి మధ్య మౌనం

మళ్ళీ ఏదయినా మాట్లాడండి అడిగింది

ఇందాక నే మాట్లాడితే నవ్వారు

నవ్వించ గలిగేలా మాట్లాడటం అద్భుతమయిన కళ

కొద్ది సేపు తటపటాయించి చెప్పాడు వినాయకరావు

'ప్రతీ పండగకి అరిసెలు చెయ్యాలి అవంటే నాకిష్టం

ఇంకా ఏమేం ఇష్టం?'

స్వీట్స్‌లో మూడు అరిసెలు, అరిసెలు, అరిసెలు బెల్లంవయినా ఓ కే చక్కెరవయినా ఓ కే

ఇంకా?

వినాయకరావు మాట్లాడలేదు మళ్ళీ కాసేపు మౌనం

ఇక నించి మిమ్మల్ని నువ్వు అంటాను చెప్పాడు వినాయకరావు

'అలాగే

మీరేదయినా మాట్లాడండి

మొదట మనకి కొడుకు పుడితే మురళి అని, కూతురు పుడితే రవళి అని పేరు పెడతాం ఆ రెండు పేర్లంటే నాకెంతో ఇష్టం

అలాగే మా తాతయ్య పేరు కలిపి సుబ్బయ్య మురళి అని పెడదాం పిలవడం మురళి అని పిలవచ్చు'

'సుబ్బయ్య అని కూడా పిలవ్వచ్చుగా అదీ మంచి పేరే నవ్వింది ఆదిలక్ష్మి

'మరీ గడుసుగా మాట్లాడానా? అనుమానంగా అడిగాడు వినాయకరావు

'ఊహుఁ నువ్వు అంటానన్నారు

మర్చాను అయితే మంచి దానివి చెప్పాడు వినాయకరావు

కాసేపయాక చెప్పాడు వినాయకరావు



అది 1972, జూన్ 2వ తేది. అంటే మా పెళ్ళి రోజు. ఆనాటి మా పెళ్ళి పందిట్లో, ముహూర్తపు టైము హడావిడిలో అందరు ఎదురు చూస్తుండగా! అయ్యగారి (పురోహితుడు) ఆజ్ఞానుసారము లేచి మంగళసూత్రం చేతబూని నా భార్య మెడలో కట్టబోయేంతలో, 'ఆగు! ఆగు!' అనే మాటలు మా మామగారి కంఠం నుంచి రాగానే! ఆ సందట్లో ఆ మాట విన్న అందరూ (నాతో సహా) ఒక్కసారి నిశ్చేష్టులమై తదేకంగా ఆయన వంక చూచినాము. కాని, అంతలోనే ఆయనే ముహూర్తపు టైము ఇంకా రెండు నిమిషాలుంది' అన్నారు. అంతవరకు కూచో బెట్టి గాని మంగళసూత్రం కట్టనివ్వలేదు. మా మామగారు. ఈ విషయం అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకొని ఇప్పటికీ నవ్వుకుంటాము.



యస్.సత్యనారాయణ,
వనపర్తి,
(మహబూబ్‌నగర్), ఆం. ప్ర.

★ ★ ★

నా వివాహం, మార్చి 1966 సం.లో జరిగింది. శ్రీమతిగారి వూరు కోనసీమకు హృదయసీమ అయిన "అమలాపురం".

ఖత్రా బావమరది!

ఘుంటిముందు షామియానాల క్రింద భోజనాల ఏర్పాట్లు చేశారు. పెళ్ళినాటి మధ్యాహ్నం భోజనాలకు, మా కొత్త దంపతులకు కూడా, బంధువుల మధ్య షామియానాల క్రింద, వెండి కంచాలు పెట్టి అన్నం వడ్డించారు.

మా చిన్న బావమరది "రామం" ఉద్దండుడు. వయస్సు పది సంవత్సరాలైనా, అఖండ మైన తెలివి తేటలు ప్రదర్శించేవాడు.

మా ఎదుట వున్న భోజనాల పంక్తిలో, ఓ ఆకు దగ్గర తన జేబురుమాలు వుంచి, ఆ ప్రక్కా, ఈ ప్రక్కా వున్న సీట్లల్లోకి మా మావయ్యల నిద్దర్నీ ఆహ్వానించి కూర్చో పెట్టాడు.

అప్పుడే వేసవి మొదలైంది. ఉక్కబోత విపరీతంగా వుంది. వెంటనే మా "రామం", వెళ్ళి, రెండు విసనకర్రలు తీసుకొచ్చి, మా మావయ్య లిద్దరికీ అందించాడు. వాళ్ళవి భారీకాయా లవ్వడంతో, వాళ్ళు గబగబా వాటిని అందుకొని విసురు



కోవడం మొదలు పెట్టారు. వెంటనే వాళ్ళు మా రామంకు "థాంక్స్ బాబూ!" అని మెచ్చుకొన్నారు కూడా.

యిది ఎక్కడి నుంచో గమనించిన మా నాన్నగారు గబగబా మా మావగారిని పిల్చి "చూడండి! బావగారూ! మీ వాడు యింత చిన్న వయస్సులోనే ఎంత మర్యాద, ఎంత గౌరవం చూపిస్తున్నాడో!" అని మా రామంను తెగ ప్రశంసించడం మొదలు పెట్టారు.

వెంటనే మా మావగారు, అతన్ని మెచ్చుకోలుగా చూసి, "అదిరా బాబూ మగపెళ్ళి వారికి అలా మర్యాద చెయ్యాలి!" అన్నారు నవ్వుతూ.

దానికి వాళ్ళ పుత్ర రత్నం, "అదికాదు నాన్నా! వాళ్ళిద్దరూ విసురుకొంటుంటే, మధ్య నున్న నాకు బాగా గా తగులుతుందని, ఆ యిద్దరికీ చెరో విసనకర్రా యిచ్చానంతే!" అన్నాడు.

అంతా ఒక్కసారి ఘొల్లు మన్నారు మా నాన్నగారూ, మావగారూ నెమ్మదిగ బయటకు జారుకొంటుంటే, మా మావయ్య లిద్దరూ విసనకర్రలు వెనక్కి విసిరేశారు ముఖం మాడ్చుకొని.

బచ్చు వీర్రాజు, రాజమండ్రి □

---

"ఇంట్లో గాజు గ్లాసు పగిలితే, చిన్న చిన్న గాజు ముక్కలని తుడవడానికి తడి తువ్వాలుని వుపయోగించాలి."

"ఇవన్నీ మీ కెలా తెలుసు?" అడిగింది ఆదిలక్ష్మి.

"పుస్తకాల్లో చదివి గుర్తు పెట్టుకుంటాను. నిత్య జీవితంలో వుపయోగించేవి జోకులు, కార్టూన్లు కావు. ఇవే. నే తొడుక్కున్న ఈ చొక్కా జేబుకి బాల్‌పెన్ లీక్ అయి నల్లటి ఇంకు అంటి అసహ్యంగా తయారైంది. లాండ్రీవాడు అది పోవడం కష్టం అన్నాడు. చిటికెడు తినే సోడాని నీటిలో కలిపి ఆ మరక మీద రుద్దాను. అరగంటలో ఆ మరక మటుమాయం! లేకపోతే ఈ చొక్కా వృధా అయేది కదా!"

ఆదిలక్ష్మి చుట్టూ చూసి చెప్పింది...

"చీకటి పడుతోంది. బయల్దేరాలి."

"అందరి ప్రేమికుల్లా 'ఐ లవ్ యూ' లాంటి కబుర్లు చెప్పక పోవడం వల్ల నీకు కోపం వచ్చిందా?" నడుస్తూ అడిగాడు వినాయకరావు.

"అబ్బే! లేదు."

"ఇలాంటివి మానవ జీవితానికి ఎంతో వుపయోగం. మన పెళ్ళయ్యేలోగా ఇంకా చాలా చెప్తాను" చెప్పాడు వినాయకరావు.

పడుకున్నాక ఆ రాత్రి ఆదిలక్ష్మి వినాయకరావు గురించి ఆలోచిస్తుంటే అతను పబ్లిక్ గార్డెన్‌లో చెప్పినవన్నీ గుర్తు వచ్చాయి. మళ్ళీ ఫక్కున నవ్వింది.

"ఎందుకే?" అడిగింది కనకమహాలక్ష్మి కూతుర్ని.

"ఏం లేదు."

తన తల్లికి వినాయకరావు గురించి చెప్పాలా, వద్దా అని కాసేపు ఆలోచించింది. అవకాశం వచ్చినప్పుడు చెప్పాలి అనుకుంది.

ఆ రాత్రి శాస్త్రి బార్‌లో వినాయకరావు చేత చిన్న తేలు కొనిపించాడు. తేలంటే వాళ్ళ భాషలో క్వార్టర్ బాటిల్. మంత్రగబ్బ హాఫ్, పాము ఫుల్ బాటిల్.

"ఇప్పుడు మంచి ఐడియా చెప్పు" అడిగాడు వినాయకరావు తేలు విషం శాస్త్రికి పూర్తిగా ఎక్కేక.

"సుబ్బులు గురించేనా?" ఇంకా రాలేదు, త్వరలో వస్తుంది" చెప్పాడు శాస్త్రి మత్తుగా.

* * * * *



# వినాయకరావుపెళ్ళి

శాస్త్రి తెల్లవారుఝామున రెండుం పావుకి వినాయకరావుని నిద్ర లేపి చెప్పాడు

"నాకో మంచి ఐడియా తట్టింది"

"టైమెంతయింది?" అడిగాడు వినాయకరావు కళ్ళు తెరవకుండానే

"రెండుంపావు"

"ఇంత రాత్రా? రేపు వుదయం మాట్లాడుకుందాం"

"రేపు వుదయందాకా నాకు గుర్తుండదు నువే గుర్తుంచుకోవాలి ఇటు కుదరకపోతే అట్నించి నరుక్కురావాలి"

శాస్త్రి ఆ ఐడియాని చెప్పాడు

*　　*　　*　　*　　*

వినాయకరావు తండ్రి పొలం నించి ఇంటికి వచ్చాక ఎప్పటిలా ఎద్దులని బండి నించి వేరు చేసి, కాళ్ళు, చేతులు కడుక్కుని బట్టలు మార్చుకున్నాడు

అన్నం వడ్డించింది చాముండేశ్వరి ఆయన భోజనం అయాక ఓ కవరు డాంబికేశ్వరరావుకిచ్చి చెప్పింది

"పోస్ట్‌లో వచ్చిందిది"

ఆయనకి కొడుకు నించి తప్ప మరెక్కడనించీ వుత్తరాలు రావు ఆ కవరు




మీది చిరునామా వినాయకరావుది కాదు సుబ్బలక్ష్మి తండ్రి షణ్ముగరావుదీ కాదు కొత్తవారిది కవరు చింపి అందులోంచి ఓ వుత్తరం తీసి చదివాడు పూర్తిగా చదివాక ఆయన మొహం పాలిపోయింది

"ఓసి అప్రాచ్యదానా" అన్నారాయన బయటకి

"నన్నెందుకు తిడతారు? ఏం చేసానని?" అడిగింది చాముండేశ్వరి

"నిన్ను కాదే తిట్టింది సుబ్బుల్ని"

"అదేం చేసింది దూరంగా వున్నదాన్ని తిడతారు?" అడిగింది చాముండేశ్వరి

"ఎందుకో ఈ వుత్తరం చదివితే తెలుస్తుంది"

"నాన్చక ఇంతకీ సంగతేమిటో చెప్పండి"

"ఈ వుత్తరాన్ని రాసింది సుబ్బలక్ష్మి ప్రేమించే ఈశ్వరరావు"

"ఈశ్వరరావెవరు?"

"సుబ్బలక్ష్మి, ప్రియుడని చెప్పాగా"

"మన సుబ్బులు ఎవర్నో ప్రేమిస్తోందా?" ఆశ్చర్యంగా అడిగింది చాముండేశ్వరి

"విను చదువుతున్నాను బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన డాంబికేశ్వరరావు గారి సన్నిధికి, విజయవాడ వవాస్తవ్యుడయిన ఈశ్వరరావు వ్రాయు విన్నపములు

అయ్యా, నేను విజయవాడలో రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయములో ఓ చిరుద్యోగిని పోయిన వేసం కాలం శెలవులకి షణ్ముగరావు కూతురు సుబ్బలక్ష్మి మా ఇంటి సందులో ఓ పెళ్ళికి విచ్చేసినది ఆ పెళ్ళిలో మా రూపులు, మనసులు తనువులు కలిసినవి. సుబ్బలక్ష్మిని నేను తప్ప పరులు చేసుకోగూడదన్న నిర్ణయం ఆ రాత్రే తీసుకున్నాను ఇందాకనే సుబ్బలక్ష్మినించి ఉత్తరం వచ్చినది అందులో మీ అబ్బాయి చి వినాయకరావుకి ఆమెనిచ్చి వివాహం చేద్దామనుకుంటున్నారని, త్వరలో నిశ్చితార్థం జరపబోతున్నారని రాసినది ఇది అన్యాయమని తెలియ చేయడానికి ఈ విన్నపాలు రాస్తున్నాను మా పవిత్ర ప్రేమకి మీరంతా అడ్డు వచ్చుచున్నారనియూ, మీకు మా ప్రేమ వృత్తాంతము తెలియదనియూ భావించి ఈ లేఖ వ్రాయుచున్నాను మీ అబ్బాయికి మరో సంబంధం చూసుకోమని కోరుచున్నాను. సుబ్బలక్ష్మి ఈ విషయము తన తండ్రితోగాని, మీతోగాని ప్రస్తావించడానికి సిగ్గుపడుచున్నదని తెలిసి నేనే వ్రాయుచున్నవాడను

మీ శ్రేయోభిలాషి,
ఈశ్వరరావు

పరా సుబ్బలక్ష్మి వక్ష భాగమున, కుడి వైపున (పాత) రాగి నయా పైసంత పుట్టుమచ్చ వున్నదని నాకు తెలియునని మీరు గ్రహించగలరు

చాముండేశ్వరి వెంటనే ముక్కు మీద వేలేసుకుంది

"ఛీ ఛీ సన్నాసి సంబంధం" చెప్పాడు డాంబికేశ్వరరావు

"సుబ్బలు నాతో నయినా మాట మాత్రానికయినా ఈ విషయాలేం చెప్పలేదు సుమండీ" చెప్పింది చాముండేశ్వరి

"ఇంకే మొహం పెట్టుకుని సుబ్బుల్ని ఈ ఇంటి కోడలుగా తెచ్చుకుంటాం? చిన్నప్పట్నించి చూస్తున్నాం కాబట్టి దానికి ఎక్కడ పుట్టుమచ్చుందో మనకి తెలుసు ఈ విజయవాడ ఈశ్వరరావుకి ఎలా తెలుసు?"

"అవును సుమండి సుబ్బలక్ష్మి ఇంతటి నెరజాణ అనుకోలేదు"

ఆ విషయం మీద ఇద్దరూ అరగంట సేపు ఆశ్చర్యపోయారు తర్వాత పావుగంటసేపు సీరియస్‌గా ఆలోచించారు

"ఈ విషయం షణ్ముగానికి తెలీదు, తెలిస్తే దాని తోలు వలిచేస్తాడు వాడికసలే, పిచ్చి కోపం" చెప్పింది చాముండేశ్వరి

"ఈ సంగతి షణ్ముగానికి తెలిసీ, దాచి మనకి అంటగడుతున్నాడని నా అనుమానం" చెప్పాడు డాంబికేశ్వరరావు

"అలానే అయి వుండచ్చు" వప్పుకుంది చాముండేశ్వరి

ఈశ్వరరావు మనకో వుత్తరం రాయడం మంచిదయింది మనం కూడా ఏం తెలీనట్టే గుంబనంగా వుండాలి" చెప్పాడు డాంబికేశ్వరరావు

"దగ్గరి వాళ్ళం కాబట్టి మనం గుంభనంగా వుంటాం ఇదే పరాయి సంబంధం అయితే ఈ వుత్తరం పిల్ల తండ్రికి పంపించే వాళ్ళు" చెప్పింది చాముండేశ్వరి

"నాకప్పుడే అనిపించింది నిశ్చితార్థం అనుకున్ననాడే మన వినాయకం పోలీస్ స్టేషన్‌కి వెళ్ళడం ఏమిటి?"

"సుబ్బలక్ష్మి మేడపైకెళ్ళి మనవాడితో ఏదో మాట్లాడిందారోజు ఈశ్వరరావు గురించే అయి వుంటుందంటారా?"

"నా బొంద గురించి ఏదయితేనేం మనకి ముళ్ళ కంచెలో మన పట్టు పంచె పడితే ముళ్ళకి చిరక్కుండా తీసుకున్నట్టుగా, జాగ్రత్తగా షణ్ముగానికి కోపం రాకుండా ఈ సంబంధం తప్పించాలి లేకపోతే జీవితాంతం విరోధం" చెప్పాడు డాంబికేశ్వరరావు

## ...జ్ఞానం – వినోదం

–బాబ్‌బ్రౌన్



**...మస్య**

...క్కువ తడిగల నీళ్ళు

**...వసరం**

...ండు కాగితాలు, స్వచ్ఛమైన ...ళ్ళు, సబ్బు నీళ్ళు

**...ఈ విధంగా ...చేయండి**

...గితాలను వర్తుల స్థంబా...రంలో చుట్టండి ఈ ...గితపు చుట్టలను నీటికి ...కాకించి వదిలేయండి ...బ్బు నీటిలోని కాగితపు ...చుట్ట త్వరగా మునిగి ...పోతుంది

**ఇలా ఎందుకని?**

రెండు పాత్రలలోని నీరు తడిగానే ఉంటుంది కాని సబ్బు నీళ్లలో ఉపరితల వత్తిడిని సబ్బు తగ్గిస్తుంది ఇంకో మాటలో చెప్పాలంటే సబ్బు పాత్రలోని నీళ్లను ఎక్కువ-తడిచేస్తుంది కాబట్టి కాగితపు పొరలలోనికి సబ్బు నీరు తేలికగా చొచ్చుకుని పోయి కాగితాన్ని మునిగేటట్టు చేస్తుంది

## వినాయకరావు పెళ్లి

"ఎలా? నిజం చెప్పకపోతే ఏమని చెప్తారు?" అడిగింది చాముండేశ్వరి

"అదే ఆలోచిస్తున్నాను" చెప్పాడు డాంబికేశ్వరరావు

మర్నాడు వుదయం మరో వుత్తరం వచ్చింది ఆయనకి అది హైద్రాబాద్ వినాయకరావునించి ఆ కవరు చింప వుత్తరం సుబ్బలక్ష్మి పొటో ఒకటి బయటికి తీసాడు ఆ పొటో వెనక 'నా రాజాకి, ప్రేమతో' అని రాసి సుబ్బలక్ష్మి సంతకం వుంది వెంటనే వుత్తరం చదివాడు

హైద్రాబాద్,

నాన్నగారికి అనేక నమస్కారాలతో,

షణ్ముగ మామయ్య ఆదివారంనాడు నిశ్చితార్థానికి రమ్మని రాసాడు వాళ్ళ వూరుకి, నీవు కూడా వస్తున్నావని కూడా రాసాడు బయల్దేరదామనుకుంటే నిన్న నాకు వుత్తరం విజయవాడనించి వచ్చింది ఎవరో ఈశ్వరరావుట మన సుబ్బుల్ని ప్రేమించాడట సుబ్బులు కూడా ప్రేమించిందిట తనకి సుబ్బులు పంపిన పొటోని నాకు నిదర్శనంగా పంపాడు దాన్ని నీకు పంపుతున్నాను ఆ వుత్తరం చదివితే అతను రాసింది నిజమేననిపించింది కొన్ని విషయాలు చదివితే మీకు బాదేస్తుందని పంపడం లేదు ముందర మామయ్యకే ఈ విషయం రాద్దామనుకున్నాను కాని మామయ్య సంగతి నీకు తెలుసుగా అందుకని నీ సలహా తీసుకుని రాయొచ్చని ఆగాను సుబ్బుల్ని వాళ్ళ చెరువులోకి తోసి చంపినా చంపగలడు

నాకు అంతుబట్టని విషయం ఒకటే సుబ్బులి వీపు మీద జాకెట్టు లోపల వున్న కాలిన మచ్చ గురించి వీడికెట్లా తెలిసింది? అంతా అగమ్య గోచరంగా వుంది

నీ పుత్రుడు
వై వి రావ్

'ఒరే ఈశ్వరరావు అసాధ్యం కూలా' మనవాడి ఎడ్రస్ కనుక్కొని వాడికే రాసాడన్న మాట ' ఆశ్చర్యపడింది చాముండేశ్వరి

"సుబ్బులే రాయమని సలహా ఇచ్చి వుంటుంది లేకపోతే వాడికి ఈ పెళ్ళి గురించి, మన ఎడ్రసులు ఎలా తెలుస్తాయి?" మండి పడ్డాడు డాంబికేశ్వరరావు

"ఇదేదో కలియుగ బారతంలా వుంది" చెప్పింది చాముండేశ్వరి

"కోడలి గుణం చెడ్డదయితే వంశమంతా చెడ్డదవుతుంది ఈ పెళ్ళికి నేను' చస్తే వప్పుకోను" చెప్పాడు డాంబికేశ్వరరావు గట్టిగా

"నేను కూడా వప్పుకోను నంగనాచి పొటో మీద ఏం రాసిందో చూసారా? నా కాబోయే బర్తకి అని ' కోపంగా పొటోలోని సుబ్బలక్ష్మి బుగ్గ మీద పొడిచి చెప్పింది చాముండేశ్వరి

"మన అదృష్టం బావుండబట్టి సరిపోయింది లేకపోతేనా? తర్వాత పిసుక్కు చచ్చేవాళ్ళం"

"మన వినాయకం అసలే అమాయకుడు "

ఆ రాత్రి చెప్పింది చాముండేశ్వరి

"నాకు అనుమానం అండి"

"ఏమిటి?"

"ఎవరయినా గిట్టని వాళ్ళ పని కాదు కదా ఈ ఉత్తరాలు?"

"నాకూ ఆ అనుమానం వచ్చింది ఉత్తరాలు సరే పొటో మాటేమిటి?" అడిగాడు డాంబికేశ్వరరావు

"అవును పంపితే దాన్ని మనవాడికే పంపాలి కాని వాడికి ఈశ్వరరావునించి పోస్టులో వచ్చింది కాబట్టి నిజం అయి వుండాలి" చెప్పింది చాముండేశ్వరి తల వూపి

"ఈ రోజుల్లో ఈ నవలలు, సినిమాలు, టి వి సీరియల్స్ అన్నీ పిల్లల్ని చెడగొట్టేస్తున్నాయి పల్లెటూరి బొంద, దానికి ప్రేమేమిటి నా మొహం" విసుక్కున్నాడు డాంబికేశ్వరరావు

"నిజానికి మీరు నా మొహం సరిగ్గా చెసింది శోభనం గదిలోనే "

"నేను ముందే చేసి వుండాల్సింది అది సరే కాని రేపు ఉదయం షణ్ముగం దగ్గరకి వెళ్లాలి నీవు బయలుదేరు "

"వెళ్ళి?" అడిగింది చాముండేశ్వరి

"చూస్తావుగా నీ భర్త ఎంతటి శకుని మామో కర్రా విరక్కుండా, పామూ చావకుండా పని పూర్తి చేసుకుని సాయంత్రం తిరిగి చగ్గా వద్దాం" నవ్వాడు డాంబికేశ్వరరావు

*    *    *    *

"ఈపాటికి మా వాళ్ళకి నా వుత్తరం చేరి వుంటుంది" ఆఫీస్‌లో ఆ రోజు లంచ్ అవర్‌లో చెప్పాడు వినాయకరావు శాస్త్రితో

"ఈపాటికి సుబ్బలక్ష్మితో నీ పెళ్ళి రద్దయి వుంటుంది"

"ఆ ఈశ్వరరావెవరో ఎంక్వయిరీ చేస్తే?"

"వాడి చిరునామా తెలియదుగా, తెలుసుకుని వెళ్ళినా, మీ సుబ్బలక్ష్మి పెళ్ళికి గత ఏడాది హాజరయిన ఆ సందులోని ఈశ్వరరావు ఇప్పుడక్కడ లేడు కాబట్టి పర్వాలేదు "

"పాపం అమాయకమయిన సుబ్బలక్ష్మి మీద ఎంతటి అపనింద వేసాంరా, ఆ పుట్టు మచ్చల గురించి రాసి?" బాదగా చెప్పాడు వినాయకరావు

"మన పథకంలో నీకు మొదటినించీ నచ్చని బాగం, బాగా పని చేసే భాగం కూడా అదే మీ అమ్మ చస్తే ఈ పెళ్ళికి వప్పుకోదు ఎవరొప్పుకున్నా" చెప్పాడు శాస్త్రి

"ఇదంతా అబద్ధం అని బయట పడితే?"

"పదదు వెయ్యి అబద్ధాలు ఆడయినా ఓ పెళ్ళి చేయాలన్నారు పెద్దలు ఒక్క అబద్ధం ఆడి పెళ్ళి చెడగొట్టంటాను నేను సుబ్బలక్ష్మికి నీకు ఇక ఈ జన్మలో పెళ్ళి కాదు నిశ్చింతగా వుండు" చెప్పాడు శాస్త్రి

(ఇంకా వుంది)

సన్నీ. అందమైన శిరోజాలకు ప్రకృతి కానుకని అదిమీకు అందజేస్తుంది.

ఆర్నికా : హోమియోపతీలో ఒక ప్రధానమైన మూలిక. ఇది మీ శిరోజాలను శుభ్రపరచడమే కాక, టానిక్‌గా కూడా పనిచేస్తుంది. జుట్టు రాలిపోవడాన్ని, చుండ్రుని అదుపు చేస్తుంది — మృదువుగా, సహజంగా.

వీటన్నింటికి మించినది ఏమిటంటే, సన్నీయొక్క కండిషనర్, వెంట్రుకలు చిక్కుబడటాన్ని తొలగిస్తుంది. మీ జుట్టుని సిల్కులాచేసి, మంచి అదుపులో ఉంచుతుంది. సన్నీకిగల ప్రత్యేకమైన ఫ్రెంచి సువాసననికూడా మీరు మెచ్చుకుంటారు!

ఉత్తమఫలితాలు ఉండేందుకు,

**సన్నీ ఆర్నికా హెయిర్ ఆయిల్‌ని**

బాగా తలకు అంటేలా రాయండి. 1-2 గంటలు ఆగండి.

ఆ తరువాత

**సన్నీ ఆర్నికా షాంపూని**

తడి జుట్టుకి పట్టించండి. నురగవచ్చేలా రుద్దుకోండి. నీళ్ళతో బాగా కడగండి.

---

ఉత్పత్తి చేసినవారు

బాక్సన్ హోమియో ఫార్మసీ ప్రయివేట్.లి.

*121, ఓఖ్లా ఇండస్ట్రియల్ ఏరియా, ఫేజ్-1*

*న్యూఢిల్లీ-110 020.*

తెలుసుకోండి

# సన్నీ

## ఆర్నికా షాంపూ

తద్వారా మీ శిరోజాల

అందాన్ని తిరిగి మెచ్చుకోండి

అన్ని ప్రధాన షాపులలో దొరుకుతుంది



# సన్నీ ఆర్నికా షాంపూ కండిషనర్‌తోబాటు

మృదువుగా, సహజంగా —

హోమియోపతి మూలికలకు

మాత్రమే సాధ్యమైన రీతిలో.




RK SWAMY/BHP/4927 R1-TEL

## కోపంలో తండ్రిని చంపిన తనయుడు!

రెడ్డిపట్టి అనే గ్రామంలో 46 ఏళ్ళ పళనియప్ప అనే ఆయన రోజూ పీకల మొయ్యా తాగివచ్చి 25 ఏళ్ళ కొడుకు సుబ్రమణిని చితక బాదుతూ వుండేవాడట. ఈ బాధపడలేక తన వాటా తనకు రాసిస్తే తన బ్రతుకు తాను బ్రతుకుతానని సుబ్రమణి తండ్రి నడిగితే చిల్లి గవ్వ కూడా యివ్వనని అరవంలో అరచాడట పళనియప్ప. దాంతో కోపం వచ్చిన సుబ్రమణి వో రాత్రి త్రాగిన మైకంలో పడున్న తండ్రిని తన స్నేహితుల సహాయంతో చంపేశాడట. అనక రివాజుగా వారందరూ పరారీలో వున్నారట.

## గుండె జబ్బుకు గుర్రపు స్వారీ వైద్యం!

గుండె జబ్బుకు గుర్రపు స్వారీ అత్యంత అద్భుతమైన వైద్యమని సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు అన్నారట. గుండె పోటు ఒకసారి వచ్చిన వారిచేత యీ గుర్రపు స్వారీ చేయిస్తే యిహ వారికి రెండోసారి హార్ట్ ఎటాక్ రాలేదని, కనుక గుర్రపు స్వారీ గుండెకు చాలా మంచిదనీ అనడమేగాక అక్కడ వైద్యంలో ఒక భాగంగా యీ చర్యను అమలు చేస్తున్నారట.

## జీవితాంతం వరకు ఒకే బార్‌కి వెళ్ళిన ఘనుడు!

పారిస్‌కు చెందిన బెరిన్బోమిట్ అనే వో సంపన్నుడు తన జీవితాంతం వరకూ, సాతికేళ్ళ ప్రాయం నుంచి 46 సంవత్సరాల కాలం ప్రతి రాత్రి ఒకే బార్‌కు వెళ్ళి ఒకే చోట ఒకే కుర్చీలో కూర్చుని పానీయం సేవించేవాడట.

## కంటితో చూడని స్వంత భవనం!

లార్డ్ మింటో భారతదేశంలో గవర్నర్ జనరల్‌గా పనిచేస్తూన్న రోజుల్లో రిటైరయ్యాక శేషజీవితం హాయిగా గడపడానికి ఆయన స్కాట్‌లాండ్‌లో ఓ చక్కని భవనం కట్టించుకుని దానికి మింటో మెన్షన్ అని పేరుపెట్టుకున్నారట. అయితే ఆయన స్వదేశానికి వెళ్తూ చనిపోయారట. అనగా ఆయన ఆ భవనంలో వుండడం విషయం అలావుంచి కనీసం కళ్ళారా అయినా చూడలేదట.

## తికమకపెట్టిన ఫోను హెచ్చరిక!

రామేశ్వరం – మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో ఓ బాంబు వున్నదని జనవరి 12వ తేదీన మయిల్ ఆడుదురై రైల్వేస్టేషనుకు ఫోను హెచ్చరిక వచ్చిందట. దాంతో ఆ రైలును ఓ 40 నిమిషాల సేపు ఆపి పోలీసు, తదితర అధికారులు విపరీతంగా సోదాలుచేసి, ఏమీ దొరక్క, అదేవడో వేళాకోళంచేశాడని వూహించి, ఆ రైలుకు పచ్చజండా చూపారట. రైలు క్షేమంగా మద్రాసు చేరిందట.

## ఫలించని పథకం!

సేందమంగళంకు సమీపంలో వున్న గాంధిపురానికి చెందిన చెల్లప్ప గవుండరు తన కూతురు 19 ఏళ్ళ కళైశెల్విని ఉత్తరకడి కావల్ గ్రామానికి చెందిన 27 ఏళ్ళ గణపతి అనే అతనికిచ్చి 12-11-86న వివాహం చేశాడట. పెళ్ళికి ఆయన ఇరవై వేలు నగదు కట్నంగా యిచ్చి, 22 కాసుల బంగారంతో తన కూతుర్ని అత్తవారింటికి పంపాడట. అక్కడ ఆమె అత్తగారు, మొగుడూ కలిసి ఆమెకు రోజూ గర్భ నిరోధక మాత్రలు వేసేవారట. "ఎన్నయిది" అనామె అడిగితే "వెళ్ళి మీ బాబు




నడిగి మరో ఇరవై వేలు పట్రా! అంతవరకూ నీకు కడుపు రానివ్వము" అన్నారుట మాతా సుతులు. ఆ నాటి నుంచీ వారిద్దరూ తమ కార్యక్రమాన్ని మరింత పెంచి, ఆమెను మార్చి మార్చి రిలే పద్ధతుల మీద చావగొట్టేవారట. పంచాయితీలో మరో ఇరవై వేలు యివ్వడానికి సమ్మతించి గడువు అడిగిన చెల్లప్ప గవుండర్ ఆ గడువులో డబ్బు యివ్వక పోయేసరికి ఇహ ఆ పిల్లమీద కిరసనాయిలు పోసి, నిప్పంటించి చంపడమే కర్తవ్యం అని ఆలోచించు కుంటుండగా విన్న ఆ కళైశెల్వి అర్ధరాత్రి పారిపోయి తండ్రి యింటికి చేరిందట. తండ్రి కోపంతో యీ విషయం పోలీసులకు ఫిర్యాదు చేస్తే వారొచ్చి ఆ తల్లీ కొడుకులను ఖైదు చేశారట.

## స్పృహతప్పిన స్కూలు పిల్లలు!

తమిళనాడు స్కూళ్ళల్లో ప్రభుత్వ మధ్యాహ్న ఉచిత భోజనాన్ని నాగర్‌కోయిల్‌కు చెందిన చెంబకరామన్ పుత్తూర్ స్కూలు పిల్లలు తిన్నారట మామూలుగానే. ఆ తిన్నవారిలో ఓ 29 మంది వెంటనే వాంతులుచేసుకుని, మైకంవచ్చి పడిపోయారట. వారందర్నీ ప్రభుత్వాసుపత్రిలో చేర్చి చికిత్సచేయిస్తున్నారట.

## బాంబు ప్రేలి ఏడుగురికి తీవ్ర గాయాలు!

నరసరావుపేటకు సమీపంలోని పమిడిపాడు గ్రామంలోని ఓ పొలంలో వున్నట్టుండి బాంబు ప్రేలడం వల్ల ఏడుగురు తీవ్రంగా గాయపడి ఆసుపత్రి పాలయ్యారట. వారిలో గురవయ్య, ఆది నారాయణ అనే యిద్దరికి కంటి చూపు పోయే ప్రమాదం వుందని డాక్టర్లన్నారట. పోయిన మండల ప్రజాపరిషత్ ఎన్నికలలో వుపయోగించడానికి తెచ్చి దాచిన బాంబయ్యుంటుందది అని పోలీసలు అనుమానిస్తున్నారట. మొత్తం ఏడుగురి ముఖాలూ వొళ్ళూ దారుణంగా కాలి, భయంకరంగా వారి రూపాలు మారిపోయాయట. ఇంకా యిలాంటి బాంబులు ఎక్కడెక్కడ నక్కి దాక్కున్నాయో, ఎప్పుడు ప్రేలుతాయో అని జనం గజగజలాడుతున్నారట!

## ఆవు స్వాహా చేసిన ఓటు కాగితాలు!

1870 జూలై 26వ తేదీన ప్లయిన్ వ్యూ అనే వూళ్ళో ఎన్నికల ప్రప్రథమంగా జరిగాయట. బ్యాలట్ బాక్స్ సమయానికి దొరక్కపోవడంవల్ల ఓ పెద్ద డబ్బాలో ఓట్లు పడేశారట. ఓట్లు లెక్కించడానికి అంతా సమకూడి, ఎట్టిపద్ధతిలో యీ మహత్కార్యం చేయాలి అనాలోచించేలోగా ఓ ఆవొచ్చి ఆ ఓటు కాగితాలు సాంతం తన పొట్టనపెట్టుకుందట.

## అల్పాహారంగా అరవై కోడిగ్రుడ్లు

1861 నుంచి 1876 వరకూ టర్కీని పాలించిన సుల్తాన్ అబ్దుల్ అజీజ్ ఉదయాన లేస్తూనే ముఖం కడుక్కొని వుడకపెట్టిన కోడిగుడ్లు ఓ అరవై అల్పాహారంగా సేవించేవారట. పదహారేళ్ళు కూడా ఈ చర్య ఆయన క్రమం తప్పకుండా చేసేవారట.

## భారీకాయునికి అల్పాయుష్షు!

బ్రిటనుకు చెందిన రాబర్ట్ ఎర్ల్‌హ్యూగ్స్ అనే వో రైతు బరువు 420 కిలోలట. ఆ మహనీయుని నడుం చుట్టు కొలత తొమ్మిది అడుగులట. ఆయనకు చొక్కా కుట్టాలంటే అయిదు గజాల గుడ్డ కావాల్సి వచ్చేదట! ఈ బృహత్కాయుడు తన 32 వ ఏట 1958 లో మరణించాడట. □

## గెలుపు మళ్ళీ టైసన్‌దే!

ప్రపంచ హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్ షిప్ పోటీలలో అమెరికాకు చెందిన మైక్ టైసన్ విజయం సాధించాడు. టోక్యోలో జరిగిన ఈ పోటీలలో రెండో రౌండ్‌లో టోనీ టబ్స్‌ను ఓడించడం ద్వారా టైసన్ ఈ టైటిల్‌ను గెలుచుకున్నాడు. పోటీ రెండు నిమిషాల 51 సెకన్లలోనే ముగిసింది. టైసన్ వయసు 21 సంవత్సరాలు. టబ్స్ వయసు 30 సంవత్సరాలు. టైసన్ ఇప్పటికి 30 నాకౌట్ బాక్సింగ్ యుద్ధాలు చేశాడు. మొత్తం 34 విజయాలు సాధించాడు. టబ్స్ మొత్తం 25 పోటీల్లో పాల్గొని, రెండు పరాజయాలు ఎదుర్కొన్నాడు.....



## కిసాన్ భింద్రన్‌వాలె!

రైతు సమస్యల పరిష్కారం కోసం ఇటీవల మీరట్‌లో పెద్దఎత్తున ప్రదర్శన జరిపిన మహేంద్రసింగ్ తికాయత్ దేశం మొత్తం మీద చెప్పుకోదగిన రైతు నాయకుడిగా గుర్తింపబడ్డారు. 52 సంవత్సరాల వయసు గల ఆయన ఉత్తరప్రదేశ్‌లోని సిసౌలీ గ్రామంలో 20–25 ఎకరాల భూవసతి, వ్యవసాయం ఉన్న మధ్యతరగతి రైతు. గత ఏడాది వరకూ ఆయన ముఖ్యంగా వరకట్నరహిత వివాహాలని, పంచాయితీ పద్ధతిలో తగాదాల పరిష్కారం చేస్తూ ఉండేవారు. 1986 చివర్లో తమ వియ్యంకుడి ప్రోద్బలంతో అక్కడి బలమైన రైతు సంఘం అయిన భారతీయ కిసాన్ యూనియన్ (బి. కె. యు) ఆందోళనలో పాల్గొన్నారు. ఆ తర్వాత ఆయన ఆ సంఘానికి అధ్యక్షుడైనారు. ఆగస్టు 87 లో మూడు లక్షల మందితో ఒక పెద్ద రైతు ప్రదర్శన జరిపి ప్రభుత్వానికి తమ సత్తా ఏమిటో చూపించారు. రాజకీయాలతో సంబంధం లేని సంస్థ బి. కె. యు. అయినా కీ. శే. చరణ్‌సింగ్ వదిలి వెళ్ళిన ప్రభావాన్ని రూపుమాపటానికి కాంగ్రెసు (ఐ) తికాయత్‌కి సహాయం చేస్తున్నదని, ఇది ఒకప్పుడు పంజాబ్‌లో అకాలీదళ్‌కి వ్యతిరేకంగా భింద్రన్‌వాలెకి సహాయ పడినట్లే ఉన్నదని కొందరు అభిప్రాయపడుతున్నారు.

## టెన్నిస్ రాణి రెండో పెళ్ళి!

మహిళల టెన్నిస్ పోటీల్లో ఎదురు లేకుండా ఆడి ప్రపంచ విజేతగా ఒకప్పుడు రాజ్యం చేసిన క్రిస్ ఎవర్ట్ పెళ్ళిచేసుకో బోతోంది. అసాధారణ ప్రతిభ గల క్రీడాకారిణి గానే కాక, ఎందరినో వెర్రెత్తించిన అందగత్తెగా కూడా పేరు తెచ్చుకున్న క్రిస్ ఎనిమిది సంవత్సరాల క్రితం మరొక టెన్నిస్ క్రీడాకారుడు జాన్ లాయిడ్‌ను పెళ్ళి చేసుకుంది. ఏడాది క్రితం లాయిడ్‌కు విడాకులు ఇచ్చిన క్రిస్ త్వరలో అమెరికాకు చెందిన మాజీ ఒలింపిక్ క్రీడాకారుడు ఆండీ మిల్‌ను పెళ్ళి చేసుకో బోతోంది. మిల్‌కు కూడా ఇది రెండో పెళ్ళి ఆయన కూడా తన మొదటి భార్యకు ఈ మధ్యనే విడాకులు ఇచ్చాడు. మిల్ ప్రస్తుతం టెలివిజన్ వ్యాఖ్యాతగా పని చేస్తున్నాడు.....



## 'తమస్' నాయిక మరో అవతారం!

తమస్ చిత్రంలో నాయికగా నటించిన దీపాసాహి ప్రస్తుతం గుల్ ఆనంద్ నిర్మిస్తున్న హీరో హీరాలాల్ అనే చిత్రంలో నటిస్తున్నది. ఇక తాను కళాత్మక చిత్రాలలో నటనకు ముగింపు పలుకుతున్నానని, కేతన్ మెహతా దర్శకత్వంలో తయారవుతున్న ఈ కొత్త చిత్రంలో లైంగిక సెచ్చు ఉన్న స్త్రీగా నటిస్తున్నానని ఆమె అన్నది. ఆస్కార్ బహుమతి గ్రహీత భాను అతయ్యా రూపొందించిన ఆడంబరమైన దుస్తుల్లో విలాసంగా ఉన్న దీపాసాహి "కళాత్మక చిత్రాలలో నటించి విసుగెత్తింది. అవి ముందు కేన్స్ చిత్రోత్సవాలకు వెళ్తాయి కానీ తర్వాత కాన్స్‌లో (డబ్బాల్లో) పడి ఉంటాయి" అని ఆమె వ్యాఖ్యానించింది... □



# రావిచెట్టు

గోవిందరాజు రామకృష్ణారావు

బస్సు దిగి డొంక వెంబడి మైలు దూరం ఎండలో నడిచి వచ్చేటప్పటికి నర్సింలుకి బాగా చెమటలు పోశాయి. వయసు మళ్ళడం వల్ల ఆయాసం-కూడా వచ్చింది. వరండాలో చెప్పులు విడిచి ముంగిట బావిలోంచి నీళ్ళు తోడుకుని కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు.

'అప్పా!' అని కేకేశాడు తన అక్కి నుద్దేశించి. భార్య నాంచారమ్మ లోపల్నుంచి వచ్చింది. దండెం మీదున్న తువాలు అందించింది. మంచినీళ్ళు తెచ్చిచ్చింది. నవారు మంచం వాల్చింది. తాటాకు విసనకర్రతో విసురుతూ 'అన్నీ సానుకూలం అయ్యాయా?' అడిగింది కాబోయే వియ్యాల వారి గురించి.



'ఎందుకవ్వా అడిగినవన్నీ కాదనకుండా ఒప్పేసుకుంటే... అమ్మడేది?'

'దొడ్లో పిడకలు చేస్తోంది. ఒదిన ఎదురింటి కెళ్ళింది... కాసేపు నడుం వాల్చండి. అన్నం వార్చంగానే వడ్డిస్తా.' అని తలగడ తెచ్చి మంచం మీదపెట్టి నాంచారమ్మ లోపలికెళ్ళింది.

నర్సింలు నడుం వాల్చాడు. మనసంతా ఆలోచనలతో గజిబిజిగా వుంది. ఒకందుకు మాత్రం సంతోషంగా వుంది. అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేసిన కమలకి అన్నివిధాలా మంచి సంబంధం కుదరడం నిజంగా అదృష్టం. ఒక్కతె కూతురు. నలుగురు కొడుకుల తర్వాత పుట్టిన కడపటి బిడ్డ. ఊళ్ళోనే ఎనిమిదో తరగతి వరకు చదువుకుంది. పని పాట్లు వచ్చు. మంచీ మర్యాదా తెలుసు. పెద్దలంటే గౌరవం ఎక్కువ. అత్తింట అనుకూలంగా అణకువతో మెలిగే తెలివితేటలున్నాయి. ఇంకేం కావాలి. చక్కగా కాపురం చేసుకోవడమే కావలసింది.

ఒకవారం రోజుల వరకు డబ్బుదో చిక్కు సమస్యగా వుండేది.

కమలకి ఈడు వస్తున్న కొద్దీ నర్సింలు దంపతులికి అమ్మాయి పెళ్ళి ఆలోచన వెంటాడేది. సంబంధాలు గురించి వాకబు చేయడం మొదలు

# నేను సింథాల్ వాడతాను. మరి మీ




సింథాల్ యొక్క అద్వితీయమైన టి టి సి గల దుర్గంధవారక ఫార్ములా, శరీరం నుంచి దుర్గంధం రాకుండా నివారించి మీకు శరీరం విషయంలో ఆత్మవిశ్వాసాన్నిస్తుంది.

**శరీరం గురించిన ఆత్మవిశ్వాసం వినోద్ కైవసం-సింథ**

పెట్టారు. తూగగలమా లేదా అనే విషయం వారి మనస్సులోకి ఎన్నడూ రాలేదు. ఏవో ఉద్యోగాలు నలుగురు కొడుకులూ చేసుకుంటున్నారు. ఒక్కగా నొక్క చెల్లెలు పెళ్ళికి తలా యింత వేసుకోక పోతారా అనే ధీలాసా వుండేది. సంబంధం కుదిరినట్టు రాసినప్పుడు సంతోషం, త్వరగా పెళ్ళి చేయడం మంచిదని జవాబిచ్చారు. కట్నం డబ్బు, పెళ్ళి ఖర్చు గురించి పెద్దకొడుకు గాని తక్కిన వాళ్ళు గాని ఎత్తకపోవడం బాధనిపించింది. ఇబ్బందుల్లో వున్నారంటే అది వేరే మాట. సంపాదన బాగానే వుంది. పెళ్ళి కట్నాలు దండిగా వచ్చాయి. ఇళ్ళు కూడా బస్తీల్లో అమర్చుకున్నారు. కోడళ్ళకి నగానట్రా చేయించారు. బ్యాంకులో పైకం వుంది. అయినా యింత వరకు నర్సింలు కొడుకుల దగ్గర్నుంచి చిల్లిగవ్వ కూడ ఆశించలేదు. ఆశించి తీసుకునే నైజం కాదు. ఉన్న కాస్త పొలం సాగు చేసుకుంటూ తన కష్టార్జితం పైనే జీవితం వెళ్ళ బుచ్చాలని గట్టిగా కోరే మనిషి. కాని చెల్లెలి పెళ్ళి చేయడంలో నలుగురు అన్నలకూ బాధ్యత వుంది. విచిత్రంగా డబ్బు సంగతి ఎవ్వరూ ప్రస్తావించ లేదు. కొడుకులపై నమ్మకంతో తాంబూలాలు కూడా పుచ్చుకున్నారు. తక్కిన వాళ్ళు ఎలా వున్నా పెద్దాడు ఆదుకుని తీరతాడని నర్సింలుకి కొండంత నమ్మకం. అన్నదమ్ములంతా ఎప్పుడు కూడబలుక్కున్నారో యేమో వ్యవహారాలు తెలిసిన చిన్నాణ్ని పంపారు. ఆ మాటా ఈ మాటా చెప్పి చివరకి తేల్చింది – ఉన్న పొలం కాస్తా అమ్మి కమలకి ఏ లోటూ రాకుండా పెళ్ళి జరిపించమని. ఇది పిడుగు లాంటి వార్త. ప్రాణాలన్నీ పొలంలోనే భద్రపరుచుకుని నర్సింలు బ్రతుకు బండి లాగు తున్నాడు. తానూ పొలం వేర్వేరు కాదు. పొలానికి నీరు చాలినంతగా వున్నప్పుడే తన దాహం తీరుతుందను కున్నాడు. పంట సరిగా పండక పోతే తను ఆకలితో వున్నట్టే భావిస్తాడు. పంటకు ఏదైనా తెగులు సోకితే ప్రాణం విలవిల్లాడు తుంది. అలాంటి పొలం అమ్మమనే మాట కొడుకుల దగ్గర్నుంచి వచ్చింది. తమ వాటా పెళ్ళికి ఖర్చు పెట్టమని పవరు పట్టాయిచ్చినట్టు కబురు పంపారు. తర్వాత నెల నెలా తన కింత డబ్బు పంపుతారట.

కన్న బిడ్డ సుఖం కోసం ప్రాణంతో సమాన మైన పొలం అమ్మేందుకు నర్సింలు తలూపక తప్పలేదు. తన లోంచి జీవధాతువును ఎవరో హరిస్తున్నట్టు అనిపించింది. పొలం కొనే ఆసామి జాలి గుండె వున్న వాడులా వుంది. మంచి ధరే ముట్ట చెబుతున్నాడు.

పొలంలో మూడు గజాల వెడల్పున మెరక వుంది. అక్కడో రావి చెట్టుంది. ఆ చెట్టు నర్సింలుకి ఎన్నో యేళ్ళుగా చల్లని నీడ నిస్తోంది. రోజుకి ఒక్కసారైనా ఆ నీడ తనపై పడకపోతే నర్సింలుకి తోచదు. నిద్ర పట్టదు. ఆ మెరక చెక్క కూడా అమ్మేస్తే ఈ ప్రపంచంలో తన కంటూ స్వంత పొలం అన్నది వుండదు. కొనే ఆసామికి మెరక చెక్క మీద మక్కువ లేదు. తక్కువ ధర యిస్తాననడం సబబే. అయితే మెరక చెక్క కూడా అమ్మక పోతే పిల్లకిచ్చే బంగారానికి పైకం తక్కువ పడుతుంది. ఆ మెరక చెక్క సంగతి తప్ప అంతా కరారై పోయింది. పొలం పంట పైన వుంది నిండు చూలాలి మాదిరి. పంట కోతలు అవ్వంగానే పొలం స్వాధీనం చేయాలని ఒప్పందం కూడా కుదిరింది. నర్సింలు ఎటూ తేల్చుకో లేకుండా వున్నాడు.

కళ్ళు మూసుకుని పడుకున్న భర్తను చూసి "కునుకు పట్టి నట్టుందే. వంటయింది. నాలుగు మెతుకులు తిని పడుకో! బడలిక తీరుతుంది" భుజం తట్టి లేపింది.

"నిద్రా, నా మొహమా. ఊరికే పడుకున్నా. పద్మించు."

లేచి లోపలి కెళ్ళాడు.

భోజనం చేస్తుండగా నర్సింలు అక్క రంగమ్మ ఎదురింటి నుంచి వచ్చింది. రంగమ్మకి భర్త పోయి చాల కాలమయింది. పిల్లల్లేరు. భర్త వైపు దగ్గర బంధువులు ఎవరూ లేరు. ఆస్తి కూడా లేదు. ఏవో నగలు మాత్రం వున్నాయి. చేతనైన పనిపాట్లు చేస్తూ యింట్లో పెద్ద దిక్కుగా వుంటోంది.

పలకరింపుగా "ఏరా నర్సన్నా! వెళ్ళిన పని అయిందా?" అని అడిగింది.

"అవునే అప్పా! ఇక మనదే ఆలస్యం పెళ్ళికి" అన్నాడు.

## 'కలం స్వాగతం'

రండి... నాతో రండి
ఆదిమానవుని అంతర్యంలోకి
నిష్క్రమింపజేస్తాను
రండి... నాతో రండి
ఏభయ్యవ శతాబ్దంలోకి
తీసుకు వెడతాను-
రండి... నాతో రండి
యుగాల గత చరిత్రను
మీ ముందు నిలబెడతాను...
భవిష్యత్తు ఖజానాను
మీ కనుల ఎదుట ఆవిష్కరిస్తాను!
నిన్నలో ఊపిరి పోసుకుని
నేటిలో అనుభూతులందుకుని
రేపటిలోకి తొంగి చూస్తూ
ఆగమన సూర్యుని ఆవలికి
తీసుకుపోతాను-
గతం నుండి అనాగతంలోకి ఆగమిస్తూ
అనంతం వైపు ప్రస్థానిస్తాను!!

–యూస్సీ కె. వి. కుమారి

"నువ్వు భోజనం కాని. తర్వాత మాట్లాడు కుందాం" అంటూ పెరట్లోకి వెళ్ళింది పని మీద.

బంగారానికి సర్దుబాటు అయితే గట్టెక్కినట్లే అనిపిస్తోంది నర్సింలుకి. మెరక చెక్క కూడా అమ్మేస్తే డబ్బు సమకూరుతుంది. కాని ఎలా అమ్మడం.

అందరి భోజనా లయ్యాక రంగమ్మ, నాంచారమ్మ వరండాలో నడుం వాల్చిన నర్సింలు దగ్గరి కొచ్చారు. కమల పక్కింటి స్నేహితురాలి దగ్గరి కెళ్ళింది.

తమ్ముడు ఏదో సమస్యతో సతమత మవుతున్నాడని గ్రహించి రంగమ్మ, "నర్సన్నా! మరి పెళ్ళికి అంతా సర్దుబాటయినట్లేనా?" అడిగింది సంగతి తెలుసుకోవాలనే వుద్దేశంతో. తాను మథన పడుతున్న విషయం ఎలా చెప్పాలో తెలియక గాంభీర్యం సడల కుండా–

"అయినట్లేనే అప్పా" జవాబిచ్చాడు.

తమ్ముడి తత్వం ఎరిగిన రంగమ్మ "పొలం అయినకాడికి అమ్ముకున్నా అటు కట్నం కానుకలికి ఇటు పెళ్ళి ఖర్చుకి చాలొద్దురా?" సందేహం వెలిబుచ్చింది.

"చాలడం అంటే అంతెక్కడే అప్పా సర్దుకోవాలి మరి" సమాధానం చెప్పాడు.

ఇంతలో నాంచారమ్మకి ఒక అనుమానం కలిగింది. "మనం సర్దుకుంటాం. మరి మగ పెళ్ళివారు వూరుకుంటారా? కట్నం రూపాయి తగ్గరు. అమ్మాయికి పెడతామన్న బంగారం వీసమెత్తు తగ్గితే ఒప్పుకోరు. మనం లోకంలో చూస్తున్నదే. తెలిసుండి మనం పెళ్ళిలో వెలితి చేయకూడదు." హెచ్చరింపుగా చెప్పింది.

కొద్దిసేపు ఎవరూ ఏమీ మాట్లాడ లేదు. నర్సింలు గొంతు సరిచేసుకుంటూ నీళ్ళు నములు తున్నట్టు, "కట్నం కానుకలికి, పెళ్ళి ఖర్చుకి సరిపడా వుందిలే..." అని ఆగాడు.

"మరి బంగారం ముఖ్యం కదరా!.... అక్కడే గొడవ లొచ్చేది. ఏమాత్రం లోటు జరిగినా కాపురాని కెళ్ళాక ఓర్వ యాతన పడుతుంది." చెప్పింది రంగమ్మ.

"నా మెళ్ళో వున్న గొలుసు ఇచ్చేస్తా. పోతే, ఆ కాస్త మెరక స్థలం ఏం చేసుకుంటాం.... దాన్ని కూడా అమ్మేస్తే శుభకార్యం సజావుగా జరిగి పోతుంది" సలహా యిచ్చింది నాంచారమ్మ.

నెత్తి మీద పిడుగు పడ్డట్టు, "మెరక చెక్కా!" నర్సింలు గొంతు వణికింది.

నాంచారమ్మ అర్థం చేసుకుని, "అవును అమ్మడి పెళ్ళి కంటె మనకి చెక్క ముఖ్యమా?" అంది అనునయంగా.

"కాదనుకో.... కాని ఆ కాస్త నేల కూడా లేకపోతే....?"

"ఏమవుతుంది? ఉన్న పొలం అంతా అమ్ముకుంటే లేంది ఈ కాస్త చెక్క అమ్మితే ఏం మునుగుతుంది.

తర్వాత దేవుడే వున్నాడు "

భార్యాభర్తలు మాటలు విన్న రంగమ్మ "ఒరే నర్సన్నా! నాకు తెలుసురా ఆ మెరక, ఆ రావి చెట్టు అమ్మొద్దురా అమ్మడు నీ కెంతో నాకూ అంతేరా కన్నది నాంచారమ్మే అయినా పెంచి పెద్ద చేసోంది నేనేరా అంది

కాదని ఎవరన్నా రప్పా!

అన్నేదురా అందుకనే నా నగలన్నీ మార్పించి మాట ప్రకారం దానికి బంగారం ముట్ట చెబుతాం నాకే నగ లెందుకురా! ఎప్పటికైనా దానికివ్వవలసిందేగా! నిబ్బరంగా చెప్పింది

ఒదినా! నీ నగ లిప్పుడివ్వడం ఎందుకు? అని నాంచారమ్మ అనగానే, 'మరెప్పుడివ్వాలి నువ్వూరుకో ఇంకేం అడ్డు చెప్పకు నర్సన్నా! వెంటనే నగలు చేయించే ఏర్పాటులో వుండు కాదనకు కచ్చితంగా ఆదేశించినట్టు చెప్పింది

ఏదో చెప్పబోతున్నట్టు, అప్పా! అనంగానే, నాకేం చెప్పొద్దురా నేనెప్పుడో నిర్ణయాని కొచ్చాను మీరేం చెప్పినా వినిపించుకోను అని లోపలి కెళ్ళి పెట్టోంచి నగల మూట తెచ్చి నర్సింలు చేతిలో పెట్టింది

* * * * *

ఊరూ వాడా సంక్రాంతి సంబరాలు జరుపుకుంది నర్సింలు పండక్కి అల్లుణ్నీ కూతుర్నీ తీసుకొచ్చి శక్తి కొద్దీ సంతోషపెట్టి పంపాడు పెళ్ళి వైభవంగా జరపడమే కాకుండా సంక్రాంతికి కూడా బాగానే ముట్ట చెప్పినందుకు వియ్యాల వారు సంబరపడి పోయారు వాళ్ళు సంతోషపడడమే తమక్కావల్సిందని నర్సింలూ నాంచారమ్మా పదే పదే అనుకున్నారు

నిజానికి చుట్టు పట్ల పిల్ల పెళ్ళి అంత ఘనంగా చేసిన ఖ్యాతి నర్సింలుకే దక్కింది పెద్ద పెద్ద పందిళ్ళు వేసి, అట్టహాసంగా అలంకరణ చేయించి, పూలతో మెరిసే దండలతో మంటపం కట్టించి, పట్నం నుంచి మంచి బ్యాండు మేళం తెప్పించి పెళ్ళి జరిపించాడు కూతురు పెళ్ళి అంత వైభవంగా జరపడం ఏ తల్లి తండ్రులకు ఆనందం కాదూ! దీనికి తోడు ఉన్న పొలం అమ్మినప్పుడు ఏర్పాట్లలో ఏ లోపం వచ్చినా కావాలని డబ్బు మిగుల్చుకున్నట్టు ఎక్కడ కొడుకులు నెపం వేస్తారోనని మరింత జాగ్రత్త పడ్డాడు పొలం అమ్మిన సొమ్ము పెళ్ళికి తాము యిచ్చినట్టు నలుగురు కొడుకులు అందరికీ చెప్పారు నర్సింలు కాదన లేదు కొడుకుల మీద ఈగ వాల్తే వూరుకునే తత్త్వం కాదు

పెళ్ళి సందడి సద్దు మణిగాక పంట కోతలయ్యాయి ధాన్యం యింటి కొచ్చింది కొత్త అల్లుడికి లాంచనాలు యదావిధిగా జరిపించాడు

ఇవన్నీ వాస్తవానికి ఆనంద పరచేవే కాని నర్సింలు సంగతి వేరు పొలం అమ్మకం అయిపోయింది రిజిస్ట్రీ అయిన వెంటనే పొలం స్వాధీన పరచుకునే వీలున్నా కొన్న ఆసామి నర్సింలు మీద వుండే గౌరవంతో ఈ గడువుకు సమ్మతించాడు ఒక్కొక్క రోజు గడుస్తున్న కొద్దీ నర్సింలుకి జవసత్వాలు హరించుకు పోతున్నట్టు అనిపిసోంది

పొలం అప్పగించ వలసిన రోజు రానే వచ్చింది తెల్లవారు ఝామునే లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు ఎన్నడూ లేంది నర్సింలు అంత పొద్దున్నే స్నానం చేయడం గమనించి, ఆశ్చర్యపోయి, ఇప్పుడు స్నానం ఏంటయ్యా అని అడిగింది నాంచారమ్మ

పొలానికి వెళ్తున్నా ఇవ్వాళ అప్పగింత పెట్టాలి '

అయితే స్నానం ఎందుకు?

'నీకు తెలియదులే వూరుకో
నాంచారమ్మ బదులు పలక లేదు

పొలానికి బయలుదేరే ముందు నాంచారమ్మతో, రంగమ్మతో వెళ్ళొస్తానని మరీ మరీ చెప్పాడు

నర్సింలు బాధ ఎరిగిన భార్యా, అక్కా, ఆ భగవంతుడే మనల్ని చల్లగా చూస్తాడు అమ్మిన పొలం కొన్న వాళ్ళదే అని నచ్చ చెప్పి పంపారు

దార్లో గన్నేరు పూలు దండిగా కోసుకొని కండువాలో మూట కట్టుకుని గబగబా నడుచుకుంటూ పొలం చేరుకున్నాడు

పొలం అంతా కలియ తిరిగాడు చుట్టుపట్ల ఎవరూ లేరు అనేక సార్లు మట్టి తీసి కళ్ళ కద్దుకున్నాడు కన్నీళ్ళు దార కట్టాయి మట్టి తడిసింది తెచ్చిన పూలు పొలంలో దేవుడి పాదాలకు పూజ చేస్తూ అర్పిస్తున్నట్టు భక్తితో నాలుగు వైపులా వుంచాడు పొలానికి మధ్యలో నిలబడి ప్రదక్షిణ చేస్తూ చేతులు జోడించి నమస్కరించాడు

పొలం కొన్న ఆసామి నాగలితో పాలేళ్ళతో వచ్చాడు నర్సింలు వినయంగా అతనికి నమస్కరించాడు అయ్యా! ఇదిగో మీ పొలం మీ కప్పగిస్తున్నాను ఇంత కాలం నేను కాపాడాను ఇప్పుడు మీ చేతుల్లో పెడు తున్నాను అని కన్న కూతురుని అప్పగించి నట్టు పొలం స్వాధీన పరచాడు

పాలేళ్ళతో పొలం దున్నడం, దుక్కి చేయడం మొదలు కుప్ప నూర్పుల వరకు తీసుకో వలసిన జాగ్రత్తలు చెప్పాడు

నాగలి కర్రు నేలలోకి దిగగానే నర్సింలు పొలంలోంచి మెరక మీదికి ఎక్కి రావిచెట్టు క్రింద చతికిల పడ్డాడు అది తరతరాలుగా వస్తున్న పొలం తాను పుట్టినప్పటి నుంచి చూస్తున్న నేల ఇన్నేళ్ళుగా తన కుటుంబానికి అన్నం పెడుతున్నది ఈ పొలమే తన ప్రాణాలన్నీ దాచుకున్నది ఈ పొలంలోనే

తూర్పు దిక్కున సూర్యుడు పెద్ద ఎర్రబంతి పువ్వులా పైకి వస్తున్నాడు ప్రపంచం అంతటికీ వెలుగు ఇస్తున్నాడు కాని నర్సింలు మనసంతా చీకటి మయ మయింది కళ్ళు తెరుచుని వున్నా ఏమీ కనిపించడం లేదు నల్లటి పర్వతం లాంటి ఏనుగు తన గుండెపై పాదం పెట్టి తొక్కుతున్నట్టయింది ఆ బాధకు ఓర్చుకోలేక గుండె చేతో పట్టుకుని పక్కకు ఒరిగి పోయాడు




రావి కొమ్మల్లోంచి సూర్య కిరణాలు భుజం తట్టి లేపేందుకు ప్రయత్నించాయి నర్సింలు ప్రాణాల్ని తనలో కలుపుకున్న గాలి సూర్యకిరణాల్ని అపహసిస్తున్నట్టు రావి ఆకులు గలగల మన్నాయి

* * * * *

ఇప్పుడా రావి చెట్టు క్రింద పెద్ద తులసి కోట అందమైన అరుగు చూపరుల్ని ఆకట్టు కుంటాయి తండ్రిపై నలుగురి కొడుకులికి వున్న ప్రేమాభిమానాలకు దానిని నిదర్శనంగా ప్రజలందరూ బావిస్తారు ◻



సీరియల్ చల్లా సుబ్రహ్మణ్యం

# పవిత్రపాపి



(గత సంచిక తరువాయి)

రాకా గురించి తన తల్లి, పోలీస్ కమీషనర్ మాట్లాడుకునే మాటలు శ్రద్ధగా వినసాగింది, దేదీప్య.

"ఒక్కరోజు యిబ్బంది పడ్డా – అది కస్టమర్ల మంచికేగా! మీ రెటూ అవసరమైన చర్యలన్నీ తీసుకుంటున్నారు. యింకా డౌట్ ఎందుకు?" అన్నది సీతాదేవి.

"అది కాదు మేడమ్! ఒక్కో కస్టమర్ని బ్యాంక్ లోపలికి పంపడం వల్ల తనకేదో నష్టం వాటిల్లిందని ఏ కస్టమరైనా కోర్టులో దావా వేస్తాడేమోనని...." అన్నాడు చక్రవర్తి.

సీతాదేవి నవ్వుతూ–

"మీకెందుకొచ్చిందా అనుమానం?" అంది.

**జరిగిన కథ – 3 :** "రాకా" గురించి అత్యున్నత పోలీసు అధికారులు చర్చిస్తుంటారు. రాకా ప్రభుత్వానికి, పోలీసులకు సింహస్వప్నంగా మారి, ప్రకటించి మరీ నేరాలు చేస్తుంటాడు. రాకాను జస్టిస్ సీతాదేవి కూతురు దేదీప్య అభిమానిస్తుంది. హోటల్ బ్లూనైల్‌లో రాకా దేదీప్యకు విచిత్రంగా పరిచయమవుతాడు. దీనదయాళ్‌కు రాకా నుంచి చంపుతానని బెదిరిస్తూ ఉత్తరం వస్తుంది. మృత్యువు ఏ రూపంలో రాబోతోందో దీనదయాళ్ ఊహించదు. ఆయన డ్రైవ్ చేస్తున్న కారుకి మిలటరీ ట్రక్ ఢీకొని మరుక్షణం మరణించాడు. రాకా తాను బ్యాంక్ దోపిడి చేయబోతున్నట్లు పోలీస్ కమిషనర్‌కి వార్నింగ్ ఇస్తాడు. ఆ సంగతి పోలీస్ కమీషనర్ తన తల్లికి చెప్తుండగా వింటుంది దేదీప్య.

చక్రవర్తి భుజాలెగరేసి–

"ఏముంది మేడమ్? ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి మీద సైతం రిట్లు వేస్తున్న రోజులు...." అన్నాడు.

"నిజమే! పెండింగ్ కేసులు కోర్టుల్లో పెరిగిపోతున్న కొద్దీ నిముషాల్లో చర్యలు తీసుకునే 'రిట్'ల మీద ప్రజలకి ఉత్సాహం పెరిగిపోతోంది. న్యాయం కోరే హక్కు అందరికీ వుంది కదా? అయినా ఈ కేసులో అలాంటి దావా వేసినా నిలబడ్డం కష్టం లెండి!" అంది సీతాదేవి. ఆ మాటతో రిలీఫ్ కన్పించింది చక్రవర్తి ముఖంలో.

యింతలో నౌకరు కాఫీ ట్రేతో అటుగా వెళ్ళడం చూసిన దేదీప్య ఒక్క అంగలో అతన్ని సమీపించి అతని చేతిలోని ట్రేని తానందుకుని హాల్లోకి వెళ్ళి,

"గుడ్ మార్నింగ్ అంకుల్!" అంది.

"హలో దీపా! ఎలా ఉన్నావ్? స్టడీస్ బాగా సాగుతున్నాయా?" అడిగాడు చక్రవర్తి ఆప్యాయంగా.

"ఓకే అంకుల్!... సరే గానీ 'రాకా' మళ్ళీ ఏదో బ్యాంక్ దోపిడీ చేస్తాడటగా! ఈ సారైనా పాపం.... మీరతన్ని పట్టుకోగలరా?" అంది దేదీప్య నవ్వుతూ.

"తప్పకుండా పట్టుకుంటాం!" అన్నాడు.

"నో అంకుల్! మీరు 'రాకా'ని పట్టుకోలేరు! ఛాలెంజ్!" అంది దేదీప్య.

"ఎలా చెప్పగలవమ్మా! నేరస్తుడు కొన్ని సార్లు మాత్రమే తప్పించుకోగలడు. కానీ ఎప్పుడూ తప్పించుకోలేడు!"

"'రాకా' నేరస్తుడు కాదు!" అరిచినట్లుగా అంది దేదీప్య వెంటనే. తన అరుపుకి తల్లీ– పోలీస్ ఆఫీసరూ తెల్లబోవడం చూసి తన్ను తాను సంబాళించుకుని మామూలుగా అంది.

"అన్యాయాలను ఎదుర్కోవడానికి సాహసాలకు ఒడిగట్టే 'రాకా' రియల్ హీరో అంకుల్! యువతరంలో అతనంటే ఎంతో క్రేజ్ వుంది. అందరి అభిమానమే అతనికి శ్రీరామ రక్ష!"

దేదీప్య మాటలకి సీతాదేవి ముఖం వివర్ణమైంది. తన కూతురు– తన యింట్లో తన ముందు– ఒక నేరస్తుడిని పొగడడం – అందునా ఒక పోలీస్ అధికారి ముందు అలా మాట్లాడ్డంతో తల కొట్టేసినట్లయిందామెకి.

"దీపా!" అంది గద్దిస్తున్నట్లుగా.

"యిట్స్ ఆల్‌రైట్ మేడమ్! అమ్మాయి చెప్పిన అభిప్రాయమే జనానికి అతని పట్ల వుంది! అందుకే అతన్ని పట్టుకోవడం మాకు కష్టంగా వుంది. ఓకే మేడమ్! యిక నేను వెళ్ళొస్తాను!" అన్నాడు ఖాళీ కప్పు టీపాయ్ మీద పెడుతూ.

ఆయన వెళ్ళిపోయాక తల్లి తనకో లెక్చర్ యిస్తుందని దేదీప్యకి తెలుసు. అందుకే ఆలస్యం చెయ్యకుండా–

"అంకుల్.... కాలేజ్ దగ్గర డ్రాప్ చేస్తారా నన్ను?" అనేసి ఆయన సమాధానం కోసం ఎదురు చూడకుండా పుస్తకాలు తీసుకుని ఆయన వెంటే కారు వేపు నడిచింది దేదీప్య.

కారు ఆ యింటి ఆవరణ దాటగానే–

"సారీ అంకుల్! నేను రాకా ఫాన్‌ని! అందుకే అలా అన్నాను. అయినా కార్లని డిటెయిన్ చెయ్యడం, మెటల్ డిటెక్టర్ల బందోబస్తు పెట్టడం వల్ల నయినా ఈ సారి మీకు దొరికి పోతాడు లెండి!" అంది. చక్రవర్తి నవ్వి–

"యు ఆర్ రైట్! అయినా నువ్ మా పోలీసుల్ని తక్కువ అంచనా వేస్తున్నావమ్మా!" అన్నాడు.

"యింతకు ముందు ఆ ఉద్దేశం లేదంకుల్! కానీ రాకా మీ యింటి కొచ్చి మీకు వార్నింగ్ యిచ్చి, ఎవరికీ అందకుండా హాయిగా వెళ్ళిపోయాడని వినగానే నా

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited**



755-TG

ఉద్దేశం మారిపోయింది" అంది దేదీప్య కొంటిగా

ఆ మాటలతో చక్రవర్తి ముఖం నల్లగా మాడిపోయింది

* * *

సిటీకి ముప్పై కిలో మీటర్ల దూరంలో వున్న కిద్వాయ్ గార్డెన్స్‌లో 'స్లైట్ పెయింటింగ్' చేసి బస్‌లో వెనక్కి మళ్ళారు – దేదీప్య, ఆమె స్నేహితురాళ్ళు

పక్కనే కూర్చున్న క్లోజ్ ఫ్రెండ్ కుసుమతో ఉదయం చక్రవర్తితో జరిగిన సంభాషణ చెప్పింది దేదీప్య

"రేపే 'రాకా' ఛాలెంజ్ చేసిన రోజు అతనా ఆపరేషన్ చేస్తున్న టైంలో మనం అక్కడుంటే – అబ్బ ఎంత థ్రిల్లింగ్‌గా వుంటుందో కదా! అంది దేదీప్య

"బాబోయ్ అలాంటి వంటే నాకు భయం నేరస్తుల్ని చూస్తే నాకు వణుకు!' అంది కుసుమ ఆ ఊహకే వణికిపోతూ

'షటప్! నువ్వూ అందరిలా మాట్లాడతావేం? నేర ప్రవృత్తి గల వాళ్ళంటే భయపడాలి! అలాంటి వాళ్ళని కఠినంగా శిక్షించాలి కాని కొంతమంది సమాజ శ్రేయస్సు కోసం చట్టాన్ని తమకి అనుగుణంగా మార్చుకుని సమాజాన్ని దోపిడీ చేసే వాళ్ళ ఆటలు కట్టించడం కోసం నేరస్తులవుతారు వాళ్ళే నిజమైన హీరోలు!" అంది దేదీప్య ఆవేశంగా




కుసుమ నవ్వుతూ–

"సరేలేవే! నేరస్తుల్ని స్టడీ చేసి రీసెర్చి చేసినదానిలా మాట్లాడుతున్నావే! ఏది ఏమైనా ఒక నొటోరియస్ క్రిమినల్ మీద నీ కింత అభిమానం పనికి రాదు దీపా!'

వైనాట్? పేద ప్రజల కోసం పందికొక్కుల్లా బలిసిన వాళ్ళ కళ్ళు తెరిపించే వాళ్ళు, ఎవరైనా సరే నా అభిమాన హీరోలే! అంది దేదీప్య

అయితే బ్యాంక్ దోపిడీ చెయ్యడం కూడా ప్రజా సేవ అంటావా? ఎంతో మంది మధ్యతరగతి ప్రజలు బ్యాంకుల్లో డబ్బు దాచుకుంటారు మరి వాళ్ళకెంత నష్టం? ఆర్గ్యూ చేసింది కుసుమ

ఏమో! ఈ బ్యాంక్ దోపిడీలో కూడా ఏదో రహస్యముండి వుంటుంది అంది దేదీప్య

ఆ మాటకి– 'యిక నిన్నెవరూ బాగు చెయ్యరు'' అన్నట్టుగా ఒక ఎక్స్‌ప్రెషనిచ్చి ఊరుకుంది కుసుమ

వాళ్ళు సిటీ చేరుకునే సరికి రాత్రి పది దాటింది ఎవరికి వాళ్ళు ఆటోల్లో బయల్దేరారు

చలికాలం కావడంతో సిటీ మాటు మణిగింది రివ్వున వీస్తున్న గాలికి తట్టుకోలేక వెంట తెచుకున్న షాల్‌ని తల మీద నుంచి నిండుగా కప్పుకుంది దేదీప్య ఎక్కడో ఒకటి తప్ప స్ట్రీట్ లైట్ వెలగడం లేదు. రోడ్లన్నీ చీకటిగా వున్నాయ్

ఆటో నిజాం కాలం నాటి పురాతనమైన మహల్ ప్రహరీ గోడ ప్రక్కకి తిరిగింది ఆ భవనం దాదాపు ఫర్లాంగు దూరం వరకూ వ్యాపించి వుంది నిజాం వారసులకీ– ప్రభుత్వానికీ ఈ భవనం విషయంలో గొడవలు రావడంతో ఖాళీగా పడి వుంది పట్టపగలే ఈ ప్రాంతాలకి రావడానికి జనం భయపడతారు – కారణం – భవనం ఆవరణంతా పిచ్చిగా గుబురుగా పెరిగిన చెట్లు, దయ్యాలు తిరుగుతాయనే పుకారూ

అబ్బ పూర్వపు రాజులకి యింత పెద్ద పెద్ద యిళ్ళు ఎందుకో? అనుకుంది దేదీప్య ఆసక్తిగా లోపలికి చూసే ప్రయత్నం చేస్తూ

యింతలో హఠాత్తుగా కీచుమంటూ శబ్దం చేస్తూ ఆటో ఆగింది సడన్ బ్రేక్ వెయ్యడం వల్ల దేదీప్య ముందుకి తూలి కంగారుగా బయటికి చూసింది

ఎదురుగా మోటర్ సైకిళ్ళ మీద కూర్చున్న రెండు ఆకారాలు ఆ చీకట్లో భయంకరంగా కన్పించాయ్ బాగా చీకటిగా వుండడంతో వాళ్ళ ముఖాలు సరిగా కనబడడం లేదు

దేదీప్య మనసు కీడుని శంకించింది

ఆమె ఏదో అనబోయేంతలో బైక్స్ స్టార్ట్ అవడం – వాటి హెడ్ లైట్ల కాంతి ఆమె ముఖం మీద పడ్డం జరిగి పోయింది

దిగవే పిల్లా! నీతో కొంచెం మాట్లాడాలి! కర్కశంగా అన్న అగంతకుడిని క్షణం పరీక్షగా చూసింది ఆ హెడ్ లైట్ల వెలుగులో –

ఆ అగంతుకుల చేతుల్లో

కత్తులు – తళుక్కున మెరిసాయ్

భయంతో బిగుసుకు పోయింది దేదీప్య

ఎవరు మీరు? అడిగింది లేని ధైర్యంకొని తెచ్చుకుంటూ

అవన్నీ తర్వాత మాట్లాడుకుందాం గానీ, ముందు దిగు! అసహనంగా అన్నాడు రెండో వాడు

'ఆటో నువ్ పోనియ్!' అంది దేదీప్య బింకంగా సడెన్‌గా మోటార్ సైకిళ్ళ యింజన్లు ఆగిపోయాయ్ హెడ్‌లైట్లు ఆరిపోయాయ్ ఆ అగంతకులిద్దరూ మోటార్ సైకిళ్ళు దిగి స్టాండు వేసారు

ఏయ్ పిల్లా యిక్కడ నువ్ అరిచి గీపెట్టినా నీ గోడు వినే నాధుడు లేడు ఈ ఆటో ముసలాడు నిన్ను రక్షిస్తాడని భ్రమ పడుతున్నావేమో! వాడు నిన్ను దింపి ఐదు నిముషాల్లో మాయమవ్వకపోతే యిక్కడే శవంగా మారిపోతాడు అన్నాడొకడు కర్కశంగా

ఏవిటీ దౌర్జన్యం? అసలు నేనెవరో తెలుసా? పిచ్చి వేషాలెయ్యకండి! అంది దేదీప్య కాస్త కరుగ్గా

వాళ్ళిద్దరూ ఎగతాళిగా నవ్వారు

నువ్ మొండి పీనుగు జస్టిస్ సీతాదేవి కూతురువని మాకు తెలుసులేవే! నీ అమ్మ మమ్మల్ని జైలుకి పంపింది ఈ రోజే విడుదలయ్యాం యిన్నాళ్ళూ జైలు గోడల మధ్య విసిగిపోయాం అందుకే ఈ రోజు నీతో ఖుషీ చేసుకుందామని ఫాలో అయ్యాం అన్నాడొకడు

వ్వాట్!?! అంది దేదీప్య భయంగా

యింకా ఎందుకే పోజులు కొడతావ్? నీ ద్వారా నీ అమ్మకి గుణపాఠం నేర్పిస్తాం చింపిన విస్తరాకులా నువ్ కళ్ళ ముందు శవంలా తిరుగుతుంటే నీ అమ్మ కుళ్ళి కుళ్ళి చావాలి! ఊ దిగు అన్నాడు యింకొకడు

ఈ రోజుతో తన పని ఫినిష్! అని గ్రహించింది దేదీప్య ఈ ప్రాంతంలో ఎవరూ ఎక్కువగా తిరగరనీ– తన నిప్పుడు ఎవరూ రక్షించలేరనీ తెలుసు

ఏం చెయ్యాలి?

ఆలోచిస్తోంది దేదీప్య

ఏం చెయ్యాలి???

* * *

జీవితంలో గర్భదరిద్రుల్ని అంతదండలు లేని వాళ్ళని ఎవరూ పట్టించుకోరు పట్టించుకున్నట్లు నటిస్తారు' దరిద్రుల పేరు చెప్పుకుని బతుకుతారు గద్దెలెక్కుతారు లక్షల మంది పేదలను కీలుబొమ్మల్ని చేసి ఆడిస్తూ 'కొందరు' జులుం చెలాయిస్తారు– ఆ లక్షల మందిలో కొద్ది మంది తిరగబడితే?

ఆ యువకుడు పాతబడ్డ ఒక రాతి విగ్రహం మీద కూర్చుని ఆలోచిస్తున్నాడు నాలుగు రోజులకోసారైనా ఆ భవంతికి వచ్చి ఆ పరిసరాల్లో గడపడం యిష్టం అతనికి'

ఆ భవనం చుట్టుపక్కల కెవరూ రారు' అదీ తనలాగే దిక్కూ మొక్కూ లేకుండా పడివుంది లేకపోతే విశ్రాంతిగా – నిర్భయంగా – ఆలోచించొచ్చు అన్న బావన కావొచ్చు ఏది ఏమైనా ఆ యువకుడికి ఆ ప్రాంతమంటే మహాయిష్టం

అతను బోస్టన్ స్కూల్ నుంచి పారిపోయినప్పుడు తొలిసారిగా ఈ పరిసరాల ఒడిలోనే మూడు రోజులు తలదాచుకున్నాడు ఆ పరిసరాలకొస్తే తల్లి ఒడిలో సేదతీర్చుకున్నట్లుగా వుంటుంది

బిచ్చగాళ్ళు – చిల్లరదొంగలు కూడా ఈ చాయలకురారు ఈ వాతావరణం అంటే వాళ్ళకి భయం అలా వాళ్ళు బయపడ్డం వల్ల నిర్భయంగా తను సంచరించగలిగే ఈ స్థలమంటే ఆయువకుడికి మరింత యిష్టం

జేబులో నుంచి ఓ కాయితం తీసి – ఓ చేతో పెన్‌టార్చి పట్టుకుని వెలిగించి



– ఆ వెలుగులో ఆ కాయితాన్ని శ్రద్ధగా పరిశీలించాడతను తర్వాత బాల్‌పెన్‌తో రెండు మూడు చోట్ల సున్నాలు గీసాడు పరిశోధన చేస్తున్న శాస్త్రజ్ఞుడిలా అతను దీక్షగా తన పనిలో మునిగిపోయాడు

గర్ ర్ ర్ ర్ర్ ‘"

ఏదో అలికిడి అయినట్లు విన్పించి ఆ యువకుడు చటుక్కున పెన్‌టార్చినీ, కాయితాన్నీ, జేబులో పెట్టి – చెవులు రిక్కించి విన్నాడు మళ్ళీ ఏ చప్పుడూ విన్పించలేదు గాలికి చెట్లు ఊగుతున్నాయ్!

చెట్ల ఆకులు ఒకదానికొకటి రాసుకుంటూ అదో రకమైన శబ్దాన్ని కలుగ జేస్తున్నాయ్

ఆ శబ్దం కాదు తను వింది ఈ చెట్లు ఈ శబ్దాలు ఈ వాతావరణం తనకి అలవాటే! కానీ వీటన్నిటికీ భిన్నమైన చప్పుడు విన్పించింది ఏమిటది?

అతను ఎలర్టయి నిల్చున్నాడు తన 'ఎక్స్‌రే' కళ్ళతో చుట్టు పక్కల పరిసరాల్ని నిశితంగా పరిశీలించాడు! ఏ అలికిడీ లేదు!!

ఆ యువకుడు మళ్ళీ కూర్చోబోయాడు!

'ర్ర్ ర్ ర్ '

మళ్ళీ అదే చప్పుడు




ఏమిటా శబ్దం?

ఎక్కడ నుంచి వస్తోంది? కళ్ళు చికిలించి – దూరంగా కన్పించిన దృశ్యం చూసాడు అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయ్ ఆవేశంతో

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

చెయ్యిపట్టుకుని ఆటోలోంచి బైటకి లాగాడొకడు దేదీప్యని ఏదో పురుగు తాకినట్లుగా ఆ చేతిని విదిలించి కొట్టింది

"అబ్బో ఏట్ల మంచి పౌరుషంలోనే వుందే?" అన్నాడొకడు వెకిలిగా నవ్వి

దేదీప్య అలా ఆటో దిగిందో లేదో డబ్బులు కూడా అడక్కుండా ఆటో వాడు ఆటోతో సహా మాయమయ్యాడు

ఆటో వెళ్ళి పోవడంతో దేదీప్య ఆఖరి ఆశకూడా ఆరిపోయినట్లయింది

మొగుడు లోఫరయినా భలే కూతుర్ని కన్నదే జస్టిసమ్మ!' అన్నాడొకడు ఆమెని నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూస్తూ

షటప్! పిచ్చిపిచ్చిగా వాగావంటే నాలుక చీరేస్తాను' అంది దేదీప్య సురుగా

'అబ్బో యమ పోజు కొడుతున్నావే నీ రోషం యిక్కడకాదు పక్కలో చూపిద్దువు గాని పద !" అన్నాడు ఒకడు

'ఆ పిల్లతో యింకా మాటలేమిట్రా? పని కానియ్యక!" అన్నాడు యింకొకడు

ప్లీజ్! మీకు దండం పెడతాను కావాలంటే నా చైన్, రింగ్, వాచ్, డబ్బులు అన్నీ తీసుకోండి– కానీ నన్నేం చెయ్యకండి! అంది దేదీప్య చేతులు జోడించి

ఇది కూడా దాని తల్లిలాగానే చిల్లర దొంగలనుకుంటోంది రా మనల్ని! మేం కూడా మమ్మల్ని జైలుకి పంపొద్దని నీ అమ్మకి యిలాగే దండం పెట్టామే! అయినా విన్నదా? యమ స్ట్రిక్ట్ అట! మేం దాని బాబులం! దాని కన్నా స్ట్రిక్ట్ అనుకున్నది సాధించకుండా వదలం! అని ఒకడు చటుక్కున దేదీప్యని ఒడిసి పట్టుకుని భుజం మీద వేసుకుని దెయ్యాల భవనం వేపు నడవ సాగాడు

రెండో వాడు మోటర్‌సైకిళ్ళను ఒక పొద పక్కకి చేర్చాడు

మొదటి వాడు దేదీప్యని ఒక పాడుపడిన పొద పక్కన పడేసాడు దేదీప్యకి నడుము విరిగినట్లయింది

'అబ్బ!' అంది బాధగా

యిప్పుడేం వుందే కాస్సేపాగితే అబ్బబ్బ అంటావ్! ఈ నాగులు గాడంటే ఏమనుకున్నావ్?' అన్నాడు వెకిలిగా ఆమె చటుక్కున లేచి నిలబడింది

ఈ లోగా రెండో వాడు కూడా వచ్చి మొదటి వాడిని కలిసాడు యిద్దరూ సన్నగా విజిల్స్ వేస్తూ ఒక్కో అడుగే ముందుకు వేస్తున్నారు మీదికి వస్తున్న ఆ రౌడీలనుంచి తప్పుకునే ప్రయత్నంలో వెనక్కి జరుగుతోంది దేదీప్య సడెన్‌గా వెనకగోడ తగలడంతో ఆగిపోయిందామె

"ఎక్కడికి పోతావే! అంటూ ఒకడు ముందుకురికి ఆమె రెండు చేతుల్నీ గోడకి అదిమిపట్టి ముద్దు పెట్టుకోవడానికి ప్రయత్నించాడు అసహ్యంగా ముఖం పక్కకి తిప్పుకుంది దేదీప్య

ఒరేయ్! దీన్ని గోడకి అదిమిపట్టరా!' అన్నాడు మొదటివాడు రెండోవాడు చెంగున దూకి దేదీప్య చేతుల్ని గోడకి అదిమి ఆమెని కదలనివ్వకుండా చేసాడు మొదటి వాడు కర్కశంగా నవ్వి దేదీప్య ముఖాన్ని తన వేపుకి తిప్పుకున్నాడు తన ముఖానికి దగ్గరగా భయంకరమైన దుర్వాసనతో నిండిన అతని ముఖాన్నుంచి తనను తాను రక్షించుకునే ప్రయత్నంతో – అప్రయత్నంగా ఆమె గొంతులోంచి వచ్చిన కేక ఆ పరిసరాల్లో ప్రతిధ్వనించింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

అమ్మా!'

ఆ నిశ్శబ్ద నిశీధిలో గుండెలు చీల్చుకుని ఓ అబల వేసిన కేక చీకటిని చీల్చుకుని ఆ యువకుడి చెవిన పడింది అంతే!!

వింటి నుంచి విడిచిన బాణంలా ఆ కేక వచ్చిన వేపు పరుగెత్తాడు నిముషం గడవగానే ఆ స్త్రీ పెడుతున్న కేకలు, దుండగుల హుంకరింపులూ స్పష్టంగా విన్పించడంతో ఠక్కున తన పరుగును ఆపి చీకట్లో కళ్ళు చికిలించి చూసాడు– జరుగుతున్న ఘోరం దగ్గరగా స్పష్టంగా కన్పించింది.

అరువ్! గొంతు చిరిగేలా అరువ్! నీ అమ్మకి వినబడేలా అరువ్! నీ బాబెవడు రక్షిస్తాడో చూస్తాను! అంటూ ఆమెని ఆక్రమించే ప్రయత్నం చేస్తున్నాడు ఆ వ్యక్తి

దేదీప్య గింజుకుంటోంది!!

అది చూచిన ఆ యువకుడి రక్తం వేడెక్కింది !

ఒక్క అంగలో వాళ్ళని చేరి– దేదీప్య పెదాల్ని తన మొరటు పెదాలతో కలపబోతున్న ఆ వ్యక్తిని జుట్టుపట్టుకుని బలంగా వెనక్కి లాగాడు

షాక్‌తో ఆ వ్యక్తి కళ్ళు పెద్దవయ్యాయ్ తన తోటి వ్యక్తి కాక, మరో ఆకారం తనకి దగ్గర్లో నిలబడేసరికి క్షణం తొట్రుపడ్డాడు

ఆ క్షణం చాలు ఆ యువకుడికి!

కాలితో బలంగా అతని నోటి మీద తన్నాడా యువకుడు రెండు పళ్ళు ఊడి పడగా–

అబ్బా అని అరుస్తూ వెనక్కి తూలిపడ్డాడు ఈ హఠాత్పరిణామానికి బిత్తరపోయి దేదీప్యని వదిలేసిన రెండో వ్యక్తిని జుట్టు పట్టుకుని గోడకి కొట్టుకునేలా వెనక్కి నెట్టాడు దేదీప్య ఆలస్యం చెయ్యకుండా దూరంగా పరుగెత్తింది

ఎవడ్రా నువ్వు? పిల్లకాకీ! ఎంత ధైర్యంరా నీకు? ప్రాణాల మీద ఆశవుంటే యిక్కడ్నుంచి పారిపో! లేదా ఈ గోడల మధ్య సజీవ దహనం చేస్తాను'' పళ్ళూడిపోగా రక్తం కక్కుతున్న నోటిని ఓ చేత్తో మూసుకుని అన్నాడు మొదటి వ్యక్తి అలా నోటిని చేత్తో మూయ్యడం వల్ల అస్పష్టంగా ఉన్నాయతని మాటలు అంత చీకట్లోనూ అతని కళ్ళు మర్డర్ యిన్స్టింక్ట్ తో మెరుస్తున్నాయి!

దూరం నుంచి యిదంతా చూస్తున్న దేదీప్యకి ఒళ్ళు జలదరించింది ఆ దుండగుడి ముందు ఆ యువకుడు ఏనుగు ముందు జింక పిల్లలా వున్నాడు! భగవంతుడా! నా వల్ల ఈ యువకుడు అనవసరంగా చచ్చిపోయేలా వున్నాడు రక్షించు! అనుకుంది ఆ కుర్రాడిని ఈ దుర్మార్గులకి వదిలేసి పారిపోవడానికి అంత భయంకరమైన పరిస్థితిలో నూ మనసొప్పలేదు దేదీప్యకి!

దుండగుడి హూంకరింపుకి ఎదులు చెప్పలేదా యువకుడు రెప్పవాల్చకుండా అతన్నే చూస్తున్నాడు గోడకి విసిరిన మరో వ్యక్తి తల దిమ్మెక్కి కదల్లేని స్థితిలో వున్నాడు

"ఏంట్రోయ్! గుడ్లగూబలా చూస్తున్నావ్? నా తడాఖా ఏంటో చూస్తావా?" అంటూ చెయ్యెత్తాడు అతని చేతిలోని కత్తి తళుక్కుమంది"

అప్పటికీ ఆ యువకుడు అంగుళం కూడా కదల్లేదు" దుండగుడి చెయ్యి గాల్లోకి లేచి బలంగా కిందికి ఆ యువకుడి గుండెల వేపుగా దిగింది

ఆ దృశ్యం చూడలేక కెవ్వున అరుస్తూ కళ్ళు గట్టిగా మూసుకుంది దేదీప్య

క్షణం గడిచింది యుగంలా –

క్షణం తర్వాత ఆమె మెల్లిగా కళ్ళు తెరిచింది ఎదురుగా కన్పించిన దృశ్యం చూసి అవాక్కయింది! దుండగుడు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి కిందపడి లేస్తున్నాడు

ఆ యువకుడు రాతిబొమ్మలా అలాగే నిల్చున్నాడు ఈసారి దుండగుడు చాలా జాగ్రత్తగా ఆ యువకుడి మీదకి లంఘించాడు!

ఆ యువకుడు ఎప్పుడు కదిలాడో ఎలా కొట్టాడో తెలీదుగానీ దుండగుడు భయంకరమైన బాధతో మృగంలా అరవడం విని దేదీప్య ఒళ్ళు జలదరించింది

సినిమాల్లో ఎన్నో టెక్నికల్ ఫైట్స్ చూసింది యిప్పుడు కళ్ళముందు జరుగుతున్న ఫైట్‌ని నిర్విణ్ణురాలై చూస్తుండిపోయింది అలాగే

ఈ లోగా తల దిమ్మెక్కి పడిపోయిన రెండో వ్యక్తి లేచాడు వాళ్ళని గుక్కతిప్పుకోనివ్వలేదాయువకుడు మెరుపు వేగంతో కదులుతూ వాళ్ళిద్దరినీ చావ చితకతన్నాడతను యిద్దరూ నేల కొరిగారు

ఆ యువకుడు ఏమాత్రం తొట్రుపడకుండా ఒకడిని ఎత్తి భుజం మీద వేసుకుని గోడబయటికి నడిచాడు

చచ్చిపోయాడా? అంది దేదీప్య భయంగా

ఆ యువకుడు మాట్లాడలేదు మౌనంగా ఆ యిద్దరినీ తీసుకెళ్ళి మోటర్‌సైకిల్ మీద పడేసాడు

చేతులు దులుపుకుని రెండో బైక్ దగ్గరికి నడిచాడు

వాళ్ళని యిక్కడే వదిలేస్తారా? పోలీస్ రిపోర్ట్ యివ్వరా? అడిగింది దేదీప్య మళ్ళీ

ఈ సారికూడా ఆ యువకుడేం మాట్లాడలేదు అతని ధోరణి ఆమెకి ఏమాత్రం అర్థం కాలేదు యితనెవరు? మూగవాడా? పిచ్చివాడా? ఈ సమయంలో ఈ శిథిలాల్లో యితనెందుకున్నాడు? అన్న ఆలోచన రాగానే ఆమె గుండె ఝల్లుమంది తను మామూలు రాక్షసుల బారి నుంచి తప్పించుకుని రావణాసురుడి బారిన పడలేదు కదా! అన్న ఊహతో ఆమె నిలువెల్లా వణికిపోయింది

(ఇంకా ఉంది)

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

ఎన్ కె. ఆర్ పర్లాకిమిడి

★ ఒక మనిషిని కొందరు పూజిస్తారు మరికొందరు ద్వేషిస్తారు కారణం?

● అందరూ ఒకేలా చూడరు అంతే

ఆర్ వి ఎల్ భీమవరం

★ నేటి యువతపైమీ అభిప్రాయం?

● వేస్టెడ్ ఎనర్జీ

బి వి ఆర్. కాకినాడ.

★ పంజాబులో టెర్రరిస్టులకు అంతంలేదా? ప్రజలకు శాంతి కల్గేది ఎప్పుడు?

● శాశ్వతమైన శాంతి – ఎప్పుడూ వుండదు టెర్రరిజం ఒక్క పంజాబుకేనా పరిమితమైంది? అసంతృప్తి వున్న ప్రతిచోటా అది తలెత్తకమానదు పట్టించుకోని మానవ సమస్యలకి – పర్యవసానం – అదే

ఎమ్ ఎస్ పి రాజమండ్రి

★ ప్రశ్నావళిపై బొమ్మ మీదా అని అడుగుతున్నారని బాధ భరించలేక మార్పించేశారా? మీ సమాధానాలు సూటిగా, ఘాటుగా, నవ్వు తెప్పించేవిగా వుంటాయి నేను పత్రికరాగానే మొదట చదివేది ప్రశ్నావళి శీర్షికే అంటే నమ్ముతారా?

● ఆ పాటో నాదనుకుంటే – నాకే మంచిదికద! కొందరు రచయిత్రులలాగా – చిన్ననాటి పాటో యిచ్చి సంతోషించే ఓపికలేదు నాకు! హాయిగా – ఎప్పటిరూపు అప్పుడు మీలాంటివారికి తెలిస్తేకద – కాస్త భయం! కాస్త భక్తి! కాస్త ఒళ్ళుమంట, కాస్త నవ్వు, కాస్త దుఃఖం అన్నీకల్గేది! తిట్టుకుంటూనేనా నా పేజీ చదివేవాళ్ళుంటే – నా కెప్పుడూ యిష్టం!

ఎన్. ఎస్. పి. ఖర్గపూరు

★ మీరు ఎంతో మంచి రచయిత్రి అనిపించు కున్నారు మీ అభిమాన రచయిత్రిని చెప్పండి?

● రంగనాయకమ్మ!

★ మీరు పాఠకుల ప్రశ్నలకు జవాబులివ్వడం ఉత్తమ మార్గమా? లేక నవల్సు రాయడం ఉత్తమమార్గమా?

● నాది మధ్యేమార్గం అందుకే – రెండూ చేయడం నాకు బాగానేవుంది!

రఫీ. కాశీబుగ్గ.

★ రామలక్ష్మిగారూ! స్నేహితురాళ్ళు స్నేహంగా వుంటూ మిమ్మల్ని మోసంచేస్తే మీరు ఎలా ఫీలవుతారు?

● ముందు నమ్మను. నిరూపితమైతే – సిగ్గుపడతాను – అలాంటివారిని – స్నేహితులను కున్నందుకు తరవాత – వారికి నా అభిప్రాయం చెప్పి గుడ్‌బై చెప్పేస్తా

★ నా దేహంనిండా సందేహాలే పంపమంటారా? వద్దంటారా?

● ఒకటి అరా యిలా పంపితే చాలు రఫీ! అసలు సందేహం రానివాడు జడుడు అయివుండాలి

★ ప్రపంచంలో అన్నిటికంటే గొప్పది ఏదో చెప్పకలరా?

● ఆత్మీయతకు మించిన – గొప్పదేం లేదనిపిస్తుంది నాకు

★ ప్రతి మనిషీ ఒంటరి జీవితాన్ని కోరడు – ఎందుకని?

● ఒంటరితనంలో – శాంతిలేదు
సుఖం – పంచుకుంటే రెట్టిస్తుంది
దుఃఖం – పంచుకోండి – సగం అవుతుంది తెలియదా?

సుదర్శన్. భీమవరం

★ వామపక్షాలు జాతీయస్థాయిలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రత్యామ్నాయం సృష్టించాలను కుంటున్నాయి అది సాధ్యపడుతుందా?

● కోపంతో చేసేపని ఎప్పుడేనా సత్ఫలితాల నిస్తుందా? వామపక్షాలే – కప్పల తక్కెడ ఇక అవన్నీ కలసి కూర్చునేదెప్పుడు?! కార్యం సాధించే దెప్పుడు?!

★ ఒక వ్యక్తిని వేరొక వ్యక్తి దోచుకునే దౌర్భాగ్య వ్యవస్థపైమీ అభిప్రాయం?

● దోపిడీ మన నేషనల్‌హాబీ కాదన్నవాళ్ళు మైనారిటీ అంతే

డి. ఎల్. ఎన్. సికింద్రాబాదు.

★ మీ రచయిత్రులు – ఊహాలోకాల్లో ఎగురుతా రెందుకు?

● నాకు తెలియదు రెక్కల్లేకుండా ఎగరడం ప్రమాదం – నాకు రెక్కల్లేవు అంచేత – నేను నేల విడవను □



# బైద్యనాథ్ ...............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగచేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము.



## బైద్యనాథ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,






## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.



మామూలు పండ్లపొడేకాదు ఔషధముకూడా దంతక్షయము మరియు చిగుళ్ళ
వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన
చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

బైద్యనాథ్ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాథ్ ఆయుర్వేద పండ్లపొడి

B3P 97T.

# కోడలూ ఒకనాటికి అత్తే!

ముందరపు ఉమాలక్ష్మి

అప్పటికే ఆఫీసుకి టైం అవడంతో ఆదరా బాదరాగా డ్రెస్ చేసుకుంటున్నాడు పవన్

ఏమండీ! నేను చెప్పేది మర్చిపోరుగా!' అంది అలేఖ్య

ఇల్లు సంగతేనా! అయినా నీకంత తొందరెందుకు?

తొందరా! ఇల్లు దొరకాలే గాని, ఈ క్షణంలో ఇక్కడ నుండి వెళ్ళిపోదామని ఉంది అయినా నా బాధ మీకేం తెలుస్తుంది? ఎంతైనా ఆవిడ మీకు తల్లి అంది రుస రుసలాడుతూ

అలేఖ్యా ఎందుకలా గొడవ చేస్తావు?

ఔనండీ! నేనేది చెప్పినా మీకు గొడవగానే ఉంటుంది మీ అమ్మగారు చెప్పేవన్నీమీకు వీనుల విందుగా ఉంటాయి అంత తల్లి కొంగు పట్టుకుని వ్రేలాడాలనుకుంటే, నన్నెందుకు పెళ్ళి చేసుకున్నారు? జీవితాంతం బ్రహ్మచారిగా ఉండిపోలేక పోయారా! మీకు ఈ బాద తప్పేది అంది ముక్కు చీదుతూ!

నేనేమన్నా అంటే నీకు కళ్ళ ముందుంటాయి కన్నీళ్ళు ఇప్పుడు నేను నీ మాటలు కాదన్నానా! త్వరలో మనం ఇక్కడి నుండి వెళ్ళిపోదాం అలేఖ్యా! నువ్వలా ఏడుస్తూ నన్ను ఆఫీసుకు సాగనంపితే, వెళ్ళిన పని అసలు అవదు ఏదీ ఒక్కసారి నవ్వు అన్నాడు ఆమె కన్నీళ్ళు తుడుస్తూ

అలేఖ్య పెదాలపై సన్నని చిరునవ్వు మెరిసింది ఆమె కళ్ళలో విజయగర్వం తొంగి చూసింది

అసలు నీకు సత్యభామ అని పేరు పెట్టాల్సింది అన్నాడు ఆమె బుగ్గ మీద చిటికె వేస్తూ!

ఈ మురిపాలకేం తక్కువలేదు ముందు నేను చెప్పిన సంగతి చూడండి అంది మూతి సున్నాలా ముడుస్తూ!

సర్లె! సాయంత్రం నేను వచ్చేసరికి రెడీగా ఉండు పస్టు షోకి వెళ్దాం అని అక్కడ నుండి బయటకు వచ్చాడు

ఆ గది బయట నిల్చున్న కమల వాళ్ళ మాటలు వినడంతో నే నీరసంగా అయిపోయింది

బయటకి వచ్చిన కొడుకుని చూసి 'ఒరేయ్ పవన్! ఒకసారి ఇటు రా! అని పిలిచింది

ఎందుకమ్మా! అసలే ఆఫీసుకి టైం అయిపోతుంది అన్నాడు చికాగ్గా

అది సరేగానీ! ఇల్లంటున్నారు ఎవరికి రా! అడిగింది ఆత్రంగా

అదా. అది అది మాకేనమ్మా! అన్నాడు తడబాటుగా

అంత కంగారు దేనికిరా! అయినా ఈ ఇంట్లో నీకు, నీ భార్యకు ఏం తక్కువ?? లంకంత ఇల్లు వదిలేసి, ఎక్కడికో వెళ్ళిపోతానంటారేం?

ఔనమ్మా! నీకు అలేఖ్యకు పడటంలేదు అటువంటప్పుడు విడిగా ఉంటేనే మంచిదిగా! లంకంత ఇంట్లో అశాంతిగా బ్రతికే కన్నా, చిన్న ఇంట్లో ప్రశాంతంగా బ్రతకొచ్చు నీకు ఈ ఇల్లు ఎక్కువై పోతుందంటే, ఒక వాటా అద్దెకి ఇచ్చుకో! అప్పుడు నీకు ఒంటరిగా ఉండే బాధ తప్పుతుంది

అంటే అంటే ఏమిటిరా నువ్వనేది? మీరిద్దరూ వేరు వెళ్ళిపోతారా! నేను ఒక్కదాన్నే ఎలా బ్రతకాలిరా! అసలే మీ నాన్నగారు పోయిన దుఃఖంతో ఉన్నాను ఇప్పుడు ఇప్పుడు మీరిద్దరూ నన్ను వదలి వెళ్ళిపోతారా! ఇది మీకు న్యాయంగా ఉందా? పూడుకు పోయిన గొంతుతో అంది

'ఒంటరిగా వుండలేకపోతే, బామ్మని, తాతయ్యని నీ దగ్గర పెట్టుకో! అంతేగాని, నేను ఈ యింట్లో ఉండడం కల్ల'' అని అక్కడ నుండి వెళ్ళిపోయాడు పవన్

పవన్ వెళ్ళిన వైపే నీళ్ళు నిండిన కళ్ళతో చూస్తుండిపోయింది

పవన్ ఏమన్నాడు? తనని ఒక్కదాన్నే వుంటే వుండమన్నాడు లేకపోతే బామ్మని, తాతయ్యని తెచ్చుకోమన్నాడు

అసలు వాళ్ళు తన దగ్గరకి వస్తారా? ఇంటికి వచ్చిన వాళ్ళని నిర్దాక్షిణ్యంగా బయటకు పంపేసిందే! ఇప్పుడే ముఖం పెట్టుకొని వాళ్ళ దగ్గరకు వెళ్ళగలదు?అసలు వాళ్ళు తనని క్షమిస్తారా?

ఆమె ఆలోచనలు ఒక్కసారి గతంలోకి మళ్ళాయి

* * *

తన తండ్రి దనవంతుడు అవడంతో, తను చిన్నప్పటి నుండి అల్లారు ముద్దుగా పెరిగింది తనన్న మాట జరగకపోతే భరించలేకపోయింది తనొకర్తే కాబట్టి తన మాట నెగ్గేది

తనకి చదువంటె అంత శ్రద్ధ లేకపోవడం వల్ల ఎనిమిదో తరగతిలోనే చదువు ఆగిపోయింది చదువు మానేసి యింట్లో కూర్చోవడం తనకి చికాగ్గానే వుండేది ఎంత సేపూ సినిమాలు, నవలలుతోనే కాలాన్ని వెళ్ళబుచ్చేది ఇంట్లో పనులు ఏవీ ముట్టుకునేది కాదు అసలు తనకి ఏ పనీ నేర్పలేదు అమ్మ

నాన్నగారు అల్లుడిని ఇల్లరికం తెచ్చుకోవాలని ఎంతో ఆరాటపడేవారు కానీ తనకొచ్చిన సంబందాలలో ఏ ఒక్కరూ అందుకు ఒప్పుకోక పోవడంతో, తన పెళ్ళి వాయిదా పడసాగింది ఈలోగా నాన్నగారు అస్వస్తతకు గరి కావడంతో తన పెళ్ళి గురించి ఆరాటం ఎక్కువై పోయింది

ఆ సమయంలో నే తనకీ సంబందం వచ్చింది ఈ సంబందం నాన్నగారికి అన్ని విదాలా నచ్చడంతో తను పెళ్ళికి ఒప్పుకుంది కానీ ఆయన మాత్రం ఇల్లరికం రావడానికి ఒప్పుకోలేదు

నాన్నగారిది మంచం మీద నుండి లేవలేని పరిస్థితి అమ్మకి నా పెళ్ళి కాదేమోనన్న బెంగ, తన చేత ఈ పెళ్ళికి ఒప్పించాయి

తనని ఒక లక్షాదికారికి యివ్వాలని, లేకపోతే అల్లుడిని యిల్లరికమైనా తెచ్చుకోవాలన్న నాన్నగారి ఆశ అడియాసె అయ్యింది

తన పెళ్ళి జరిగిపోయింది తను మొదటి సారిగా అత్తవారింట్లో అడుగు పెడుతూనే ఆ యిల్లు చూసి చీదరించుకుంది

వాళ్ళుంటున్నది ఒక చిన్న పెంకుటిల్లు, తన భర్త కేవలం ఒక గుమాస్తా కన్న వారింట్లో లాగ యిక్కడ పని మనుషులు నౌకర్లు లేరు అన్ని పనులు స్వయంగా చేసుకోవలసిందే! ఈ విషయాలన్నీ తను ఎన్నాళ్ళ వరకొ జీర్ణించుకోలేకపోయింది

తను కలవారింటి నుండి వచ్చిందని, అత్తయ్య తనకి ఏ పనీ ఎక్కువగా చెప్పేది కాదు అన్నీ ఆవిడే

స్వయంగా చేసుకునేది

ఎప్పుడూ తెల్లవారక ముందే నిద్ర లేచి, అన్ని పనులూ చేసుకునే అత్తయ్య, ఆ రోజు ఏదైనా నిద్ర లేవకపోవడంతో ఆయన నన్ను నిద్ర లేపారు

"కమలా! అమ్మకి జ్వరం వచ్చింది త్వరగా లేచి కాస్త కాఫీ పెట్టు" అన్నారు తను కప్పుకున్న దుప్పటి లాగేస్తూ

"అబ్బ! వుండండి భలే నిద్ర మత్తుగా వుంది" అంది తను కళ్ళు మూసుకుంటూనే

"లేచి ముఖం కడుక్కుంటే, మత్తు అదే వదులుతుంది వెళ్ళు అమ్మకి ఏం కావాలో చూడు ' అన్నాడు చిరాగ్గా

"అదేదో మీరే చూడకూడదూ నాకంటే ముందు మీరే లేస్తారుగా" అంది లేచి కూర్చుంటూ

అంతే! తన చెంప చెళ్ళుమంది

"ఎందుకు నన్ను కొడతారు? అయినా యిప్పుడు నేనేం తప్పు మాట అన్నానని?" అంది దిగ్గున లేచి నిలబడుతూ

"ఏం తప్పు మాట అన్నానని అడుగుతున్నావా? రోజూ నీకు బెడ్ కాఫీ అందించేది అమ్మ అటువంటిది ఈ రోజు అమ్మ జ్వరంతో పడుకుంటే కాసిన్ని కాఫీ నీళ్ళు పొయ్యలేవా? అసలు నువ్వు మనిషివేనా?" అన్నాడు ఎగిరిపడుతూ

"ఔనండీ! నేను మనిషిని కాదు మృగాన్ని అందుకే అన్నాను ఈ యింటికొక వంట మనిషిని, పని మనిషిని పెట్టమని నా మాట మీరు ఏనాడు వినిపించుకున్నారు గనుక" అంది అక్కడ నుండి లేస్తూ

ఛీ! ఛీ! నీతో మాట్లాడడం నాదే బుద్ధి తక్కువ ఇంటి పరిస్థితులు తెలిసుండి కూడా, నువ్విలా మాట్లాడుతున్నావంటే ' అది నన్ను అవమానించడానికే వెళ్ళుముందు యిక్కడినుండి' అన్నాడు చిరాగ్గా

ఇంతలో రాజేశ్వరి నిద్రలేచి, మెల్లగా వంటింటి వైపు వెళ్ళబోయి తూలి పడబోయింది

'రాజూ ఇంత జ్వరంతో ఎందుకు లేచావు? నీకేం కావాలో చెప్పు' అన్నాడు మాదవరావు ఆమెను పొదివిపట్టుకుంటూ

ఏం లేదండీ! కాస్త ముఖం కడుక్కుందామని లేచాను" అంది ఉన్నచోటనే కూర్చుంటూ

"అలాగా! ఉండు కమలని పిలుస్తాను' అని మాధవరావు కమలని పిలవడానికి వెళ్ళేడు

కమల చిరాకుపడుతూనే వచ్చి, ఆవిడని బాత్‌రూమ్‌కి తీసుకువెళ్ళింది

రాజేశ్వరికి పదిహేను రోజులైనా జ్వరం తగ్గకపోవడంతో బాగా నీరసించిపోయింది అడుగుతీసి అడుగు వేద్దామంటే, గాలిలో తేలిపోతున్నట్టుగావుంది

భార్య పరిస్థితి చూస్తుంటే మాధవరావుకి బెంగగావుంది రాజేశ్వరి మంచానపడిపోవడంతో తనకి వేళకి తిండిపెట్టే వాళ్ళేలేకపోయారు అయినా రాజేశ్వరి ఆరోగ్యం . బాగాలేనప్పటినుండి మాధవరావుకి వేళకింత తినాలన్న ధ్యాస కూడా లేకపోయేది

ఇంటి పనులన్నీ కమల మీద పడడంతో ఆమెకు మరింత విసుగు, కోపం ఎక్కువైపోయాయి భర్త యింట్లో లేనప్పుడు చీటికి మాటికి అత్తగారిమీద మామగారిమీద విసుక్కునేది మంచంమీద పడుకున్న రాజేశ్వరిని సూటి, పోటి మాటలతో బాధించేది

రాజేశ్వరి అన్నీ మౌనంగా భరించేదేతప్ప ఏనాడూ నోరు విప్పి కొడుక్కిగాని, భర్తకిగాని కోడలిమీద చెప్పేదికాదు

రెండు నెలలవరకు రాజేశ్వరికి వచ్చిన జ్వరం



తగ్గలేదు జ్వరం తగ్గినా, నీరసం ఎక్కువగా వుండడంతో పనులు ఏవీ చెయ్యలేకపోయేది

ఆరోజు తను నూతి దగ్గర కూర్చుని అంట్లు తోముతుంది

అప్పుడే మాధవరావు అమ్మా కమలా! కాస్త ఈ గ్లాసు కడిగిపెట్టమ్మా, మీ అత్తయ్య మంచినీళ్ళు కావాలంటుంది అన్నారు

ఊఁ యిలా యివ్వండి అన్ని చాకిరీలు చెయ్యడానికి నేనొక పనిమనిషిలాగ వున్నానుగా అని గ్లాసు అందుకుంది

తను అలా మాట్లాడడంతో ఆయన చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయారు

ఆ మర్నాడే అంట్లు తోమడానికి పనిమనిషిని మాట్లాడారు

అయినా తనకి మంటగానేవుండేది ఇంట్లో వంటపని చెయ్యాలంటే మహావిసుగ్గావుండేది అత్తకి, మామయ్యకి వండి పెట్టడం తనకెంతో చిరాగ్గావుండేది

ఇక ఈ యింట్లోవుంటే తనకి చాకిరీ తప్పదని వేరే యిల్లు చూడమని భర్తని పోరేది

కమలా! మతివుండే మాట్లాడుతున్నావా? మనం వేరే వెళ్ళిపోతే అమ్మని నాన్నని ఎవరుచూస్తారు? అన్నాడు

మతి వున్నదండి ఇంకా ఈ యింట్లో వుంటే ఆ మతి కూడా పోతుంది మీరు వేరే యిల్లు చూసేదాకా, నే నీ యింటికి తిరిగిరాను నేను ఈరోజే మా నాన్నదగ్గరకి వెళ్ళిపోతున్నాను అంది

వెళితే వెళ్ళు ఎన్నాళ్ళుంటావో వుండు అక్కడ నీ సరదా తీరిపోగానే నువ్వేవస్తావు అని వెళ్ళిపోయాడు విజయ్

తన మాట కాదన్నాడన్న కోపంతో అత్తయ్య, మామయ్య వారిస్తున్నా వినకుండా కన్నవారింటికి వెళ్ళిపోయింది

కోడలు యింట్లో లేకపోవడంతో ఎంతో వెలితిగా వుండేది రాజేశ్వరికి

బాబూ! అది అలిగి వెళ్ళిపోతే దాన్ని అక్కడే వుంచేస్తావా? అది కలవారి బిడ్డ దాని మనసు బాదపెట్టకూడదు అనేది రాజేశ్వరి

అమ్మా! అది మళ్ళీ ఈ యింట్లో అడుగుపెడితే నిన్నూ, నాన్నని సూటిపోటి మాటలతో బాధిస్తుంది దాని పొగరు అణిగేవరకు అక్కడేవుండనీ అనేవాడు విజయ్

ఒరేయ్ విజయ్! కోడలిని ఈ యింటికి తీసుకురాకపోతే, మేమే యిక్కడనుండి వెళ్ళిపోతాం అన్నాడు మాధవరావు

ఆ మాటకు జడసి కమలని యింటికి తీసుకు వచ్చాడు

★ ★ ★ ★

ఆరోజ సాయింత్రం కమల హడావుడిగా ఏమండీ! ఈ సొరుగులో పెట్టిన రాళ్ళనెక్లెస్ మీరేమన్నా చూసారా! అంది

కమలా! ఎక్కడపెట్టి, ఎక్కడవెతుకుతావో నీకే తెలియదు సరిగ్గా వెతుకు అన్నాడు

నాకేం అంత మతిమరుపులేదులెండి అయినా మీ చెల్లెలు వచ్చిందిగా, ఆవిడగారు యీనెక్లెస్ మీద మోజుపడ్డారు మీ అమ్మగారు గాని తీసి ఆవిడకిచ్చారేమో ఒక్కసారి అడగండి

కమలా! ఏమిటి ఏమిటి నువ్వంటున్నది?

ఔనండీ! ఇంట్లో పెట్టిన నగ ఎక్కడకు పోతుంది?

ఇంతలో రాజేశ్వరి ఆటురావడంతో వాళ్ళ నోర్లు మూతబడ్డాయి

ఏమిటమ్మా కమలా? మళ్ళీ వాడితో జగడం పెట్టుకుంటున్నావా? అంది చిన్నగా నవ్వుతూ

మీ అబ్బాయితో జగడంపెట్టుకోవలసిన అవసరం నాకేంరాలేదు ఈ బీరువా సొరుగులో పెట్టిన నెక్లెస్ మీరుగాని తీసారా అని అడుగుతున్నాను

నేను నేను నీ నెక్లెస్ తియ్యడమా? అంటే నన్ను నన్ను అనుమానిస్తున్నావా? అంది, తడబాటుగా రాజేశ్వరి

ఇప్పుడు నేనేం మిమ్మల్ని దొంగ అనలేదే అనవసరంగా మీరెందుకు భుజాలు తడుముకుంటారు? అయినా లేనివాళ్ళకి అలాంటి ఆలోచనలే వస్తాయి నన్నడిగితే ఆ నెక్లెస్ నేనే యిచ్చేదాన్నిగా అంది కమల

కమలా! ఏమిటా పిచ్చివాగుడు? నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా? కోపంగా అన్నాడు విజయ్

ఔనండీ నాది పిచ్చి వాగుడే! ఆవిడే అన్నీ లేనిపోనివి కల్పించుకొని నామీద నిందవేస్తుంటే మీకు హాయిగావుంటుంది అయినా చీటికీ మాటికీ పెడర్థాలు తీసే వాళ్ళదగ్గర నే నుండలేను అందుకే మనకి వేరే యిల్లు చూడమని పోరుతున్నాను మీరు నా మాట వినిపించుకుంటేగా అంది కన్నీళ్ళు పైటకొంగుతో తుడుచుకుంటూ

ఏమిటమ్మా యిదంతా! దానికి తెలియకపోతే నువ్వన్నా సర్దుకుపోరాదూ రానురాను యిల్లొక నరకంలాగ తయారవుతోంది మీ యిద్దరికీ చెప్పలేక మధ్యన నేను నలిగిపోతున్నాను అన్నాడు విజయ్ చిరాగ్గా

ఔనురా విజయ్! నీ భార్య వచ్చినదగ్గరనుండి ఈ యిల్లు నరకంగా తయారయ్యింది ఇంకా నువ్విక్కడ వుండి నరకాన్ని సృష్టించేబదులు ఆవిడ కోరిక ప్రకారమే వేరే వెళ్ళిపో! మీ అమ్మని పోషించుకోవడానికి నేనింకా బ్రతికేవున్నాను అన్నాడు అప్పుడే వచ్చిన మాధవరావు

ఏమండీ! ఏమిటి మీరంటున్నది? మనకి మిగిలిన ఒకేఒక్క మగబిడ్డ వీడేనండీ వీడిని కళ్ళెదురుగా చూసుకోకుండా ఎలా బ్రతగ్గలనండి? అంది రాజేశ్వరి ఏడుస్తూ

రాజేశ్వరీ! మనుషులు దూరంగా వున్నప్పుడే అభిమానాలు, ఆప్యాయతలు నిలబడతాయి దగ్గరైనకొద్దీ మొహం మొత్తుతుంది వాళ్ళు ఎక్కడికీ వెళ్ళిపోరు ఈ వూర్లోనే వుంటారుగా! నువెప్పుడు వాళ్ళని చూడాలనుకుంటే, అప్పుడే వాళ్ళదగ్గరకి వెళ్ళొచ్చు వాడికి నీమీద, నామీద అభిమానం మిగిలివుంటే, మనల్ని చూడడానికి వస్తాడు అడ్డాలనాడే బిడ్డలుగాని, గడ్డాలొచ్చేక బిడ్డలా? నువ్వు మనసు రాయిచేసుకుని వాడిని చిరునవ్వుతో పంపించు అన్నాడు మాధవరావు లాలనగా

రాజేశ్వరి పైటకొంగు నోటికడ్డంగా పెట్టుకొని దుఃఖాన్ని దిగమింగడానికి ప్రయత్నిస్తోంది

కమలకి మాధవరావు మాటలు అమృత

ప్రాయంలా తోచాయి ఇక ఒక్క క్షణం కూడా ఆలస్యంచేస్తే మళ్ళీ ఆయన మనసు మారిపోతుందేమోనని గబగబా బట్టలు సర్దసాగింది

పదండి వెళ్దాం అంది బర్తను బయలుదేర దీస్తూ

'కమలా యింత అర్జంటుగా ఎక్కడికి వెళ్దాం? నాన్న ఏదో కోపంతో అన్నారుగాని, తర్వాత ఆయనే మనల్ని పిలుస్తారు ఈమాత్రందానికి మనం అమ్మని, నాన్నని వదలి వెళ్ళిపోవడం భావ్యంగా లేదు

మీరెంత సిగ్గులేని మనుష్యులండి చీ అని చీదరించుకున్నా యింకా వాళ్ళ కాళ్ళదగ్గరే పడివుంటానంటారు అసలు మీకు అబిమానం, పౌరుషం అన్నవి లేనేలేవా? అంది కోపంగా

అదికాదు కమలా! మనం ఎక్కడ వుండాలో నిర్ణయించుకోకుండా ఎక్కడికెళ్తాం?

'అదా మీ సందేహం మా నాన్నగారి గెస్ట్‌హవుస్‌లో వుందాం మరేం ఫర్వాలేదు బయలుదేరండి అంది కమల

ఇక ఆమెకు చెప్పి ప్రయోజనం లేదని, కమలవెంట విజయ్ కూడా యిల్లు దాటాడు

అలా విడిపోయిన తర్వాత మళ్ళీ ఏనాడూ కలుసుకోలేదు ఇంతలో ఆయనకు ట్రాన్సుఫర్ అవడంతో ఆ వూరే మారిపోవలసివచ్చింది

*  *  *  *

ఆలోచనలో పడి బాహ్యప్రపంచాన్నె మరచిపోయింది ఆమె మనసంతా పశ్చాత్తాపంతో కుమిలిపోతుంది తను ఆనాడు అత్త, మామల్ని నిరాదరించబట్టే, తన కీనాడు ఈ గతిపట్టింది

అసలు తను ఆ రోజుల్లో ఏ నాడైనా తిరిగి ఆ యింటి గుమ్మం తొక్కిందా? కొడుకును చూడాలని కొండంత ఆపేక్షతో వచ్చిన ఆ తల్లిని నిర్దాక్షిణ్యంగా యింటి నుండి వెళ్ళగొట్టిందే ఆ పాపం వూరికే పోతుందా?

తమ వాళ్ళని ఎంత పరాభవించింది ఆఖరికి దొంగతనం కూడా అంటగట్టింది ఆరోజు నెక్లెస్ చీర మడతల్లోనే దొరకలేదూ! తనిప్పుడు ఏ ముఖం పెట్టుకొని వాళ్ళదగ్గరకి వెళ్తుంది?

తనని వాళ్ళు నిరాదరించినా, కనీసం తన కన్నీటితో వాళ్ళ కాళ్ళు కడిగి, తన పాపం ప్రక్షాళన చేసుకోవాలి అప్పుడుగాని తన మనసుకు శాంతిలేదు

ఆలోచిస్తూ కన్నీళ్ళు తుడుచుకొని, అత్తవారింటికి వెళ్ళడానికి ప్రయాణమయ్యింది

ఇంతలో పవన్ వచ్చాడు

'అమ్మా! బట్టలు సర్దుకుంటున్నావు ఎక్కడికి ప్రయాణం? అని అడిగాడు

"నేను ఎక్కడికిపోతే నీకెందుకురా? అయినా నువ్వే చెప్పావుగా నన్ను మీ బామ్మదగ్గరకి వెళ్ళిపొమ్మని అంది విసురుగా

అయితే నువ్విప్పుడు బామ్మ దగ్గరకి వెళ్తున్నావా? నేను, అలేఖ్యా మా ఫ్రెండు పెళ్ళికి వెళ్ళివస్తాం అప్పటివరకు ఆగరాదూ!

మీరెక్కడికివెళ్తే నా కెందుకు? నాదారిన నన్ను వెళ్ళనివ్వు

అదికాదమ్మా! అంతదూరం ఒక్కదానివే ఎలా వెళ్తావని? నేను వచ్చి, తీసికెళ్ళేంతవరకు ఆగరాదూ అయినా యిన్నాళ్ళు లేని ప్రేమ బామ్మమీద నీ కింత అర్జంటుగా పుట్టిందెందుకని?

ఎందుకో ఒకందుకు పుట్టింది ఇన్నాళ్ళకు నా కళ్ళు తెరచుకున్నాను ఇకనైనా నన్ను వెళ్ళనిస్తావా? నీ ప్రశ్నలతో టి చంపుతావా? అంది కోపంగా

సరేలేమ్మా! నీ కంత తొందరగావుంటే అలాగే వెళ్ళు నేను స్టేషన్‌లో దిగబెడతానులే అన్నాడు పవన్




కొడుకు స్టేషన్ వరకు రావడంతో, కమల మనసు కొంచెం తేలికపడింది

*  *  *  *

వీధి తలుపులు శబ్దం అవడంతో చేస్తున్న పని ఆపి లేచివెళ్ళి తలుపుతీసింది రాజేశ్వరి

ఎవరు! ఎవరుకావాలమ్మా? అంది తలుపు తీస్తూనే

అత్తయ్యా! నేనత్తయ్యా! మీ కోడల్ని అంది కమల

'కమలా! నువ్వా! అసలు పోల్చుకోలేకపోయాను ఎన్నాళ్ళయింది నిన్ను చూచి ఏమిటో ఈమధ్య నా చూపు కూడా మందగించింది' అంది నొచ్చుకుంటున్నట్లు

అత్తయ్యా! నన్ను క్షమించండి' అంది ఆమె పాదాలను తాకుతూ'

'అదేమిటమ్మా! యిప్పుడు నువ్వేం తప్పుచేశావు?

తల్లీ, బిడ్డల్ని విడదీసి, మహాపరాధమే చేసాను అంది వణికేగొంతుతో

లేమ్మా! లే! జరిగిపోయినదాని కిప్పుడు క్షమాపణలెందుకు? నువ్వు విడదీయడం కాదమ్మా! ఆ భగవంతుడే మన దగ్గరనుండి వాడిని తీసుకెళ్ళిపోయాడు అంది జీరబోయిన గొంతుతో

అత్తయ్యా! మామయ్య బాగున్నారా? అడిగింది కమల

ఏం బాగమ్మా అదుగో ఆ వెనక గదిలో రామకోటి రాసుకొని కూర్చుంటారెప్పుడూ ఎప్పుడు ఆ భగవంతుడి దగ్గరనుండి పిలుపువస్తుందా అని ఎదురుచూస్తున్నాం అంది రాజేశ్వరి

కమల త్వరత్వరగా ఆ గదిలోకి వెళ్ళి మామయ్య గారూ! అని పిలిచింది

అమ్మా! కమలా! నువ్వేనా వచ్చింది నేను కలగనడం లేదు కదా?

మామయ్యగారూ'' నా తప్పుల్ని మన్నించి, నాకు మీ పాదాల దగ్గర కొంత చోటివ్వండి ఈ వయసులో మిమ్మల్ని నా తల్లిదండ్రులు లాగ చూసుకుంటాను ఈ ఆఖరి క్షణాల్లోనైనా మీకు సేవ చేసే భాగ్యాన్ని కలిగించండి అంది దగ్గుత్తికతో!

ఏమిటమ్మా నేను చోటిచ్చేదేంటి ఇది నీ ఇల్లు నీ ఇంటికి రావడానికి నీకు స్వతంత్రం లేదా! చాన్నాళ్ళకు కనిపించావు కొడుకూ, కోడలూ బావున్నారా! అన్నాడు మాదవరావు

బావున్నారు మామయ్యా వాళ్ళకి నేనిప్పుడు విషమై పోయాను అంది బాదగా

ఏం కాదు లేమ్మా! అలేఖ్యా, పవన్ చాలా మంచివాళ్ళు

మామయ్యా! వాళ్ళ గురించి మీకు తెలియదు

తెలియక పోవడమేమిటమ్మా! అసలు అలేఖ్యా ఎవరనుకున్నావు?

వాడు ప్రేమించి రిజిష్టరు మేరేజ్ చేసుకున్న

# శ్రీ శారదాదేవి సరళహృదయం



శ్రీరామకృష్ణపరమహంస సతీమణి శారదాదేవి భక్తులందరికీ మాతృమూర్తి. పరమహంసకు కూడా ఆమెయందు దేవీ స్వరూపమే కానవచ్చేది. ఆమె శాంత, సరళ హృదయ. తన ఎడల ఆదరంలేని వారిని కూడా ఎంతో ఆప్యాయంతో చూచి, మనస్సును మంచి మార్గంలో పెట్టే శక్తి ఆమెకున్నది.

ఒకప్పుడు ఆమె కొన్ని రోజులు బలరామ్‌పూరులో ఉండినది శ్రీరామకృష్ణ, వివేకానందుల బోధనలచే ప్రభావితులై సన్యాసం తీసుకొన్న కొ ందరు ఆమె దర్శనం కోసం అక్కడికి వెళ్ళి కొద్ది రోజులు అక్కడే ఉన్నారు ఆమె అక్కడి నుండి జయరామవాటికి ప్రయాణమైనప్పుడు ఆమె దీవెనలు పొంది వీడ్కోలు చెప్పడానికి వారందరూ ఆమె చుట్టూ చేరారు. ఒకడు మాత్రం తన గదిలోనే కూర్చుండి కదలలేదు ఆమె వద్దకు ఎందుకు వెళ్ళలేదని ఒకరు ప్రశ్నించగా, అతడు నేను సర్వసంగ పరిత్యాగినైన సన్యాసిని నాకు తల్లిగాని, తండ్రిగాని ఉన్నట్లు అనుకోరాదు. మీకు మాతృమూర్తి అయిన ఆమె వద్దకు నేను వెళ్ళనక్కరలేదు" అని, తనయందు దాగివున్న అహంకారం ప్రోత్సహించగా- అన్నాడు.

ఈ సంగతి శారదాదేవికి తెలిసింది అతడు తన వద్దకు రావలెననే అభిమతం ఆమెకు లేదు కాని, అతనిలోని అహంభావాన్ని తొలగించాలనే సంకల్పం మాత్రం కలిగింది వెంటనే ఆమె అతని దగ్గరకు వచ్చి "నాయనా! నీకు తల్లి అక్కర్లేక పోవచ్చును. కాని నాకు మాత్రం పుత్రుడు కావాలి. పుత్రుడు అక్కరలేని తల్లి ఉండదు'. అని అన్నది. ఆ మాటతో అతనిలోని అహంభావం మాయ మయింది. అతడామెకు సాష్టాంగపడ్డాడు

మరొక సంఘటన. పరమహంస శిష్యుడు ఒకడు ప్రతి దినం తప్పక శారదాదేవి వద్దకు వచ్చి ఆమె సదుపదేశాలను విని ఆనందించేవాడు కొన్ని రోజులు ఇలాగే జరిగింది తర్వాత అతడు ఉన్నట్లుండి రావడం మానివేశాడు. "ఇక తెలుసుకోవలసినది లేదనే భావమో, అసంతృప్తియో అని మనసులో కలిగి ఉండాలి. కొద్ది రోజులు గడిచాక శ్రీ శారదాదేవియే అతని వద్దకు పోయి "నాయనా! నీవు రావడం మానివేశావు శ్రమపడి రావడం నీకు కష్టంగా వుంటే నేనే నీ వద్దకు వస్తానులే!" అని అన్నది ఆ మాతృమూర్తి యొక్క ఆప్యాయత అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది

మహనీయులెప్పుడూ సరళ హృదయులే! సామాన్యులవలె చంచల భావాలకు వారెప్పుడూ గురికారు చంచల స్వభావులను సరియైన మార్గంలో పెట్టడానికే వారు ప్రయత్నిస్తారు

— బులుసు వేంకటరమణయ్య

## కోడలూ ఒకనాటికి అత్తే!

పిల్ల అంతకుమించి నాకేం తెలుసు?

'అలేఖ్య ఎవరో కాదమ్మా! నీ ఆడబిడ్డ కూతురే' ఈ అమ్మమ్మని, తాతయ్యని ఇన్నాళ్ళు కంటికి రెప్పలా చూసుకుంది వాళ్ళేనమ్మా!

మామయ్యా!! మీరు చెప్పేది నిజమా! అంది సంతోషంగా!

నిజమేనమ్మా! అసలు ఈ నాటకం ఆడించింది అలేఖ్యే కాదూ! నిన్ను తిరిగి మా దగ్గరికి చేర్చాలని పవన్ ఎంత తాపత్రయపడ్డాడు అన్నట్లు ఈ రోజు వాళ్ళిద్దరూ వస్తామని టెలిగ్రాం కూడా ఇచ్చారు ఇంకా రాలేదేమిటా!! అని ఆలోచనలో పడిపోయాడు మాదవరావు

ఇంతలో ఏమండీ?? పవన్, అలేఖ్య వస్తున్నారండి అంది రాజేశ్వరి సంతోషంగా

ఇదేమీ అర్థం కానట్లు చూడసాగింది కమల

అమ్మా! నన్ను క్షమించమ్మా! నీ మనసు నొప్పించాను అన్నాడు పవన్ వస్తూనే

ఏమిటరా ఇది! నాకేం అర్థం కావడంలేదు

ఔనమ్మా! నువ్వు నన్ను చిన్నప్పటి నుండి, బామ్మ దగ్గరకి, తాతయ్య దగ్గరికి వెళ్ళనిచ్చేదానివి కాదు కానీ నాన్న మాత్రం నన్ను దొంగ చాటుగా తాతయ్య వాళ్ళ ఊరు తీసుకు వెళ్ళేవారు

నాన్నగారు చనిపోతూ బామ్మని, తాతయ్యని అనాదల్లాగ వదిలి వెయ్యవద్దని కన్నీరు పెట్టుకున్నారు వాళ్ళిద్దరిని మన ఇంటికి పిలవడానికి నువ్వు ఒప్పుకోవు అందుకనే అలేఖ్య, నేను కలిసి ఈ నాటకం ఆడాం '

అమ్మా! అలేఖ్యా' ఇదంతా నిజమేనా' అంది నమ్మలేనట్టు

నిజమేనత్తయ్యా అమ్మమ్మని, తాతయ్యని దూరం చేసుకోలేక ఈ నాటకం ఆడాం మీ మనసు నొప్పించినందుకు మన్నించండి అంది అలేఖ్య

చిన్నదానివైనా ఎంత పెద్ద మనసమ్మా నీది కోడలూ ఒక నాటికి అత్తే అవుతుందని తెలుసుకోలేక దురుసుగా ప్రవర్తించాను నాకు మీరిద్దరూ మంచి గుణపాఠమే చెప్పారు లోకంలో కోడళ్ళంతా నీలాంటి మంచి వాళ్ళే ఉంటే ఎంత బాగుంటుంది? అంది తృప్తిగా

ఆ దృశ్యాన్ని చూసిన మాధవరావు, రాజేశ్వరి కళ్ళలో ఆనందబాష్పాలు నిలిచాయి

ఇన్నాళ్ళకి అందరిని ఏకం చేసిన మనవరాలి వైపు అభినందన పూర్వకంగా చూసింది రాజేశ్వరి □

# మీదైన ఓ తియ్యని ప్రపంచం
# సంతూర్ అందులో ఓ మధురానందం

సంతూర్ అందిస్తోంది మనసుని మారగానే 'తియ్యని
రుచి దేశమంతటా జనప్రియం అయిన అద్భుత
పాన్ మసాలా

కావాలంటే పౌచ్‌లో లేదా డబ్బాలోంచి తీసుకోండి
ఇక ఇంటిల్లిపాదీ దీన్నే మళ్లీ మళ్లీ కావాలంటారు

Santoor
Meetha Pan Masala

**సంతూర్**
మీఠా పాన్ మసాలా

Govan/SMPM/1/88/TL

# చిన్నారి బాలల దీన గాథలు

"కాకి పిల్ల కాకికి ముద్దు' అన్నట్టు ఏ తల్లి కన్న బిడ్డ ఆ తల్లికి ముద్దు తన బిడ్డకు ఎటువంటి అవాంతరం వాటిల్లిన ఆ మాతృ హృదయం తల్లడిల్లి పోతూంది పేదింటి తల్లి ఆ పేదనే పెన్నిధిగా భావించి, తనకున్నంతలో ఆలనగా లాలపోసి, జోలపాడి మరీ నిద్రపుచ్చుతుంది ఆ లేత హృదయం పెరిగి పెద్దదయి ప్రతీ దానిలో, కరుణ దయా దాక్షణ్యాలకోసం వెతుకుతుంది తను కన్న కలలు లోపించి ఆ పేదరికమే వెన్నంటి అనుక్షణం భయపెదుతుంటే వెనుక ముందు ఆలోచించక ఎదురు తిరుగుతుంది

పసిపిల్లలు నైతికంగా దిగజారి పోవుటకు కారణం పేదరికం పేదరిక మంతటి భయంకర మైన వ్యాధి ఇంకొకటి ఉండదు ఈ తెగకు చెందిన బాలలు అధికశాతం బదుగు వర్గానికి, నిమ్న జాతికి చెందినవారే ఈ బాలలు దయనీయంగా అధికారులు దురహంకారానికి బలి అవుతున్నారు

మరల ధనిక వర్గానికి చెందిన బాలలు ఆయాల వద్ద పెరుగుతుంటారు వారికి పరిపూర్ణమైన తల్లిదండ్రుల ప్రేమాభిమానాలు పొందలేక అలమటించి పోతున్న తరుణంలో, ధనికుల బిడ్డలని గుర్తించి 'బ్లాక్ మెయిల్' పేరిట ఆ పసి బిడ్డలను నానా చిత్ర హింసలకు గురి చేసి వారి వలన డబ్బు గుంజు కుంటున్నారు కొంత మంది స్వార్థపరులు

అటు బదుగు వర్గానికి చెందిన బాలలకు ఇటు దనిక వర్గానికి చెందిన బాలలకు పరిపూర్ణమైన రక్షణ లేక విలవిల్లాడి పోతున్న భావి పౌరుల దుస్థితి ఎవరు మార్చగలరు?

స్త్రీ శిశు సంక్షేమాలు నెలకొల్పాము ఊరుఊరులో హాస్టల్స్ బాల్వాడీ సెంటర్లు వెలువరచాం సాధ్యమైనంత వరకు పేద పిల్లలకు అనేక అవకాశాలు కల్పించాం అంటూ ప్రభుత్వం ప్రక్కకు తప్పుకుంటుందే తప్ప ఆ సంక్షేమాలు నడిపే సంస్థలు ఎంత వరకు కరెక్టుగా బాధ్యత వహిస్తున్నవి అంటూ ఏ ప్రభుత్వం గుర్తించదు పరికించదు




అతిసున్నిత మైన పసి గుండెల్లో సూటిగా తగిలి ఈటి దెబ్బకు వాళ్ళలో ఉన్న మానవత్వం హరించుకుపోయి దానవత్వం చోటు చేసుకుంటుంది పెద్దలు చేసే రాక్షస ప్రవృత్తి వాళ్ల మనస్సులో చెరగని ముద్రగా మిగిలిపోతుంది వారు పెరిగి పెద్దవారై 'పెద్దతరం' అనబడే ఈ క్రూర వ్యవస్థని ధ్వంసం చేసే టెర్రరిస్టులుగా మారే అవకాశముంది

ఈ విపత్కర పరిణామానికి




కారణం వెట్టి చాకిరీ చేయించుకున్న పెద్దతరం, అన్యాయంగా అమానుషంగా పసిపిల్లలను సొంత అవసరాలకు వినియోగించుకుని యంత్రాల్లా గుర్తించకండి, కాస్తంత ఏ మూలనో దాగిఉన్న మానవత్వాన్ని బయటకీడ్చి పసిబాలల యెడల జాలి, దయ, క్షమ, కలిగి ఉండండి, వెట్టి చాకిరీకి తగిన ఫలితానిచ్చి ఆ లేత కళ్ళల్లో కాంతిని చూడండి "పెద్దలు మారాలి" అనే నినాదాన్ని లేవదీయకముందే, పెద్దలు పిల్లల భవిష్యత్తుకి తగిన ప్రోత్సాహాన్ని కల్పించి చేయూత నివ్వండి భావి పౌరులుగా ఘనత కెక్కక పోయిన కనీసం వ్యక్తిత్వంతో తన బ్రతుకును తాను చక్కదిద్దుకొనే నైతిక బలాన్ని పెంపొందించండి దయచేసి పెద్దలు కాస్త కాఠిన్యం తొలగించి పసి పాపల యెడల కరుణ చూపండి పెద్దలు మారినప్పుడే చిన్నారి బాలలు దీనగాథలు ఇలలో కనిపించవు వినిపించవు

—జమ్మాన రాజేశ్వరి,
విజయనగరం

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

సంతకం

సీరియల్

# ఆడపిల్లలు - అనుభవాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## ఆడపిల్లలకు పెళ్ళి అవసరమా?

'కలిమిలేముల పార్టీ' తరఫున అయిదారు చోట్ల సభలు జరిపాడు జగదీష్ పార్టీ ధ్యేయాలనూ, చేయ తలపెట్టిన సేవా కార్యక్రమాల్ని గురించీ అనర్గళంగా ఉపన్యసించాడు

"సోదర సోదరీమణులారా! నేను మహిమాన్వితుడినీ, గారడీ చేసి చూపించే వాడినీ, రాజకీయపు రంగు పూసుకున్నవాడినీ కాదు నేను యూనివర్సిటీలో ఎం కామ్ చదువుకున్నానని చాలామందికి తెలుసు ఫస్టు క్లాసులో పాసయానని సగర్వంగా చెప్పటంలేదు సేవా కార్యక్రమాలే నా జీవిత ధ్యేయం అని నిగర్విగా చెపుతున్నాను "దర్మమేవ సదా మూలం, దర్మమేవ మహాగుణం" అంటే దర్మమే సమస్తమునకూ మూలం ఈ దర్మానికి ప్రదానమైన అంగము నీతి మానవుడి పరిపూర్ణమయిన నడతయే నీతి ఈ నీతి అనేదే మానవుడిని ఉన్నత స్థాయికి తీసుకొని పోతుంది ఇటువంటి నీతి కలిగిన జాతే నిజమైన జాతి క్రమబద్ధమైన సన్మార్గాన జీవించేవారికి ధార్మిక గుణం కూడా అబ్బుతుంది

దేవాలయంలో దేవుడికి ఏదో చెప్పుకొని కొబ్బరికాయ కొడతాము పూజారి నైవేద్యం పెట్టి హారతి ఇస్తాడు హారతి కళ్ళకు అద్దుకుని ఆ పూజారి ఇచ్చిన ఒక కొబ్బరి చిప్ప తీసుకుని శరగోపురం పెట్టించుకొని కానుక వేసి వస్తాము దేవుడు పలకడు, కదలడు, కళ్ళు విప్పి చూడడు కాని ఆ రాతి విగ్రహంలో ఒక అంతర్లీనమైన శక్తి ఉన్నదని మన బావన ఈ కంటికి కనిపించని శక్తి మనల్ని కరుణించి, కాపాడుతుందని మన నమ్మకం, మానసిక తృప్తి ఆ దేవుని విగ్రహానికీ, మనకూ మద్య లింకులాంటి సాక్షీభూతుడు పూజారి ఈ పూజారినీ, మననీ అనుసందానపరిచేది కొబ్బరికాయ, కర్పూరం, కానుక, శరగోపురం దీనికంతకూ కారణం మానవుడి మనస్తత్వం ఈ మనస్తత్వం ఒక్కొక్కరకూ ఒక్కో రకంగా ఉంటుంది ఇటువంటి సిద్ధాంతానికి సంబంధించినదే దార్మిక బుద్ధి పూర్వకాలంలో కొన్ని వందల సంవత్సరాలకి ముందు, రాజులూ రాజ్యాలూ ఉన్న కాలంలో దర్మం నాలుగు పాదాలా నడుస్తుందనే వారు ఈనాటి ధర్మానికి ఎన్ని పాదాలున్నయ్యో తెలియదు కాని చాలామంది దానదర్మాలు చేస్తూనే ఉన్నారు గుడీ, గోపురం, సత్రం, కల్యాణమంటపం, వేదిక, నాటకశాల కర్మల షెడ్డు ఇవన్నీ కూడా శాశ్వతమయిన దానధర్మాలు ఈ దానదర్మాలకు అనుసందానమైనదే సేవ మానవసేవే మాదవ సేవ అన్నారు గాని, దార్మిక సేవే మాదవ సేవ అనలేదు చారిటీ అంటే దాతృత్వాన్ని వ్యక్తం చేసి ఇచ్చే డబ్బు ఈ దాత ఇచ్చిన డబ్బుతో ఆ సంస్థల కార్యనిర్వాహకులు చేసే సేవా కార్యక్రమాలే సామాన్య మానవుడికి చేరేది, తెలిసేది కనుకనే గుడి, కొబ్బరికాయ, పూజారికన్న మాదవుడికి ప్రీతిపాత్రమైనది మానవసేవ వికలాంగులకి సేవ చేసినా, దరిద్రనారాయణులకు అన్నం పెట్టినా, గ్రామాలకు కావలసిన సౌకర్యాలను చేపట్టినా అది మానవసేవే అవుతుంది కావలసింది ముఖ్యంగా సంఘ ప్రయోజనమే కాని ఒక్క వ్యక్తి ప్రయోజనం కాదు, ఈ సేవా కార్యక్రమాలు చేపట్టటానికి మా పార్టీ ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది కావాల్సింది దాతలూ- దాతృత్వం సేవా కార్యక్రమాల్లో అబిమానం, నమ్మకం, ఇష్టత ఉన్న దాతలు మా పార్టీకి విరాళాలు ఇచ్చి మేము చేసే కార్యక్రమాలకు వెన్నెముకలా నిలవాలని ఆశిస్తూ, ప్రార్ధిస్తూ, అందర్నీ అర్ధిస్తున్నాను విరాళాలకు వెంటనే రశీదులు కూడా ఇస్తాము" అని అందర్నీ అర్ధించాడు జగదీష్

ఇళ్ళకు వెళ్ళి విరాళాలు వసూలు చేశారు సభల్లో వసూలు చేశారు కరపత్రాలు పంచి పెట్టారు పదిహేను రోజుల్లో దాదాపుగా ముప్ఫై వేలు వసూలయింది రశీదు పుస్తకాలూ, జమా కర్చు పుస్తకాలూ బ్యాంకు ఎకౌంట్ అన్నీ ఏర్పాటు చేసుకున్నారు పార్టీ అద్యక్షుడు జగదీష్, సెక్రెటరీ శార్వాణి మహిళా విబాగం కన్వీనర్ కూడా శార్వాణి ఆ రోజున ఆ గ్రామానికి బస్ షెల్టర్ కట్టి ఇచ్చిన తర్వాత ఈ సంస్థయందు కాస్త నమ్మకం కలిగింది కొందరికి

* * * * *

ఒక రోజు సాయంత్రం ఆరు గంటలకు సావిత్రి పర్ణశాలకు వచ్చింది జగదీష్ చేపట్టిన ఈ కార్యక్రమాలు వినటమే తప్ప సావిత్రి ఇక్కడికి రావడం ఇదే ప్రథమం

"నమస్కారం మేడమ్ బహుకాల దర్శనం కూర్చోండి ఆఫీసుకు వెళుతున్నారా? విశేషాలు' ప్రశ్నించాడు జగదీష్ సమాదానాలు చెప్పింది పక్కన శార్వాణి ఉన్నది సందేహిస్తూ కూర్చున్నది అతని వైపు చూస్తూ

"చూడండి సావిత్రిగారూ శార్వాణి నా సహోదరి లాంటిది ఈ సంస్థకు సెక్రటరీ మా పర్ణశాలకు వచ్చి మాతో మాట్లాడుతున్నారంటే పర్సనల్ ప్రాబ్లమ్స్ అయినా మేం ఇద్దరం వినక తప్పదు అందులో లేడీస్ ప్రాబ్లమ్స్ సాల్వ్ చేయటంలో శార్వాణి సమర్ధురాలు చెప్పండి, విని చక్కని సలహా ఇస్తుంది" అన్నాడు

"చెప్పండి, ప్లీజ్, ఇక్కడ సంశయాలకూ, అనుమానాలకూ తావులేదు" అన్నది శార్వాణి

"గంజాయి వనంలో తులసి ఆకులా మా ఇంట్లో చదువుకున్నదాన్ని, చిన్న ఉద్యోగం చేస్తున్న దాన్నీ నేనొక్కదాన్నే పాలు పితికే వారికి పేడ వాసన అలవాటయినట్లు, ఎంత చదువుకున్న దాన్నయినా ఆ వాతావరణమే నాకూ అలవాటయింది మా ఇంటి పరిస్థితీ, మా అమ్మనాన్నల మాట, మనస్తత్వం జగదీష్‌గారికి తెలుసు ఏదో కొద్దిపాటి ఉద్యోగం చేస్తూ చదువుకున్న వాళ్ళ మద్య తిరగనేర్చిన నేను, ఇంటి వాతావరణాన్ని బట్టి ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ పెంపొందిస్తూ నాకు తెలీకుండానే మనస్సులో అర్ధంలేని బయాన్ని నింపుకున్నాను" అన్నది సావిత్రి

జరిగిన కథ - 12 జగదీష్ పార్టీ తరఫున గ్రామీణ సేవా కార్యక్రమాలు ప్రారంబిస్తాడు జగదీష్‌ను అవమానించ బోయిన అబిలాష్ శార్వాణి చేతిలో అపమానానికి గురవుతాడు విమల వింత ప్రవర్తనకు షాక్ తింటుంది శ్రీవిద్య జగదీష్‌ను గురించి హేళనగా మాట్లాడిన అబిలాష్‌కు ఆమె సరైన సమాదానం చెపుతుంది శ్రీవిద్య తల్లితో కూడా విమల ఇల్లు విడిచి వచ్చి వాసూ రుక్మిణీల ఇంట్లో ఒక గదిలో చేరింది శ్రీవిద్య తన ఎకౌంటులో ఎ ఎ బి బి సి సి డి డి హేమంత్ అనే ఆయన పాతిక వేల రూపాయలు జమ కట్టబడి ఉండటం గమనించి అతను తమ వాలేరని బ్యాంక్ వారికి చెప్తుంది

కొంచెం అర్థం చేసుకున్నది శర్వాణి

"భయం అనేది చిన్నపిల్లలకు ప్రవృత్తికి సంబంధించిన లక్షణం, కాని మీలాంటి వారూ భయపడుతున్నారంటే, కారణం అనేక విధాలుగా ఉంటుంది మీ ఇంటి వాతావరణాన్ని బట్టి, మీరు కోరుకున్న భర్త లభిస్తాడా లేదా అనేది ఒక కారణం ఆ వరుడు కట్నం లేకుండా ఇష్టపడతాడా అనేది రెండో అనుమానం ఉద్యోగరీత్యా మీరేదయినా టీజింగ్‌కు గురవుతున్నారా అనేది మూడో పాయింట్, అవునా" అన్నది శర్వాణి

క్షణం ఆలోచించింది సావిత్రి మాట్లాడకుండా కూర్చున్నాడు జగదీష్

"మీరు చెప్పిన మూడు కారణాలు కరెక్ట్ మా ఇంటి వాతావరణం చూసి ఏ చదువుకున్నవాడూ ఎంత కట్నం ఇచ్చినా రాడు రెండోది అంత కట్నం ఇచ్చే స్తోమతా మాకు లేదు కాబట్టి చదువుకున్నవాడు, ఉద్యోగం చేసుకొనేవాడూ, అందమయినవాడూ నాకు భర్తగా రావటానికి ఎవ్వరూ సాహసించరు ఇక ప్రేమించటం, నా అందానికి మార్కులు వేస్తే హయ్యర్ సెకెండ్ క్లాస్ వస్తుంది గాని, ఫస్టు క్లాస్ రాకపోవచ్చు ఆడపిల్ల సర్వాంగ సుందరంగా, చూడముచ్చట పడేటట్టు ఉండాలంటే అది డబ్బును మించిన అదృష్టం నన్ను ప్రేమించే వాడు నాలో ఏం చూసి ప్రేమిస్తాడు అని నాలో నేనే ప్రశ్నించుకుంటే, నాలో అన్నీ సమపాళ్ళలో ఉన్నయ్యనే సంతృప్తి నాకున్నది కాని ఇంటి వాతావరణం, "ఏమోయ్ అల్లుడూ, అమ్మాయి సదూకున్నది, పూత రేకు నాగ నవనవలాడతా ఉన్నది, కూడొండుద్ది, ఉద్యోగం సేత్తది బుద్ధి పాల మీగడ, మనసు ఎన్నపూస, దాని సిగ దరగ కట్నం, సూడల్లుడూ కట్నం అడిగితే మక్కెలిరగ దన్ని బొక్కలో దోయించేత్తా, ఏటనుకున్నావో, సింహాద్రి అప్పన్న తోడు, కనకమాలచ్చి తోడు, నా సాయిత్తిరికి, నంజికాన ఏసాలంటే గిట్టగ, బుగబుగలాడి బగ్గుమంటది అని మా నాన్న- "ఒల్లకోయ్, నీ జిమ్మడ, వొంటి పిల్లి రాకాసి ఏసాలెయ్యకు, నాన పాలలో నీల్లు కలిపినా, వంద పిడకలూ అయిదు కమ్మినా, నా సాయిత్తిరి వొం మీద నల్లి కూడ ఎప్పుడూ పాకనేదు దాని సదువేటో దాని మాటేటో, దా బుద్దేటో కన్నతల్లికి నాకు తెల్దేటి నాలుగ్గేదల్నీ అమ్మేసి ఆ వొచ్చి నల్లుడ మొఖాన పారెత్తా, దాందంతా సినిమా సాయిత్తిరి పోలికే అట్టాగిట్టాంటి వాడి తెచ్చినావో, పేడ నీల్లు సల్లి పూర్ణామారికెట్టులో పూసలమ్మకోరాద ముండాకొడుకా అంట, నా సంగతి ఎరగవా మొగుడా అని మా అమ్మ ఈ వాతావరణంలో నన్ను ఎవరుమటుకు ప్రేమించి పెళ్ళి చేసుకుంటారో చెప్పండి అన్నది సావిత్రి ఆ మాటలకు నవ్వి సావిత్రి వైపు చూస్తూ కూర్చుంది శర్వాణి

"నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను, కావాల్సింది సమాధానాలు కాద మనస్ఫూర్తిగా ఇష్టపడి, బాగా నిర్ణయం చేసుకొని చెప్పాల్సిన అభిప్రాయాలు అన్నది

"అడగండి"



# రచయిత జవాబులు



ప్రఖ్యాత రచయిత శ్రీ హరికిషన్ తమ సీరియల్ నవల "ఆడపిల్లలు - అనుభవాలు"పై పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు యిస్తారు. ఈ అవకాశాన్ని వినియోగించుకో దలచినవారు తమ ప్రశ్నలని "రచయిత జవాబులు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ- 520003 అనే చిరునామాకి పంపవచ్చును. వాటిలో రచయిత ఎంపిక చేసిన ప్రశ్నలని, వాటికి ఆయన యిచ్చే సమాధానాలని వారం వారం ఈ సీరియల్ పేజీలలో ప్రచురిస్తాము. ప్రతివారం రచయిత ఉత్తమంగా ఎంపిక చేసిన ప్రశ్నని పంపిన వారికి ఆయన రాసిన నవలలలో ఒక దానిని బహుమతిగా అంద జేయటం జరుగుతుంది. పాఠకులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరని ఆశిస్తున్నాము.

—సం

## ఆడపిల్లలు- అనుభవాలు

"ఆడపిల్లకి చదువు అవసరమా కాదా అనే ప్రశ్న యాభై ఏళ్ళకు పూర్వం వేసే ప్రశ్న అదిప్పుడు ఎట్టి పరిస్థితిలోనూ వెయ్యాల్సిన ప్రశ్న కాదు అందరూ చదువుకుంటున్న వాళ్ళే. అటువంటిదే ఇప్పుడు వేయాల్సిన ప్రశ్న- ఆడపిల్లకి, అందులోనూ విద్యావంతురాలయిన ఆడపిల్లకి పెళ్ళి అవసరమా? ఉద్యోగం, పెళ్ళి ఈ రెంటిలో జీవితానికి, జీవించటానికి కావల్సింది ఏది? ఈ ఒక్క ప్రశ్నకూ వారం రోజుల్లో మీ అభిప్రాయం చెప్పండి నా సలహా నేను చెప్తాను" అన్నది శార్వాణి

"మీ ఉద్దేశ్యం జగదీష్‌గారూ" అతని వైపు చూస్తూ అడిగింది

"ప్రశ్న ఆడపిల్లకు సంబంధించింది, నేను మగవాడిని, మగవాడికి కావాల్సింది ఉద్యోగం లేక వ్యాపారం అంటే సంపాదన పెళ్ళి అక్కర్లేదు" స్పష్టంగా చెప్పాడు ఒక్కసారి ఫ్యూజ్ పోయి చీకటి గాఢాంధకారమైన ఇల్లులా అయింది సావిత్రి మనస్సు

వీళ్ళిద్దరూ తనను అమాయకురాలుగా అర్థం చేసుకొని ఆట పట్టిస్తున్నారా? తను చదువుకున్నదయినా ఇంటి వాతావరణాన్ని బట్టి సంస్కార భావాలు గల కుటుంబం కాకపోవటంతో తనలో ఏదయినా పిరికితనం, భయం చోటు చేసుకున్నదా? మూగబోయిన మనస్సుతో మూడు నిమిషాలు మౌనంగా కూర్చున్నది

"పెళ్ళి అవసరమే అనుకుంటాను వారం రోజుల్లో నా నిర్ణయాన్ని మీకు చెప్తాను" అని వెళ్ళింది సావిత్రి

* * * * *

మర్నాడు సాయంత్రం సత్యభామ ఇంటికి వెళ్ళింది. ఒక్కతే కూర్చుని ఓ ఇంగ్లీషు నవల చదువుకుంటున్నది టీపాయ్ మీద ద్రాక్షపళ్ళు, యాపిల్ ముక్కలూ, మరో ప్లేట్లో సాల్ట్, క్రీం బిస్కట్లు ఉన్నయ్యి. ఒక్కో ముక్క కాస్త కాస్త కాలక్షేపంగా తింటూ నవల చదువుతున్నది రేడియోలో లలిత సంగీతం వినిపిస్తున్నది

"యువర్ ఎటెంషన్ ప్లీజ్" అన్నది సావిత్రి ఇటు తిరిగి చూసింది నిలువెల్లా మరోసారి చూసింది తనువెల్లా పులకరించి పోయింది. పుస్తకం మూసి, విప్పారిత నేత్రాలతో నవ్వు ముఖంతో చూసింది

"శోభన పెళ్ళికూతురిలా ఉన్నావ్ పెళ్ళెప్పుడయిందే అందాల సుందరీ" అన్నది చెంపకు చెయ్యి ఆనించుకుని అలవోకగా చూస్తూ. మౌనంగా కూర్చుంది సావిత్రి బిస్కట్లు, ద్రాక్షపళ్ళు తీసుకోమన్నది సత్యభామ

"బ్యూటీ కంటెస్ట్‌లో ఎన్నికయిన మిస్. వైజాగ్‌లా ఉన్నావ్, ఏమిటి విశేషం? పెళ్ళి సందడా? ఆ అదృష్టవంతుడు ఎవరు సావిత్రీ?"

"వేషం కట్టగానే నాట్యం వచ్చినట్లు కాదు పెళ్ళికూతురు పోస్టుకు కావాల్సిన అర్హతలు నాలో ఉన్నట్లేనా" అన్నది సావిత్రి

బుర్ర ఖరాబు చేసుకుని మనశ్శాంతి కోసం వేషం కట్టిందని ఊహించింది సత్యభామ

"ఎస్ ప్లీజ్"

"ఎట్లా చెప్పగలిగావు"

"నడకలో నాజూకుతనాన్ని నింపుకున్న అందం కనిపిస్తుంది ముఖంలో ముగ్ధమోహన సౌందర్యంతో పాటు ఆకాంక్ష కనిపిస్తున్నది దాచుకున్న బుల్లి బుల్లి సీక్రెట్స్ యౌవ్వన శోయగాల్ని సంతరించుకొని స్పర్శ కోసం తహతహలాడుతున్నయ్యి ఇంకామరి కాస్త కిందికి వెళితే ఆ బొడ్డు కింద. ."

"నీ కవిత్వం ఆపు, నావి సీక్రెట్స్ అయితే నీవి టాప్ సీక్రెట్స్, వర్ణన ఆపి అసలు సమస్య విను ఆడపిల్లకు పెళ్ళి అవసరమా,, నీ వ్యక్తిగత, మానసిక, శారీరక అవసరాన్ని బట్టి, అభిప్రాయ వేదికగా కాకుండా సాంప్రదాయాల జోలికి పోక నిత్యావసర పంథాలో ఆలోచించి అభిప్రాయం చెప్పాలి ఆడపిల్లకు పెళ్ళి అవసరమా?"

ఇంట్లోకి వెళ్ళింది సత్యభామ అయిదు నిమిషాల తరవాత వచ్చింది

"ఏం చేశావ్" అడిగింది సావిత్రి

"జపం చేశాను"

"జపమా, రుద్రాక్షలూ, కుంకం, వీభూది. "





# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

సమరేశ్‌బోస్ ప్రఖ్యాత బెంగాలీ నవలా రచయిత. బోస్ "ప్రజాపతి" అనే నవల రాశారు. "దేశ్" అనే బెంగాలి పూజా సంచికలో ఈ నవలను ప్రచురించారు. ఈ పత్రికకు బాగా సర్క్యులేషన్ వున్నది. 1968 ఫిబ్రవరి 2వ తేదీన అమల్‌మిత్ర (న్యాయవాది) "ప్రజాపతి" నవల అసభ్యకరంగా వున్నదని కలకత్తా ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ కోర్టులో పిటిషన్ పెట్టాడు. భారత శిక్షాస్మృతి లోని 109, 292 సెక్షన్ల క్రింద నేరం చేసినందున రచయితను, ప్రింటర్, పబ్లిషర్‌ను శిక్షించవలెనని కంప్లయింట్‌లో కోరాడు. ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ నవలా రచయిత సమరేశ్‌బోస్‌ను, ప్రింటర్, పబ్లిషర్ సీతాంశుకుమార్‌దాస్ గుప్తాను నేరం చేసినట్లుగా తీర్పు చెప్తూ ఒక్కొక్కరు 201 రూపాయలు జరిమానా చెల్లించవలెనని ఆదేశాలు జారీ చేశారు. 174 నుండి 226 వరకు వున్న పేజీలు కూడా నాశనం చెయ్యాలని క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 521 సెక్షన్ క్రింద ఆదేశాలు జారీ చేశారు. ఈ తీర్పు మీద నిందితులు హైకోర్టుకు అప్పీలు చేసుకున్నారు. హైకోర్టువారు అప్పీలు 1972లో డిస్మిస్ చేస్తూ అన్ని కాపీలలోని పేజీలు నాశనం చెయ్యాలని ఈ రచన నవల క్రింద ప్రచురించబడినందున ఆ నవలలు కూడా స్వాధీనం చేసుకొనాలని తీర్పు చెప్పారు. ఈ తీర్పుపై నిందితులు సుప్రీమ్ కోర్టుకు అప్పీలు చేసుకున్నారు. సుప్రీమ్‌కోర్టు వారు తమ తీర్పులో అసభ్యత గురించి విచారించినప్పుడు జడ్జి కూడా ఒక రచయితగా భావించుకొని రచయిత ఏమి చెప్పదలచుకొన్నాడో తెలుసుకొనాలి అన్నారు.




తర్వాత జడ్జి పాఠకునిగా భావించి ఆ పుస్తకం వివిధ వయస్సుల గల పాఠకులు చదివి వారి మనస్సులలో ఎలాంటి అభిప్రాయం ఏర్పరచుకుంటారో భావించాలి. అప్పుడు జడ్జి నిష్పక్షపాతంగా ఆ పుస్తకం మొత్తం మీద అసభ్యకరంగా వున్నదా లేదా కొన్ని భాగాలు అసభ్యకరంగా వున్నవా, సెక్షన్ 292 ప్రకారంగా అసభ్యకరంగా వున్నదా లేదా అని నిర్ణయించాలి అని సుప్రీమ్ కోర్టువారు అభిప్రాయపడ్డారు. సుప్రీమ్‌కోర్టు వారు ఇంకా తమ తీర్పులో కొందరు ప్రఖ్యాత రచయితల అభిప్రాయాలు కూడా ఆపుస్తకం గురించి తెలుసుకోవచ్చునని అన్నారు. ఒక ప్రఖ్యాత రచయిత తన నవలలో సంఘంలో జరుగుతున్న దురాచారాలు తెలియజేయడానికి కొన్ని అసభ్యకరమయిన సంప్రదాయ పదాలు వాడినప్పుడు సెక్సుకు ప్రాధాన్యత ఇచ్చి యువతుల శరీరంలో అంగములు వర్ణిస్తూ, సెక్సులో వారి భావాలు, చర్యలు వర్ణించినప్పుడు అసభ్యకరంగా వున్నదని అనడానికి వీలులేదు అని సుప్రీమ్ కోర్టు వారు తీర్పు ఇచ్చారు. ఈ రచయిత అన్ని తరగతుల పాఠకుల కోసం రాశారు. గనుక ఈ నవల అసభ్యకరంగా వున్నదని భావించరాదని సుప్రీమ్‌కోర్టు వారు 1985లో తీర్పు చెప్తూ క్రింది కోర్టుల తీర్పులను కొట్టి వేశారు. అప్పీలును అనుమతించారు. □

---

"మానసిక జపం, యౌవ్వన భారాల్ని కంట్రోల్ చేసుకొని, శారీరక వాంఛల్ని అదుపులో పెట్టుకొని, నైతిక బాధ్యతని ఆలంబన చేసుకొని, ధృఢమైన వైఖరిని అవలంబించి మొగుడెందుకు? అవసరంలేదు. దాంపత్య జీవితం ఈజె లగ్జరీ, అనే భావాల్ని వదిలపర్చుకుంటే ఆడపిల్లకు పెళ్ళి అక్కర్లేదు. కాని బతకటానికి డబ్బు కావాలి. సెక్సాకలిని చంపుకోగలిగినా, పొట్టాకల్ని చంపుకోలేం" అన్నది సత్యభామ.

"చాలా పెద్ద కాంప్లెక్స్ సెంటిన్స్. జపం అన్నావ్, నువ్వు జపం చేస్తున్నావా, స్తోత్రం చదువుతున్నావా"

"ఎస్, చదువుతాను విను, శ్రీకరంబయినట్టి, సద్వంశమున బుట్టి, సర్వాంగ సుందరముగ పెరిగితిన్, చదివితిన్, అవయవాల పొందికకు ఆదిగురువైనట్టి, యౌవ్వనజాక్షి నీకు చేతులెత్తి మ్రొక్కెదన్, నికముగ నను బ్రోచి నన్నెవరు కామించకుండు కాపాడుటే కాదు, సెక్సు పుస్తకాలు చదివినా, పూర్తి నగ్నపు బ్లూ ఫిలిం చూసినా, నాలోన కోరికల్ కలగకుండ కాపాడు తల్లీ, బ్లూ సెక్సు, బ్రాసెక్సు, టీనేజి పొంకాల సెక్సు, ఉత్తరాల సెక్సు, సమాధానాల సెక్సు, గుడి మీద బొమ్మల సెక్సు, వాల్ పోస్టర్ల సెక్సు, సినిమా బ్యానర్ల సెక్సు, సర్వ సెక్సులకెల్ల సెక్సురాణివయినట్టి సుకుమార, నవయౌవ్వన కామప్రదాయినీ, నా వైపు చూడకే. నా చెంత చేరకే. నా మనసులో నా గుండెలో సర్వ యౌవ్వన చిద్విలాసాలు చిందించక, ఓ దిగంబర చిద్విలాస సెక్సాంబర దేవతా నను కాపాడవమ్మా"– అని లయబద్ధంగా స్తోత్రం చదివింది సత్యభామ.

నవ్వాపుకోలేక పొట్ట చేత్తో పుచ్చుకొని పకపకా నవ్వింది సావిత్రి.

"బాగుంది. జపం అన్నావ్"

"నూట ఎనిమిది సార్లు ఈ ఏకాదశాక్షరీ మంత్రాన్ని జపిస్తే సెక్స్ వాంఛ సిక్స్ కిలో మీటర్లు పారిపోతుంది. ఓం నమో కామ నాశనాయనమః, ఓం నమో కామ దహనాయనమః, ఓం నమో సెక్సు నాశనాయనమః, ఓం నమో వాంఛ నాశనాయనమః, ఇట్లా ఈ మంత్రం జపిస్తే అసలు ఆ కోరికే ఉండదు" అన్నది సత్యభామ బింకంగా చూస్తూ.

సత్యభామ వైపు చెంపకు చారడేసి కళ్ళు పెట్టుకుని అయిదు నిమిషాలు చూసింది సావిత్రి.

"ఇంతకీ నువ్వసలు ప్రతి నెలా మెన్సెస్ అవుతున్నావా" అదో మాదిరి అనుమానంతో అడిగింది సావిత్రి.

"మెన్సెస్, ఓ ఎస్. త్రయోదశ వర్ష ప్రాయంలో నే శ్రీకారం చుట్టేను".

"జపం, స్తోత్రంతో నీలోని స్త్రీత్వపు భావాలు పారిపోయినయ్యా".

"లేదు. కోరికలు కోరి కోరి తల ఎత్తినయ్యి. కాని మనిషికి కావల్సింది అనుగ్రహపు ఆరాటం కాదు, నిగ్రహ శక్తి" అన్నది సత్యభామ.

ఏదో అడగబోయి ఏమీ అడగలేక వెళ్ళిపోయింది సావిత్రి.

(ఇంకా ఉంది)







TOP STAR
TEA
Lipton
TOP STAR
TEA




రెసిడెన్షియల్ స్కూల్సు నుంచి రెసిడెన్షియల్ కాలేజీలు వెలిశాయి పిల్లలు అతి గారాబం వల్లనో మూర్ఖత్వం, మొండితనం పుట్టుక ద్వారా సంక్రమించటం వలనో సమస్యక్రింద తయారవుతారు నయాన చెప్పినా వినక భయాన చెప్పినా లొంగని ఘటాలుంటారు వీళ్ళని ఆశ్రమ పాఠశాలలో పడేస్తే సరి అనుకొనేవారు అయితే యిందులో ప్రభుత్వం నడిపేవి కేవలం మెరిటు స్టూడెంట్సుకు, ఎంట్రన్సులో రాంకుహోల్డర్సుకే పరిమితి

ప్రయివేటు వ్యక్తుల ఆద్వర్యంలో గురుకులవాస పద్ధతిలో కొనసాగే ఈ రెసిడెన్షియల్ కళాశాలలు గత కొద్ది సంవత్సరాలలోనే పేరుగడించాయి అసలు కుటుంబనియంత్రణ దర్మమా అని ఉన్నసంతానం తక్కువ ఆ వున్నవారిని కూడా వీటిలో పడేయటం చోద్యంగా వుందంటూ వాపోతారు సత్యకాలం మనుషులు

పిల్లలకి ఎందుకు అవసరం అని చూస్తే బోల్డు కారణాలు దొరుకుతాయి వాళ్ళపై జాలి కూడా పుట్టుకొస్తుంది వీటిని నిర్వహించేవారికి అసలు తలనొప్పి పదవ తరగతి పాసయి దూకుడుగా కాలేజీలో ప్రవేశించి మురిసిపోతారు పిల్లలు వాళ్ళని క్రమబద్ధమైన జీవితానికి పరిమితంచేసే ఓ పరిధిలో పెట్టటమే ఈ గురుకులవాస మంటే!

ముందు కాలేజీ పిల్లలు ఎదుర్కొనే సమస్య సీటు రిజర్వేషనులు ఆదిగాగల అట్టహాసాలతో గవర్నమెంటు కాలేజీలలో సీట్లు గగన కుసుమాలుగా మారాయి తరువాత డొనేషన్లు ఈ డొనేషన్లతో నడపబడే కాలేజీలను కేవలం దుయ్యపట్టితే సరికాదు వీటిలో చక్కని ఉపాధ్యాయులు లేక లెక్చరర్లున్నారు స్కూలుకి పాసయినవారి శాతం పెంచటంకోసం వీరు ఎగ్స్ట్రా క్లాసులు తిసుకుని చెప్తారు వీటివల్ల డబ్బు నష్టమేగానీ పిల్లలు బాగుపడడం హెచ్చు శాతంలోనే వుంది

విద్య విషయంలో వీరికొచ్చే మార్కులు సంతృప్తికరంగా వున్నా, స్వయంగా ఆలోచించడం, రాయడం, నిదానం ఒద్దిక, పెద్దల ఎడ వినయం వీటిలో వెనకబడేవుంటారు. వీరికి యిరవై నాలుగు గంటలూ కల్వంలో వేసి నూరిన మందులా చదువు నూరిపోసే టీచర్లు కావాలి నాడూ నేడూ కూడా ఉపాద్యాయుల పరిస్థితి పెరగలేదు వెనకటికి గురువుపట్ల భయభక్తులుండేవి అప్పుడు చదువు నమ్ముకొనే యంత్రంలా పరిగణింపబడుతున్నారు

యంత్రాన్ని పాడయితే ఓ మూల విసిరేసినట్లు, చదువు చెప్పడం పూర్తవగానే తీసిపడేస్తున్నారు ఇంట తల్లి తండ్రులను అదేవిధంగా లెక్క చెయ్యటంలేదు అందుకే తలతాకట్టుపెట్టయినా ఈ స్కూళ్ళకు తరుముతున్నారు అయితే యింటో ఎలా లొంగటంలేదు అనుకుంటే బోల్డు సమాధానాలు దొరుకుతున్నాయి

మొదటిది తమకుతామే గొప్పవారిమని భావన ఈ భావన వల్ల చిన్న పనులుచేయడం, మామూలు




పిల్లలులాగ వుండటం వీరికి నచ్చదు ప్రత్యేకమైన అభిరుచులు వీరికి టి వి చూడటం తెలుసు క్రికెట్ వీరుల చరిత్ర స్కోరులు కంఠస్థం వచ్చు దుస్తుల దగ్గర్నుంచీ తినే బ్రేక్‌ఫాస్టుదాకా హైక్లాసుగా వుండాలి వీరిడి అటు పూర్తిగా యవ్వనం రాని వయస్సు బాల్యంవీడి పెద్దవాళ్ళు మూర్ఖులుగా, తెలివితక్కువవారుగా కనిపించే వయసు కొందరైతే పుస్తకాలను అంటిపెట్టుకుని పురుగులలా తయారయి బైట ప్రపంచం తెలియకుండా తయారవుతారు వీరు మరీ విభిన్నంగా వుంటారు ఒక్క పేసరు కూడా ప్రాక్టికల్‌గా ఆలోచించరు.

వీళ్ళందరినీ సక్రమమార్గాన పెట్టడానికే సమాజంలో యువత దూకుడుతనం వల్ల వుత్పన్నమయ్యే సమస్యలను తగ్గించడానికే యివి వెలిశాయి

ముఖ్యంగా యిక్కడ ప్రత్యేక ఆకర్షణలు తక్కువ గురువుకీ, శిష్యులకీ దగ్గరతనం ఎక్కువ కాయకష్టం చెయ్యడం, పదిమంది మధ్యన తినడం మెలగడం అలవాటవుతాయి అంట్లో తల్లి ప్రేమగా పెడితే అన్నీ నెట్టేసే పిల్లలు యిక్కడ కులమత జాతి వివక్షత లేకుండా తిండి తింటారు పిల్లలు ఒకవేళ ఈరకమైన విద్వేషాలు పెంచుకుంటే వారికి తగిన శిక్ష వుంటుంది తల్లి తండ్రులకు రిపోర్టు వెళుతుంది మార్కులు తగ్గకూడదు బుల్‌వర్కులా కాకుండా మార్కులు పెంచుకోటం ప్రదానం అని తెలుస్తుంది అతి గారాబంగా పెరిగినవారికి కొత్తలో ప్రాణసంకటంగా వుంటుంది

బైట చదివి, స్టయికులు, సెలవులు, అల్లర్లు, టీజింగు, రాగింగు మొదలైనవే విద్యార్థి జీవిత లక్ష్యమనుకునేవారు కూడా ఈరకమైన పద్ధతిలో వుంటే తప్పుకాదు వారు బోల్డు డబ్బుపోసి చదువుకున్నారు ఇంట్లో మాకు సాగటంలేదు అని తల్లి తండ్రులను ఆడిపోసుకోడం మానాలి చదివిన కాసేపు ఏకాగ్రతతో చదివితే తలకెక్కుతుంది సాటి విద్యార్థి కులం, మతం, జాతి పట్టించుకోని సంస్కారం విద్య ద్వారా నేర్చుకోవాలిగాని మరచిపోకూడదు మనకున్నది ఒకరికి పెట్టి, నలుగురితో కలిసి తినగలిగే సౌహార్ద్రత అలవాటు చేసుకోవాలి చివరిది గురువును ప్రేమించటం సరదాకి ఏడిపించటం, పేర్లుపెడితే గురువులూ సరదాగా తీసుకుంటారు నిర్లక్ష్యం, ధిక్కరణ, ఈసడింపు, వ్యక్తిగత వైషమ్యాలను తెలుసుకుని ఎద్దేవా చేయడం పిల్లకెంతమాత్రం సబబుకాదు గురువుకీ, శిష్యులకి ఆ దశ ఒక తీయని స్మృతిగా మిగలాలి ఆ సభ్యతా సంస్కారాలు అలవాటు చేసుకుంటే వున్న ఒకరిద్దరూ లేక ముగ్గురైనా మంచి నడవడిలో వున్నారని తల్లి తండ్రులు సంతృప్తి పడతారు అదేకదా పిల్లల నైతికబాద్యత □



# మరో మలుపు

(గత సంచిక తరువాయి)

ఫస్టియర్ పరీక్షలు రాసి హాలిడేస్‌కు ఆనంద్ ఇంటికి వచ్చాడు. సారథి వచ్చి ట్రైన్ ఎక్కించాడు. లెటర్స్ వ్రాయమని మరీమరీ చెప్పాడు.

ఆనంద్ ఇంటికి వచ్చాకా అదివరకులా సోమరిగా పడుకోకుండా తండ్రి వెంట పొలం వెళ్ళ సాగాడు.

కొడుకులో వచ్చిన మార్పుకు తల్లీ, తండ్రీ ఎంతో పొంగి పోయారు.

కొడుకు సాయంతో సుబ్బారావు గారు రెట్టించిన ఉత్సాహంతో పొలం పని చేయించ సాగారు.

రాజేశ్వరి మరిది జ్యోతికి సంబంధం తెచ్చారు. చాలా మంచి కుటుంబం పెళ్ళి కొడుకు వైజాగ్‌లో మంచి జాబ్ చేస్తున్నాడు. అందగాడు, కట్నం కాస్త ఎక్కువే అడిగారు.

సుబ్బారావు గారు కట్నం విషయాలు తరువాత చూడొచ్చు అని వారిని పిల్లను చూడటానికి ఆహ్వానించారు. వాళ్ళు అబ్బాయిని తీసుకుని వచ్చారు. పిల్ల వారందరికీ బాగా నచ్చింది. జ్యోతి కూడా అతన్ని ఇష్ట పడింది.

పెద్దలంతా కట్నాల గురించి చర్చించ సాగారు. వాళ్ళు అడిగిన కాష్‌కు సుబ్బారావు గారు ఏమీ మాట్లాడలేక పోయారు. ఈ మధ్య ఆనంద్ చదువుకని చాలా డబ్బు ఖర్చు పెట్టారు. ఉన్న పైకంతో ఎలాగో మర్యాదగా పెళ్ళి చేయగలడు. కాని కట్నం సొమ్ము ఎలా?

"అబ్బాయి ఎలానూ చదువు కుంటున్నాడు. అతని బతుకు అతను బతుకుతాడు. మీకు ఈ ఇల్లు ఉంది. [illegible] పొలం అమ్మాయి పసుపు, కుంకుమ కింద ఇచ్చేయండి. సంబంధం దివ్యంగా కుదిరి పోతుంది" మధ్య వర్తి చెప్పాడు.

సుబ్బారావుగారి గుండెలో రాయి పడింది. ఆ పొలంలోనే ఆయన ప్రాణం అంతా ఉంది. అది కొడుక్కి అప్ప చెప్పాలని తండ్రిగా ఆయన ఆరాటం.

ఏ సంగతీ రేపు చెప్తానని వారిని సాగనంపాడు.

ఆ రాత్రి ఆ ఇంట్లో పెద్ద చర్చ జరిగింది.

జరిగిన కథ – 4 : సారథికి ఆనంద్ ఒకరోజు తాగి మత్తుగా పడిఉండగా పరిచయమవుతాడు. ఆ పరిచయం సాన్నిహిత్యంగా మారి, ఆనంద్ సారథి ఇంట్లో మనిషిలా మసలు తుంటాడు. ఆనంద్‌తో కలసి వాళ్ల ఊరు వెళ్ళిన సారథిని ఆనంద్ తల్లి, తండ్రులు ప్రేమగా చూస్తారు. ఆనంద్ స్నేహితులతో పార్టీ చేసుకోవడానికి భీమిలీ వెళ్తాడు. తాగిన మైకంలో ఆనంద్ ఒక పవిత్రమూర్తిని మలినం చేస్తాడు. కొన ఊపిరితో ఇసుకలో పడిఉన్న ఫాదర్‌ని చూస్తాడు ఆనంద్. ఫాదర్ తప్పు తన మీద వేసుకుని ఆనంద్‌ని రక్షిస్తాడు. జరిగింది తెలుసుకొని సారథి హడలి పోతాడు. ఆనంద్ పూర్తిగా మారిపోయాడు. చదువులో కూడా సారథిని వెనక్కి నెట్టేస్తున్నాడు.

ఈ సంబంధం వద్దు. పొలం రాసే ప్రశక్తి లేదని తేల్చారు సుబ్బారావుగారు.

జ్యోతి చిన్న బోయింది. ఆమెకు వరుడు బాగా నచ్చాడు. తండ్రి పొలం ఇవ్వననటంతో సంబంధం తప్పి పోతుందే అన్న నిరుత్సాహం కలిగింది. తల్లి ఎంత బ్రతిమిలాడినా భోజనం ముట్టుకోలేదు. ఆనంద్‌కు చెల్లెలి మనసులో బాధ అర్థం అయింది.

ఈ సంబంధమే కాదు ఏ సంబంధం అయినా కట్నం ఎక్కువగా ముట్ట చెప్పకపోతే చెల్లెలి పెళ్ళి కాదు అని అతనికి తెలుసు. అటువంటప్పుడు చెల్లెలికి నచ్చిన ఈ సంబంధం అయితే బాగుంటుంది అనుకున్నాడు.

తండ్రిని ఎలాగో వప్పించాడు. తమ ముగ్గురి జీవితాలు సుఖంగా గడిచేలా తను చేయగలననీ, చెల్లెలి మనసు నొప్పించొద్దని తండ్రికి నచ్చ జెప్పాడు. వేరే పొలం ఎక్కడైనా గుత్తకు తీసుకుని తండ్రి చేసుకోవచ్చనీ ఎలాగు ఇల్లు ఉంది కాబట్టి బ్రతకలేకపోం అన్నాడు.

ఈడు వచ్చిన కొడుకు మాట ఇక కాదనలేక పోయారు సుబ్బారావు గారు.

ఉన్నంతలో జ్యోతి పెళ్ళి ఘనంగా చేసారు. పెళ్ళికి ముందు ఆనంద్ వైజాగ్ వెళ్ళి సారథి ఇంట్లో అందరినీ తమ వూరు తీసుకు వచ్చాడు. తమ కొడుకుల స్నేహం చూసి పెద్దవాళ్ళు కూడా సంతోషంగా చేయీ చేయీ కలుపుకున్నారు.

పెళ్ళి పనులన్నిటిలోనూ ప్రమీల చక్కగా సాయపడింది. ప్రమీల పని చూసి ఆనంద్ తల్లి రాజేశ్వరి ఎంతో ముచ్చటపడింది.

అలా జ్యోతి పెళ్ళి ముచ్చటగా జరిగి పోయింది.

* * * * * * *

ఆనంద్ అన్నట్టుగా సుబ్బారావు గారికి వేరే పొలం కౌలుకు దొరక లేదు. గుత్తకు ఇస్తామన్న పొలాలకు ఎక్కువ డబ్బు అడిగారు. అంత డబ్బు ఇవ్వగా తమకు మిగిలేదేం ఉండదు అని ఆయన తీసుకోలేదు.

జ్యోతికి ఇచ్చిన పొలం ఆమె మామగారు కూడా వ్యవసాయదారులే కాబట్టి ఆయనే చూసుకుంటున్నారు. ఆనంద్ చదువుకు డబ్బు కావాలి. ఇంటి మీద డబ్బు తెచ్చి కొడుకు కోసం పంపించ సాగారు.

తండ్రి చదువు కోసం అప్పులు చేసి డబ్బు పంపిస్తున్నాడని ఆనంద్‌కు తెలుసు. కానీ ప్రస్తుతం అంతకు మించి గత్యంతరం లేదు. హాస్టల్‌లో అయితే ఫ్రెండ్స్ తాకిడికి తట్టుకోలేక అతను సారథి ఇంటి పక్క చిన్న రూమ్ అద్దెకు తీసుకుని ఉంటున్నాడు. సారథి ఇంట్లో రోజూ భోజనం చేయమని వత్తిడి చేస్తుండటంతో వెళ్ళి అక్కడ తింటున్నాడు. విస్కీ ఫ్రెండ్స్ అప్పుడప్పుడు వచ్చి పలకరించి పార్టీలకు ఆహ్వానిస్తున్నారు. ఆనంద్ మరెప్పుడు అటువంటి పార్టీలకు వచ్చేది లేదని ఖచ్చితంగా చెప్పి వారిని పంపేస్తున్నాడు.

చెల్లెలు జ్యోతి కాపురం వైజాగ్‌లోనే. హాలీడే నాడు మాత్రం అక్కడకు వెళ్ళి పోతాడు. జ్యోతి భర్త సత్యమూర్తి చాలా మర్యాదస్థుడు. ఆనంద్‌ని తమతోనే ఉండిపోయి చదువుకోమని అతడు బలవంతం చేస్తుంటాడు. కానీ ఆ నూతన జంటకు మధ్యగా తను ఉండటం ఆనంద్‌కు నచ్చదు. అందుకే సత్యమూర్తి

ఆహ్వానం నవ్వుతూ తిరస్కరిస్తాడు సెలవు రోజు కూడా పగలు ఉంది సాయంత్రం కాగానే రూమ్‌కి వెళ్ళిపోతాడు

★ ★ ★ ★ ★ ★ ★

కాలం వేగంగా గడచి పోతోంది ఆనంద్, సారథి బి ఎస్ సి ఫైనల్స్ రాసారు అప్పటికి సుబ్బారావు గారు ఇంటిమీద దాన్ని మించిన అప్పు తెచ్చారు ఆయనకు పొలం ఏదీ గుత్తకు దొరకలేదు దానికితోడు ఆయనకు బ్లడ్‌షుగర్ వ్యాధి వచ్చి బాగా ముదిరి పోయింది

ఆనంద్ జీవితంలో ఏ మార్పు రాలేదు ఫ్రెండ్స్ తిరిగి అతన్ని తమ విలాస జీవితంలోకి తీసుకు వెళ్ళలేక పోయారు సారథి, ఆనంద్ స్నేహంలో కూడా ఎటువంటి విబేధమూ తల ఎత్తలేదు ఫైనల్స్ రాసేవరకూ సారథి ఇంట్లోనే భోజనం చేసాడు ఆనంద్



శ్రీనువాస్ కూడా కాలేజీకి వచ్చాడు ప్రమీల ఇంటర్ పూర్తి చేసి బి కామ్ లో చేరింది అప్పటికే ఆమె బ్యాంక్ టెస్ట్‌లకు హాజర్ కాసాగింది

జ్యోతికి కొడుకు పుట్టాడు ఆనంద్‌కు మేనల్లుడు అంటే ప్రాణం వాడికి సుమన్ అని పేరు పెట్టాడు

ఎగ్జామ్స్ కాగానే ఆనంద్ ఇంటికి వచ్చేసాడు తండ్రి ఆరోగ్యం మరీ పాడయి పోయింది ఊరంతా అప్పుల మయం ఈ పరిస్థితి తట్టుకోలేక దిగులు పడే తల్లి తను రాగానే కోడిని కోసి ఘనంగా విందు వంటలు వండే తల్లి ఇప్పుడు నెయ్యి కూడా లేకుండా అన్నం పెడుతోంది

ఆనంద్‌కు ఎంతో బాద అనిపిస్తోంది రిజల్ట్స్ కోసం ఎదురు చూడసాగాడు తను తాగుడు మైకంలో ఎంతో సొమ్ము నాశనం చేసాడు అదంతా ఉంటే తను ఇప్పుడు ఏదైనా ఆస్తి ఏర్పరచుకునే వాడు కదా అని బాధపడ సాగాడు

రిజల్ట్స్ వచ్చాయి ఆనంద్, సారథి ఫస్ట్ క్లాస్‌లో పాస్ అయ్యారు ఆస్తి అంతా కొడుకు, కూతురుకు ధారపోసినా అటు కూతరు సుఖంగా కాపురం చేసుకుంటోంది ఇటు కొడుకు లక్షణంగా పాసయ్యాడు అదే సంతోషంగా ఉంది సుబ్బారావు గారికీ, రాజేశ్వరికి

.రిజల్ట్స్ చూడగానే ఆనంద్ వైజాగ్ వచ్చి సారధిని కలుసుకున్నాడు

దబ్బ పండు లాటి ఆనంద్ శరీరఛాయ దిగుళ్ళతో వడలి నల్లబడింది ఎప్పుడూ హుషారుగా సార్థక నామధేయుడిలా విలాసంగా కాలం గడిపే ఆనంద్ ఇవాళ చిక్కులతో మనశ్శాంతి లేక తల్లడిల్లుతుంటే సారథికి చాలా బాధ అనిపించింది

ఇద్దరూ కలసి చాలా చోట్ల జాబ్స్ కోసం అప్లికేషన్స్ పెట్టసాగారు

ఇక్కడా ఆనంద్ వెనుక దురదృష్ట దేవత చేరింది త్వరలోనే సారథికి జాబ్ దొరికింది ఆనంద్‌కు దొరక లేదు

సారథి కుటుంబ పరిస్థితులు చక్క బడ్డాయి పచ్చగా ఉన్న ఆనంద్ కుటుంబ పరిస్థితి బోల్తా పడింది దానికి తోడు సుబ్బారావు గారు మృత్యువుకు సమీపంగా ఉన్నారు తండ్రిని తీసుకు వచ్చి వైజాగ్‌లో హాస్పటల్‌లో జేర్పించారు సత్యమూర్తి ఆ ఆపద సమయంలో మామగారి హాస్పటల్ ఖర్చులకు చాలా ధనం సాయం చేసాడు. కానీ అదంతా బూడిదలో పోసిన పన్నీరు అయింది సుబ్బారావు గారు కళ్ళు మూసారు ఆనంద్ మూగవాడే అయ్యాడు

నా పెళ్ళి చేసిన దగ్గర నుండీ మా నాన్న చావుకు దగ్గరయ్యారు దీనికంతా కారణం నేనే అని జ్యోతి ఎంతో ఏడ్చింది ఆమెను ఎవరూ పట్టలేక పోయారు

ఆనంద్ మతిలేని వాడిలా కూర్చుండి పోయాడు అతని జేబులో చిల్లిగవ్వ లేదు

సారథి ఒకప్పుడు ఆనంద్ తమకు చేసిన సాయం మర్చిపోలేదు ఆనంద్‌ను అన్ని విధాలుగా సత్యమూర్తితో కలసి ఆదుకున్నాడు

ఆనంద్‌కు, జ్యోతికీ, రాజేశ్వరికీ, సత్యమూర్తికీ పెద్ద దిక్కుగా సారథి అమ్మా, నాన్న నిలబడ్డారు

సత్యమూర్తి తల్లి, తండ్రి కూడా వచ్చారు

అందరూ కలసి సుబ్బారావు గారి కర్మకాండలు బాగా జరిపించారు

## మరో మలుపు

సత్యమూర్తి, సారథి ఆనంద్ స్వగ్రామం వెళ్ళి సత్యమూర్తి తండ్రి సాయంతో ఇల్లు మంచి రేటుకు అమ్మి అప్పులన్నీ తీర్చేసారు ఐదువేలు మిగిలితే అవి తెచ్చి రాజేశ్వరి పేర బ్యాంక్‌లో వేసారు ఆ రోజు రాజేశ్వరి ఎంతో ఏడ్చింది

తండ్రి అభిమానం, ఆదరణ గుర్తు వచ్చి ఆనంద్, జ్యోతి కూడా బాధపడ్డారు

సత్యమూర్తి అత్తగారినీ, బావమరిదినీ తమ ఇంట్లోనే ఉండమని కోరాడు కానీ కూతురికి తమ బాధ్యత పెట్టదల్చుకో లేదు రాజేశ్వరి

తల్లి అభిప్రాయం తెలుసుకున్నాడు ఆనంద్ దాంతో అతను ఒక చిన్న రూమ్ అద్దెకు తీసుకుని అందులోకి తల్లిని తీసుకు వచ్చాడు

సారథి, సత్యమూర్తి ఆనంద్‌కు ఎంతో ధైర్యం చెప్పసాగారు సంవత్సరం గడచి పోయింది ఆనంద్‌కు ఉద్యోగం దొరక లేదు

తన పాపపు జీవితమే తనని ఈ స్థితిలోకి దించిందని పించ సాగింది ఆ రోజు ఆ పవిత్ర మూర్తిని తన నీచమైన వాంఛకు బలి చేసాడు దేవునికి అంకితం కాబడ్డ ఆ స్త్రీ జీవితాన్ని కాలరాసాడు ఆ పాపమే తననిలా వెంటాడు తోంది

సారథి మంచి మనసుకు తగ్గట్టుగా అతనికి వెంటనే ఉద్యోగం దొరికింది అతని జీవితం బాగుపడింది తను చేసిన పాపానికి ప్రతిఫలంగా తన జీవితం ఎందుకూ కాకుండా నాశనం అయిపోయింది అతని మనసు విరక్తి చెందింది తనకు ఇక చావే పరిష్కారం తను మరణిస్తే కానీ చనిపోయిన ఆమె ఆత్మకు శాంతి కలగదు అదే చేయాలి పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు

తన చావుకు ముహూర్తం పెట్టుకున్నాడు చివరిసారిగా ఆత్మీయులందరినీ చూసాడు

సరిగ్గా ఆ సమయంలో పాదర్ గుర్తు వచ్చారు చివరిసారిగా ఆయన్ని చూడాలని పించింది వెంటనే లేచి బస్టాప్‌కు వచ్చాడు

పాదర్ దగ్గరకు వచ్చాడు పాదర్ ఆనంద్‌ను గుర్తు పట్టారు చాలా ప్రేమగా పలకరించారు ఆనంద్ పెదవులు ఉద్వేగంతో వణుకు తున్నాయి

ఫాదర్! చివరిసారిగా మిమ్మల్ని చూడాలని వచ్చాను నాకు మళ్ళీ జన్మంటూ ఉంటే కనీసం మీ ఇంట్లో కుక్కగా పుట్టాలని కోరుకుంటున్నాను అంటున్న ఆనంద్ కళ్ళనుండి జలజలా నీళ్ళు కారాయి

ఆనంద్ మాటలకు ఫాదర్ ఆశ్చర్య పోయారు

'బాబూ! ఏమిటి నీ మనసులో బాధ? ఎంతో బాధలో కానీ నువ్వీ నిర్ణయానికి రావు నేను నీ ఫాదర్‌ను నాకు చెప్పవూ? లాలనగా అడిగారు

ఆనంద్ గుండెలో లావా ఉబికింది తన జీవితంలో ఏర్పడిన కల్లోల తరంగాలన్నీ ఫాదర్ ముందు పెట్టాడు.

ఆయన ఎంతో శాంతంగా విన్నారు

'ఫాదర్! నా గుండె ఇక భరించలేదు ఆ పవిత్ర మూర్తిని కలుషితం చేసాను అందుకే ఆ పాపం శాపంగా నన్నిలా వేధిస్తోంది. నేను మరణించాలని నిర్ణయించు కున్నాను" కంఠంలో వేదన తొణికిస లాడింది

ఫాదర్ చిరునవ్వు నవ్వారు

'ఫాదర్! నా బాధ మీకు నవ్వుగా ఉందా?" ఆనంద నిస్సహాయంగా అన్నాడు

బాబూ! జీవితం అనేది పెద్ద సముద్రం అందులో వచ్చే కష్టాలూ, సుఖాలూ కెరటా ల్లాటివి అవి ఒడ్డుకు వస్తూ ఉంటాయి పోతూ ఉంటాయి అంత మాత్రాన సముద్రానికి నష్టం ఏమిటి? అన్నిటినీ తట్టుకుని ధీటుగా నిలబడుతుంది

మనిషి కర్మజీవి అతను చేసే ప్రతి చర్య వెనుకా భగవంతుని హస్తం ఉంటుంది. ఆయన ఎవరికెలా రాస్తే అలానే జరుగుతుంది మంచికానీ, చెడుకానీ ఆయన విధించిన ప్రకారమే మనిషి చేస్తాడని నేను నమ్ముతాను గతం నాస్తి నువ్వు జరిగిన దంతా మర్చిపో ఆ నాటి సంఘటనతో నీ జీవితాన్ని సక్రమ మార్గంలో పెట్టుకున్నావు దాన్ని నిలబెట్టుకోవటానికి నీకిప్పుడు ఒక ఉద్యోగం అవసరం అవునా"? ప్రశ్నించారు

అవును ఫాదర్! నా తండ్రిని పోగొట్టుకున్నాను కనీసం నా తల్లి చనిపోయేవరకైనా ఆమెను సుఖపెట్టాలని కొడుకుగా కోరుకోవడంలో తప్పు లేదుగా? ఆర్తిగా అన్నాడు

లేదు బాబూ! నీ ఆశయానికి నేను చాలా గర్విస్తున్నాను నీకు నేను ఉద్యోగం ఇప్పిస్తాను నీ సమస్యకు చావు పరిష్కారం కాకూడదు

ఫాదర్! మీరు దేవుడు" అంటూ ఆనంద్ ఫాదర్ కాళ్ళు పట్టుకున్నాడు

ఫాదర్ నిండు హృదయంతో ఆనంద్‌ను దీవించారు

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ఆరోజుతో ఆనంద్ జీవితం మరో మలుపు తిరిగింది ఫాదర్ సహకారంతో ఆనంద్‌కు మంచి ఉద్యోగం వచ్చింది

రాజేశ్వరి సంతోషపడింది కొడుకు ఉన్నతిని చూసుకోవడానికి భర్త లేడని ఆయన్ని తల్చుకుని ఏడ్చింది

ఆనంద్ ఉద్యోగంలో చేరిన నాడు ఫాదర్‌ను కలుసుకుని ఆయన ఆశీస్సులు తీసుకున్నాడు

## గడుసులోకం

—బాబు






# డాక్టర్ సలహాలు

## డా. కె. వెంకటేశ్వరరావు



**ఏ. యస్. – సికింద్రాబాద్**

నా వయస్సు 20 సం. నేను బి. కాం. చదువుతున్నాను. నా గజ్జలలో దురదగా ఉంటోంది, గోకితే పొట్టు, పొట్టుగా వస్తోంది, అక్కడ నలుపుగా మారుతోంది. నాల్గు నెలలుగా ఈ దురద మొదలైంది. డాక్టర్‌కి, ఇంట్లో వాళ్ళకి చెప్పాలంటే సిగ్గుగా ఉంది. దయ చేసి నేను ఏ మందులు వాడాలో తెలపగలరు.

**గ్రిసియోఫల్విన్ అనే మందుని వైద్యులు ఫంగస్‌ని పోగొట్టటానికి మాత్రల రూపంలో వాడతారు. పైపూతగా ఆంటీ ఫంగల్ ఆయింట్‌మెంట్లు వ్రాసి ఇవ్వటం జరుగుతుంది. వైద్యుల దగ్గర ప్రిస్క్రిప్షన్ తీసుకొని మందులు కొనండి.**

**కె. ప్ర. – వెంగళాయపాలెం**

నా ఆర్థిక పరిస్థితుల కారణంగా ఒక బ్యాడ్ క్యారక్టర్ గల అమ్మాయితో నిశ్చితార్థము అయినది. ఈ సం. వివాహం జరుగును.

మా గ్రామంలో ఒక అమ్మాయికి ఒక అబ్బాయికి సంబంధము కలదు. ఈ అక్రమ సంబంధము తరువాత ఆ అబ్బాయికి విపరీతముగా తలనెప్పి 10 రోజులు వచ్చినదట. తరువాత ఒక రోజు ఆ అబ్బాయి స్పృహ తప్పి పడిపోయినాడు. మా గ్రామ నాటు వైద్యుడు అతనిని పరీక్షించి ఆ అమ్మాయి రక్తం, ఇతని రక్తం కలవలేదు, అందువలన ఇతనికి దోషగుణం వచ్చినది కాపున ఆ అమ్మాయి తొడ రక్తం కొన్ని ఆకులలో కలిపి ఇతని కళ్ళ మీద ఆ పసరు పోసినాడు. ఆ అమ్మాయి రక్తం ఇవ్వక పోతే ఈ అబ్బాయి చచ్చి పోయెడివాడు అని చెప్పాడు. నాటు వైద్యుడు చేసిన వైద్యం తరువాత ఇప్పుడు ఆ అబ్బాయి క్షేమంగా ఉన్నాడు.

నా పరిస్థితుల కారణంగా ఆ అమ్మాయిని పెండ్లి చేసుకోక తప్పదు. మీ వైద్య సలహా తరువాత ఒక నిర్ణయంకి వస్తాను. దయచేసి నేను ఆ అమ్మాయిని చేసుకొంటే తగిన మందులు తెలుపగలరు.

**పైన వ్రాసినవి పిచ్చినమ్మకాలు. "రక్తం" కలవక పోవటమంటూ లైంగిక కలయిక ద్వారా జరుగదు. స్త్రీ – పురుషులిరువురూ – వి. డి. ఆర్. ఎల్ రక్త పరీక్ష చేయించుకొని లైంగిక సుఖరోగాలు లేవని రూఢి పరచుకోవాలి.**

**యం. ఎ. – నల్గొండ**

మా బంధువుకు ఈ మధ్య సుమారు ఒక నెల నుంచి తల వెనుక భాగమున బాగా నొప్పి వస్తున్నది. వాంతులు కూడా అవుతున్నాయి. ఇవి రోజు కాక 4, 5 రోజులకు ఒక సారి వస్తుంది. ఈ వ్యాధి యొక్క పూర్తి లక్షణాలు, నివారణోపాయం తెలుపగలరు.

**మీరు మీ బంధువుని న్యూరాల జిస్టులకి గాని –. న్యూరో సర్జన్లకి గాని చూపించండి. రోగ నిర్ధారణ ఏదో తెలియకుండా నివారణోపాయం ఎలా చెప్పటం?**

**టి. వి. – నవాబుపేట**

నా వయస్సు 21 సం. ఆరు నెలల క్రితం నాకు మలబద్ధకంగా ఉండేది. ఒకసారి నేను మల విసర్జన చేయుచుండగా నా యొక్క మలద్వారం నుంచి రక్తం పడినది. మళ్ళీ 20 రోజుల తరువాత ఈ విధంగానే రక్తం పడినది. ఏమిటని చూసే సరికి మలద్వారం దగ్గర పైల్స్ జట్టు మాదిరిగా ఇప్పటి వరకు ఉన్నది. దీని యొక్క నివారణోపాయం తెలుపగలరు.

**మీరు సర్జన్ల సలహా పొందటం మంచిది.**

**యన్. జి. యమ్. – ముల్లంగి చెట్లపాలెం**

నా వయస్సు 38 సం.లు. నాకు మూత్ర విసర్జనప్పుడు చాలా బాధగా ఉంటుంది. రేయి, పగలు మూత్ర ద్వారమున వత్తితే తెల్లగా జిగుటగా ఒకటి లేక రెండు బొట్లు ద్రవం వస్తుంది. ఈ ద్రవంపై హైడ్రోజన్ పెరాక్సైడ్ రెండు బొట్లు వేస్తే తెల్లని నురుగు వస్తుంది.

డాక్టర్ సలహాపై 5 పెన్సిలీన్ ఇంజక్షన్లు మరియు సల్ఫడైజిన్ 500 మి. గ్రా. రోజుకి మూడు సార్లు చొప్పున వారం రోజులు వాడాను. నాల్గు రోజులలో గుణం కనిపించిన తరువాత తిరిగి బాధ మొదలైంది. ఇప్పుడు నేను ఏ మందులు వాడాలో తెలుపగలరు.

**ముందర వి. డి. ఆర్. ఎల్ అనే రక్త పరీక్ష చేయించు కోవటం మంచిది. తర్వాత మూత్ర నాళం నుంచి వచ్చే ద్రవాన్ని – స్మియర్ ఎక్సామినేషన్ చేయించండి. ఫలితాలను వైద్యులకి చూపించి వారి సలహా ప్రకారం మందులు వాడండి.** □

# మరో మలుపు

"నువ్వెంత ధనవంతుడివైనా మానవతా ధర్మం మర్చిపోకు బాబు"! ఫాదర్ చెప్పారు.

"అలాగే ఫాదర్! ఆనంద్ సంతోషంగా వాగ్దానం చేసాడు.

అతను తన సన్నిహితులను ఎవరినీ మర్చిపోలేదు. సారథి కూడా స్నేహితుడికి జరిగిన శుభానికి సంతోషించాడు.

ఆనంద్ పగలంతా ఉద్యోగం చేస్తూ రాత్రి నైట్ కాలేజీలో పట్టుదలగా చదివి యమ్. ఎస్. సి. పాసయ్యాడు.

అతని ఉద్యోగం మరో మెట్టు పైకెక్కింది. డిపార్ట్‌మెంట్ టెస్టులు కూడా పాసకావడంతో ఆఫీసర్‌గా ప్రమోషన్ వచ్చింది.

రాజేశ్వరి కొడుకుని పెళ్ళి చేసుకోమని పోరసాగింది. ఆదేవుని అనుగ్రహం కలిగిననాడు అదే అవుతుందని ఆనంద్ తల్లి మాటలు కొట్టేసాడు.

సారథికి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి చెల్లెలు ప్రమీల పెళ్ళికానిదే తను చేసుకోకూడదని అతని అభిప్రాయం.

ప్రమీల బి. కామ్ పూర్తి చేసింది. ఆమెకు బ్యాంకులో క్లర్క్ పోస్టు వచ్చింది. పెళ్ళి చేసుకోవాలని ఆమెకు ఉంది. కానీ ఆమె హోదా పెరిగిన కొద్దీ ఆమెకు అడిగే కట్నం కూడా హెచ్చు అవుతోంది.

అంత కట్న కానుకలు తమవారు ఇవ్వలేరు. తనకంటే ఎక్కువ హోదాలో ఉన్నవాడిని తేవాలని తండ్రీ, అన్నల ఆరాటం. తము ఇవ్వగలిగే కట్నంలో వచ్చే తక్కువవారిని ఎలాగైనా తను ఇష్టపడుతుంది. కానీ తన వాళ్ళు తనకంటే తక్కువ వాడికి తననివ్వలేరు. అందుకే ప్రమీల తన పెళ్ళి విషయం అన్నా, తండ్రి చేతుల్లో పెట్టేసి ఊరుకుంది.

ఆమె తెచ్చే జీతం డబ్బు సారథి ఆమె పేర వేరుగా దాస్తున్నాడు.

సారథికి రోజుకు ఒకసారైనా ఆనంద్‌ను చూడకపోతే బాగుండును. కనీసం అతని కంఠం ఫోన్‌లో అయినా వినాల్సిందే. ఆనంద్‌ను పెళ్ళి చేసుకోమని అలా అయితే తల్లికి బాధ్యత అంతా తప్పించ వచ్చని ఆనంద్ జీవితంలో కూడా వికాసం ఏర్పడుతుంది అని చెప్తుంటాడు.

ఆనంద్ నవ్వేసి ఊరుకుంటాడు.

(ఇంకా ఉంది)

# త్రిశంకు స్వర్గం

ప్రఫుల్ల చంద్ర



పార్కులో జారుడు బల్ల వద్ద చాలా కోలాహలంగావుంది. నిచ్చెన మీదుగా అంత ఎత్తుకు ఎక్కి బల్లమీదుగా జారుతూ భూమ్మీద పడడం ఎంత థ్రిల్! జోరుగా జారడంలోనే వుంది మజా అంతా! ఒక్కొక్కరు విడివిడిగా జారడం కంటే యిద్దరు, ముగ్గురు ఒకరి వెనక ఒకరు జారుతూ – చివరకు ఒకరి మీద ఒకరు పడితే – మజామజా! జారిపడినప్పుడు తల, కాళ్ళూ, చేతులూ ఇసకలో కూరుకుపోతే ఎంత హాయి!

రోజూ సాయంకాలం ఐదు గంటలవేళ స్కూలు నుండి తిన్నగా పార్కుకి వచ్చి కాసేపు ఆడుకొని వెళ్ళిపోతారు ఆ పిల్లలు.

నూనె రాయని కాకిగూడు జుట్టు – మాసిపోయిన చొక్కాలు, మాసికలేసిన లాగులు – పోషణలేని శరీరాలు –

వస్తూనే పుస్తకాలు ఒకప్రక్కనపెట్టి ఆట ప్రారంభిస్తారు వాళ్ళు. ఆ పుస్తకాలు – అట్టలూడి, కొసలు ముడుచుకుపోయి మాసిపోయి వుంటాయి – దీనంగా.

పార్కులో మంచి జాగాలన్నీ ముందు వచ్చిన అదృష్టవంతులు ఆక్రమించుకోగా – జారుడుబల్లకి దగ్గరగా వున్న సిమ్మెంట్ బెంచీ ఒక్కటే – రిటైర్ అయిన నాగభూషణాన్ని ఆహ్వానిస్తూ వుంటుంది.





పార్కుకి అటుప్రక్క ఎక్కడో పబ్లిక్ లెట్రిన్ వుంది కాబోలు ఉండి ఉండి గుప్పుగుప్పుమని 'గుబాళిస్తూ' వుంటుంది అందుకే అటువేపు సీట్లు కాళీగా వుంటాయి మురికిలో పుట్టి మురికిలో పెరిగిన ఆ పిల్లలకు ఆ కంపు ఒక సమస్యకాదు రెండు రోజులు అక్కడ కూర్చునేసరికి నాగభూషణానికీ అలవాటైపోయింది! అందుకని మంచి సీట్లకోసం వెదుక్కోవడం మానేసి వేరుగా అక్కడికేవచ్చి కూర్చుంటున్నాడాయన ఈమధ్య

మొదట ఆ పిల్లల గోల చూసి ఛీఛీ కాకిగోల అని విసుక్కున్నాడు ఛీ! పిశాచపు పిల్లలు! అలగా జనం! అని తిట్టుకున్నాడు కాని అదీ అలవాటైపోయింది

పార్కుకి దగ్గరగానే ఒక కాన్వెంట్ వుంది ఎప్పుడూ పార్కుకి రాని ఆ కాన్వెంట్ పిల్లలు నలుగురు ఆ రోజెందుకో అక్కడికి వచ్చారు

జారుడుబల్ల మీద నుంచి జారుతున్న పిల్లల్ని చూస్తూ కాసేపు నిల్చున్నారు వాళ్ళు అందంగా, ఆరోగ్యంగా మిసమిసలాడుతూ దిగివచ్చిన పిల్ల దేవతల్లాగ వున్నారు చెదరని క్రాప్, మడత నలగని యూనిఫాం

అందులో ఒకడు వంగి బూట్లకు పట్టిన దుమ్ముని గుడ్డతో తుడుచుకుంటున్నాడు అతని షర్ట్‌కి బాడ్జ్ వుంది అంటే లీడర్ అన్నమాట! వాళ్ళంతా స్కూలు బాక్సులు కిందికి దించి ఆట చూస్తున్నారు కాని ఆ మురికి పిల్లల పట్ల అసహ్యం వాళ్ళ ముఖాల్లో ప్రతిఫలిస్తోంది

కాసేపు చూసి 'ఏయ్!' 'మేం ఆడుకోవాలి! మీరు మరో చోటుకి పొండి' అన్నాడు లీడరు సాధికారికంగా

మురికి పిల్లలు ఆట ఆపి గుంపుగా నిలబడిపోయారు వాళ్ళకి అతని అధికారం నచ్చలేదు చూస్తుండగానే వాళ్ళలో ఒకడు లీడర్‌లాగ ముందుకొచ్చి – అంతే అధికారంతో అన్నాడు "కావాలంటే మీరూ మాతో బాటు ఆడుకోండి! అంతేగాని మేం యిక్కడనుంచి వెళ్ళేదిలేదు

వాడు అంత ఖచ్చితంగా చెప్పేసరికి కాన్వెంట్ పిల్లలకు కోపం వచ్చేసింది 'సన్ ఆఫ్ ఎ బిచ్! బాస్టర్డ్! పిస్ ఎట్ హిస్ ఫేస్" అని గొణుక్కున్నారు

వాళ్ళు తమని తిడుతున్నారని గ్రహించిన మురికిపిల్లలు కూడా తెలుగు పంచాంగం' విప్పారు

పరిస్థితి విషమిస్తున్నట్టు గ్రహించిన మురికి లీడర్ తనవాళ్ళని ఆడుకోమని చెప్పి కాన్వెంట్ లీడర్ వైపు తిరిగి 'ఆడుకుంటే మాతో కలిసి ఆడుకోండి లేకపోతే మీరే పొండి' అన్నాడు దర్పంగా

కాన్వెంట్ పిల్లలు కాసేపు తర్జనభర్జనపడి వెనకంజ వేసారు భూషణం వాళ్ళని పిలిచి తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు

మింగడాన్కి మెతుకులేని వెధవలకు ఎంత పొగరు! వాళ్ళ బాబుసొమ్ములాగ! పంది వెధవలు!" సీటుగా కూర్చుని కసిగా అన్నాడొకడు

కాన్వెంట్ పిల్లలంటే అందరికీ ముద్దే లాలిస్తారు, పొగుడుతారు, గౌరవిస్తారు అలాంటిది ఒక వెధవ తమ స్థాయిని గౌరవించకుండా పొమ్మంటాడా?! అని వాళ్ళ గుండెలు కుతకుత వుడికిపోతున్నాయి.




'వాళ్ళని తన్ని తగిలెయ్యలేకపోయారా?" నవ్వుతూ అడిగాడు భూషణం.

"తన్నేసేవాళ్ళమే.., కాని వాళ్ళు తిరగబడితే . బట్టలు మాసిపోతాయని . అని నసిగాడు ఒకబ్బాయి

కాసేపు తిట్టుకుని ... తర్వాత కబుర్లలో పడ్డారు

ఇంత చిన్న పిల్లలు అంత చక్కగా ఇంగ్లీషులో మాట్లాడతోంటే చూడడాన్కి ముచ్చటగా వుంటుంది. ఎమ్మేలు కూడా చకచక యింగ్లీషు మాట్లాడలేని రోజులివి. ఆ రోజుల్లో – పదిహేనేళ్ళ క్రితం – కాన్వెంట్‌లో ఆరోక్లాసు చదువుతున్న కొడుకు రోహిత్ – గలగలా యింగ్లీషు మాట్లాడుతోంటే విని మురిసిపోయినవాడే – భూషణం

కాని యిప్పు డీ పిల్లలు యింగ్లీషు విని ఆయన మనసు మురిసిపోలేదు! మూలిగింది!

పిల్లల సంభాషణ అటుతిరిగి, యిటుతిరిగి బడి పంతుళ్ళమీదకు మళ్ళింది

కాన్వెంట్ టీచర్స్ దర్జాగా, ఠీవిగా వుంటారట వాళ్ళ కన్నీ తెలుసట కాని మునిసిపల్ బడి పంతుళ్ళు బెగ్గర్స్ లాగ వుంటారట. అసలు పాఠాలు చెప్పరట

వాళ్ళ కేమైనా తెలిస్తే కదా, చెప్పడాన్కి!

మా పక్కింటి పంతులు – సన్నాఫ్ ఎ బిచ్ – వాడికి ఫీవర్ స్పెల్లింగ్ రాదు!"

"మన ప్రక్కనున్న ముసలోడు కూడా బడి పంతులేకాబోలు! మెల్లగా మాట్లాడు!

పిల్లలు భూషణం వైపు చూసారు అనుమానంగా. ఆయన నిర్జీవంగా నవ్వేసి డోంట్‌వర్రీ! ఐయామ్ నాట్ టీచర్! గో ఆన్' అన్నాడు

వాళ్ళు గలగలా పవ్వేశారు

'విద్య యొసగును వినయంబు, వినయంబు వలన పాత్రత. ." చిన్నప్పుడు నేర్చుకున్న సూక్తి జ్ఞాపకం వచ్చి విరక్తిగా నవ్వుకున్నాడు భూషణం

కబుర్లు చెప్పుకుని కాన్వెంట్ పిల్లలు వెళ్ళిపోయాక మురికి పిల్లలు ఆట చాలించి భూషణం వద్దకు వచ్చారు వాళ్ళకి తన ప్రక్కన చోటు యివ్వాలనిపించలేదు భూషణానికి. అయినా వాళ్ళు వచ్చి కూర్చున్నారు. గుండెల్లో పొంగుకు వచ్చిన అసహ్యాన్ని అణచుకుని భూషణం లీడర్‌ని అడిగాడు "రోజూ మీరే ఆడుకుంటున్నారు కదా! ఈ ఒక్కసారి వాళ్ళని ఆడుకోనిస్తేనేం?'

వాళ్ళంతా గుర్రుగా ఆయనవైపు చూశారు

'మాతో ఆడుకోమంటే వాళ్ళ కెందుకంత నిక్కు"

"వాళ్ళ గొప్పేమిటి?"

"వాళ్ళకి డబ్బుంది కాబట్టి మంచి బట్టలేసుకుని

మంచి స్కూలు కెళుతున్నారు. మాకు డబ్బుంటే మేమూ అలాగే వుండేవాళ్ళం "

"లంచాలు కొట్టి సంపాదించిన డబ్బురా అది!"

పిల్లా పిడుగులు దడదడ వడగళ్ళవాన కురిపించేశారు! భూషణం తల తిరిగిపోయింది వాళ్ళు చెప్పిందతా నిజమే!

"కొత్త గోడలు లేస్తున్నాయ్!"

ఎవరో అంటున్నట్టు వినిపించి అటు చూశాడు భూషణం

సుబ్బారావు!

అతడూ, భూషణం – ఒకే ఊళ్ళో, ఒకే ఆఫీసులో చాలాకాలం పనిచేశారు ఇద్దరి హోదాల్లో ఒకే ఒక మెట్టు తేడా సుబ్బారావు రికార్డ్ అసిస్టెంట్‌గా వున్నప్పుడు – భూషణం ఎల్‌డీసీ

భూషణం యూడీసీ కాగానే సుబ్బారావు ఎల్‌డీసీ అయాడు

భూషణం సూపరింటెండెంట్‌గా మరో ఊరు వెళ్ళిపోగానే సుబ్బారావు యూడీసీ అయాడు ఇద్దరూ రెండేళ్ళ క్రితమే రిటైర్ అయారు చివరి వరకూ ఒక మెట్టు తేడా అలాగే వుండిపోయింది!

ఇప్పుడు హఠాత్తుగా సుబ్బారావు యిలా ప్రత్యక్షం అయేసరికి భూషణం కాస్త సంతోషించినా, మరేదో భావం ఆ సంతోషాన్ని మింగేసింది ముఖం ముడుచుకుపోయింది

కొత్త అయన్ని చూసి పిల్లలు బెంచి ఖాళీచేసి వెళ్ళిపోయారు

ఉద్యోగంచేసే రోజుల్లో – సార్ – అంటూ ఎదురుగా నిల్చునే సుబ్బారా విప్పుడు భూషణం ప్రక్కనే కూర్చుని –

ఐదేళ్ళయింది కాబోలు మనం కలుసుకుని! జ్ఞాపకం వున్నానా?' అని అడిగాడు

లేకేం?' అన్నాడు భూషణం పొడిగా

మన దేశంలో వున్నన్ని అడ్డుగోడలు మరే దేశంలోనూ వుండవు! కులాల మద్య అడ్డుగోడలు – మతాలమధ్య అడ్డుగోడలు, కలవారి చుట్టూ గోడలు – చదువుకున్న వారి చుట్టూ మరెన్నో గోడలు – అవి చాలనట్టు యిప్పుడు కాన్వెంట్ పిల్లల చుట్టూ కొత్త గోడలు! నిజం చెప్పాలంటే ఈ కొత్త గోడల్ని మనమే – సో కాల్డ్ మేధావి వర్గమే – కాంక్రీటుతో దిట్టంగా కట్టి ఎప్పటికప్పుడు గట్టిపరుస్తున్నాం" ఆవేశంగా అన్న సుబ్బారావు–

అయన ముఖంలోని చిరాకు గ్రహించి చటుక్కున లేచాడు

"మీకంటే ఒక మెట్టు కిందివాడ్ని! మీ ప్రక్కన కూర్చున్నందుకు మీకు కోపం వచ్చినట్టుంది రిటైర్ అయాక అంతా సమానమే అనుకుని పొరపడ్డాను! సారీ!"

అనేసి వెనక్కి చూడకుండా చకచకా వెళ్ళిపోయాడు

దటీస్ సుబ్బారావ్!

అతని తీరే అంత ఏమి మారలేదు

వెళ్ళిపోతున్న అతని వైపే చూస్తూ ఆఫీసు రోజుల్లోకి జారిపోయాడు భూషణం

సుబ్బారావుకి రూల్స్ అన్నీ తెలుసు. లంచం మింగి రూల్‌కి వ్యతిరేకంగా నిర్ణయాలు తీసుకునే ఆఫీసర్లకు అత డొక కొరకరాని కొయ్య మింగుడు పడని పచ్చి వెలక్కాయ!

అనేక సందర్భాలలో భూషణంతో కూడా ఘర్షణ పెంచుకున్నాడు

అయితే అతను పని పెండింగ్ వుంచడు నీటుగా చేసుకుపోతాడు అందుకని అతని మీద చర్య తీసుకుందామన్నా కుదరక – నూరిన కారాలూ, మిరియాలూ దిగమింగి వూరుకునేవారు ఆఫీసర్లు

ఈ సమాజంలో ఏ స్థాయి వుద్యోగి ఆ స్థాయివాడితోనే క్లోజ్‌గా వుంటాడుగాని కిందిస్థాయివాడితో కలవడు

సుబ్బారావు మాత్రం అలా కాదు అందరితో కలిసేవాడు అరమరికలు లేకుండా అందరితో ఆప్యాయంగా మాట్లాడేవాడు

తను ఒక్కడే బాగుపడి మేడ కట్టుకోడాన్కి వుపయోగపడేది నిజంగా చదువు కాదు, స్వార్ధం!

తను బాగుపడి తనతోబాటు నలుగురినీ ముందుకు తీసుకుపోవడాన్కి వుపయోగపడేదే నిజమైన చదువు!

చదువు – మనుషుల్ని కలపాలి మనసుల మధ్య మమతల వంతెన వేయాలి

# వడదెబ్బకి విరుగుడు

వేసవిలో వడదెబ్బ తగలకుండా ఉండటానికి సేవించ వలసిన వాటిలో సర్వోత్తమ మైంది వడపప్పు– పానకం

పెసల పప్పులు నీళ్ళలో నానబోసి, మెత్తబడిన తర్వాత వడబోసి వారడం వలన దీనికి వడపప్పు అని పేరేర్పడి యుండవచ్చును. బెల్లాన్ని నీళ్ళతో కలిపితే పానక మౌతుంది ఇవి రెండూ గూడా వడ దెబ్బ తగల కుండా ఉండడానికీ, శరీరంలో వేడి తగ్గడానికీ ఉత్తమ సాధనాలు పెసలతో పచ్చగా ఉండే పెసర పప్పైతే మరీ శ్రేష్ఠమైంది ఈ వడపప్పులో పచ్చి కొబ్బరి తురుము, కొంచెం పంచదార గూడా కలిపితే చక్కటి చలవ చేసే ఆహార పదార్థ మౌతుంది పుష్టికర మైన ఆహారం గూడాను

పానకాన్ని గూడా పాత బెల్లంతో తయారు చేసుకొన్నట్లయితే చాలా మంచిది

నీరు మజ్జిగ కూడా– పెరుగును చిలికి వెన్నను తీయకుండా– నీరుతో కలిపి తయారు చేసిం దైతేనే మంచి చలవ చేసే పానీయ మౌతుంది వెన్నను తీసేస్తే ఆ మజ్జిగకు చలవ చేసే గుణం ఉండదు

మండే ఎండల్లోనే మామిడికాయలు వస్తాయి వీటిని ఉప్పు, మిరప్పొడి కలిపి తింటే మహా రుచిగానే యుంటుంది– ఇంకా ఇంకా తినాలి అనిపిస్తుంది గానీ దీన్ని తినడం నిప్పును తినడమే ఔతుంది

అదే పులుపు వాసన గూడా లేని బాగా పండిన మామిడిపండైతే చలవ చేస్తుంది బంగినపల్లి లాంటి మేలు జాతి పండ్లైతే మరీ మంచివి

భోజనంలో గూడా కందిపప్పుకు బదులు పెసర పప్పుతో తయారైన వంటకాలను వాడడం మంచిది

పాలు, నెయ్యి, పంచదార, అరటి పండ్లు పనస తొనలు, ద్రాక్షపండ్లు (ఎండు ద్రాక్ష మరీ మంచిది), ఖర్జూరపు పండ్లు, ఖర్జూరపు కాయలు, పుచ్చకాయ, దోసపండ్లు, సపోటా పండ్లు, కర్బూజా పండ్లు, దానిమ్మపండ్లు వీనిని గూడా విరివిగా వాడుతుంటే వేసవితాపం నుండి తేలికగా తప్పించుకో వచ్చు

తరవాణి లేక చద్దినీళ్ళు కూడా గ్రీష్మతాపాన్ని హరించడానికి బీదలకు అందుబాటులో ఉండే




సాటిలేని పానీయ మౌతుంది

ప్రైవేవీ సమకూర్చుకోలేని వారు ద్రాక్షాది చూర్ణం, యష్టి చూర్ణం ఈ రెండింటిని సమంగా కలిపి ఉంచుకుని 2–4 గ్రా పొడిని గ్లాసు కాచినపాలతో కలిపి రెండు పూటలా సేవించ వచ్చును ఇవి "ఇంప్ కాప్స్ లో దొరుకుతాయి

ఆయుర్వేద శిరోమణి, రాజరాజేశ్వర శర్మ

# కొత్తగోడలు లేస్తున్నాయ్

కాని యిప్పుడు జరుగుతున్నదేమిటి?

విద్యావంతులు తమ బాగు తాము చూసుకుంటున్నారు. అలగాజనం నుండి దూరంగా పారిపోతున్నారు. వాళ్ళని అసహ్యించుకుంటున్నారు. 'ఈనాటి చదువులు మనుష్యుల్ని దూరం చేస్తున్నాయి! కాన్వెంట్ చదువులు మరీనూ

అలా వుంటాయి అతని భావాలు

అందుకని అతనిమీద నక్సలైట్ అని ముద్రవేసి వేధించడాన్కి ప్రయత్నాలూ జరిగాయి కాని ఫలించలేదు

కాన్వెంట్ చదువులు అందంగా తిట్టుకోడాన్కి తప్ప మరెందుకూ పనికిరావని అతని అమూల్య అభిప్రాయం

భూషణం దంపతులు తమ అబ్బాయి రోహిత్‌ని




కాన్వెంట్‌లో చేర్పించి మమ్మీ, డాడీ అని పిలిపించుకునే అదృష్టానికి నోచుకుంటే – సుబ్బారావు దంపతులు తమ అబ్బాయి వెంకట్రావుని మునిసిపల్ స్కూలులోనే చేర్పించి కేవలం అమ్మ, నాన్నలుగానే వుండిపోయారు!

అయితే తమాషా ఏమంటే –

పదోక్లాసు పరీక్షల్లో – రాష్ట్రం మొత్తంమీద వెంకట్రావుకి ఎనిమిదో రాంక్ వస్తే – రోహిత్ పేరు మొదటి పది రాంక్‌లలో ఎక్కడాలేదు!

ఎక్కడో ఘోరమైన అన్యాయం జరిగిపోయినట్టు బాధపడిపోయాడు భూషణం

అయితే ఆ తర్వాత ఇంటర్, ఎంట్రన్స్ పరీక్షల్లో కూడా రోహిత్ వెంకట్రావు కంటి వెనకబడిపోయాడు

సుబ్బారావుకి లాగే దేవుడిక్కూడా కాన్వెంట్ కుర్రాళ్ళంటే పడదుకాబోలు!

వెంకట్రావు ప్రభుత్వ ఇంజనీరింగ్ కాలేజీలో సీటు సులభంగానే సంపాదించుకుంటే రోహిత్ – డొనేషన్ మెడికల్‌కాలేజీలో చేరాడు!

* * *

ఒక్కసారిగా గుప్పుమన్న లిట్రిన్ – భూషణాన్ని ఈ లోకంలో పడేసింది

టైమ్ చూసుకున్నాడు . ఏడున్నర!

చటుక్కున లేచి యింటికి బయలుదేరాడు భూషణం

రెండంతస్తుల మేడలో – కింద నర్సింగ్‌హోం, పైన కాపురం ప్రక్క మెట్లమీదుగా పైకి వెళ్ళాడు భూషణం కోడలు లేదుకాబోలు తాళం పెట్టివుంది కిందకు దిగి నర్సింగ్‌హోంలోకి వెళ్ళాడు

రోహిత్ ఒక్కడే వున్నాడు పేషంట్ లెవరూలేరు

తండ్రిని చూస్తూనే టేబుల్ మీదున్న తాళంచెవి తీసి యిచ్చాడు రోహిత్

కొడుకు మాట్లాడలేదు తండ్రీ మాట్లాడలేదు

నీరసంగా మెట్లెక్కి తాళం తీసి భారంగా లోనికి వెళ్ళాడు భూషణం ఈమధ్య యింటిలో అడుగుపెడితేచాలు – గట్టునపడ్డ చేపలాగ విలవిలలాడిపోతోంది అయిన మనసు

రెండేళ్ళ క్రితమే భార్య చనిపోయింది లక్ష రూపాయల కట్నం తెచ్చిన కోడలు ఆయనతో లక్షణంగా మాట్లాడదు కొడుకు అంతంతమాత్రమే రోజుకి నాలుగు ముక్కలు మాట్లాడితే – అదే గొప్ప!

అంత యింటిలో భూషణం ఒంటరివాడు!

ఇంటి పరిస్థితి – అదో విచిత్రం!

ప్రభుత్వ ఉద్యోగంకోసం కొంతకాలం ఎదురుచూసి, లక్ష రూపాయిలు లోన్ తసుకుని ప్రైవేటు ప్రాక్టీసు ప్రారంభించాడు రోహిత్

అందమైన పరిసరాల్లో ఖరీదైన గాలిపీల్చుతూ చదువుకున్న రోహిత్‌కి అందమైన ఖరీదైన మనుషులతోనే ఆనందంగా హాయిగా వుంటుంది

కాని అతనికి అందమైన ఖరీదైన పేషంట్‌లు దొరకనేలేదు అతనివద్దకు వచ్చేవాళ్ళంతా బీదా బిక్కీ టీచర్లు, గుమాస్తాలూ!

అలాంటివాళ్ళతో మాట్లాడ్డమే చిరాకు అతనికి

ఆత్మీయంగా మాట్లాడని డాక్టర్ వద్ద కెవరొస్తారు?

అతని ప్రాక్టీస్ ఎదుగూబొదుగూ లేకుండా అలాగే వుండిపోయింది ఇంటి అద్దె లోన్ బాపతు వడ్డీ చెల్లించేసరికే తలప్రాణం తోకకి వస్తోంది

విద్యార్థిగా జేజేలు అందుకున్న అతనికి డాక్టర్‌గా ఊరు, పేరూలేదు!! ఎంత బాధాకరం!

ఆ బాధతో అతడు భార్యతో కూడా మాట్లాడ్డం తగ్గించేశాడు

మరో అరగంట గడివాక – రోహిత్ నర్సింగ్‌హోం మూసేసి మేడమీదకు వచ్చాడు.

తండ్రి వడ్డించాడు

ఇద్దరూ మౌనంగా భోజనం చేశారు

ఆ రాత్రి భూషణానికి నిద్రపట్టలేదు

ఇంటిలో వున్నది ముగ్గురే అయినా ఎవరికీ ఆనందంలేదు ఉత్సాహంలేదు మౌనరాజ్యంలో శాపగ్రస్తుల్లాగ దినాలు దొర్లించేస్తున్నారు

జీవితం ఎందు కిలా మారింది? ఎందుకు? తన బాధ్యత ఎంత?

రాత్రంతా అవే ఆలోచనలు ఆయనకు

* * *

మర్నాడు సాయంకాలం –

పార్కులో సుబ్బారావు కనిపించగానే ఆత్మీయంగా ఆహ్వానించి తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు భూషణం

పిల్లలు మామూలుగానే గోలగా జారుడుబల్ల వద్ద ఆడుకుంటున్నారు కాని యిప్పు డాయన కా గోల కాకిగోల లాగ లేదు

తన కష్టసుఖాలు చాలా ఫ్రీగా సుబ్బారావుకి చెప్పుకున్నాడు

అంతా విని, దీర్ఘంగా నిట్టూర్చి 'ఒకవిదంగా తప్పు మిదే భూషణంగారూ! అన్నాడు సుబ్బారావు

"నాదా?"

'మీది! మీలాంటి పెద్దలది! అని మాటలు పేర్చుకుంటున్నవాడిలా కాసేపు ఆగి –

నేను మీ కంటి ఒక మెట్టు కిందివాడ్ని అందుకని నేను చేతులుకట్టుకొని మీ ఎదుట నిలబడాలని మీ వుద్దేశం రిటైర్ అయిన తర్వాత కూడా మీ కా బావం పోలేదు సంఘం ఏడంతస్తుల మేడ లాంటిది భూషణంగారూ! మీ తలి దండ్రులు మీకు మూడో అంతస్తు యిచ్చారు మీ చూపు ఎప్పుడూ పై అంతస్తులమీదనే కాని కింది అంతస్తులు మీకు కనిపించవు కనిపించినా – కిందివాళ్ళతో మీరు కలవలేరు కాన్వెంట్‌లమీద నా విమర్శ ఒక్కటే

అక్కడ వాళ్ళందరిదీ ఒకే స్థాయి ఒకే అంతస్తులో చిక్కుకుంటారు వాళ్ళు వాళ్ళ చూపూ పైకే వుంటుంది కింది అంతస్తులున్నాయనిగాని, అక్కడున్నదీ మనుషులే అనిగానీ వాళ్ళకు తెలియదు అత్యున్నత అధికారితో తడబడకుండా మాట్లాడ్డం ఎంత అవసరమో, అట్టడుగు మనిషితో ఆప్యాయంగా మాట్లాడ్డమూ అంతే అవసరం భారత ప్రథమపౌరుడితోనూ, అధమ పౌరుడితోనూ ఒకేవిధంగా మాట్లాడ్డం నేర్పేదే ఉత్తమవిద్య! అదే ఉత్తమ వ్యక్తిత్వం! పాఠశాలలు కానీ, కాన్వెంట్‌లు కానీ – పిల్లలకు చదువు చెబుతున్నాయిగాని – వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దలేకపోతున్నాయి ఆ పనిని – కనీసం యింటిలో తలిదండ్రులైనా చేయాలి కాని వాళ్ళా పని చేయరు కాన్వెంట్‌కి పంపుతున్నాంకదా, వాళ్ళే అంతా చూసుకుంటారు – అనుకుంటారు మూడో అంతస్తులో పెరిగిన మీరు కొడుకుని నాలుగో అంతస్తులో పెంచారు! నాలుగో అంతస్తు కోసమే తెచ్చుకున్నారు మీకు కింది అంతస్తులు కనిపించనట్టే – వాళ్ళకి మీ రున్న మూడో అంతస్తు కనిపించకపోవడం సహజమే కదా!

సుదీర్ఘ ఉపన్యాసం యిచ్చి అలసిపోయినట్టు ఆగిపోయాడు సుబ్బారావు గుండెనిండా గాలి పీల్చుకుని చుట్టూ చూశాడు

భూషణం గుండె గదులు తెరుచుకొని లోనికి వెలుగు ప్రసరించినట్లు అయింది ఆలోచిస్తూ గంభీరంగా వుండిపోయాడు

ఈసారి మళ్ళీ కాన్వెంట్ పిల్లలొచ్చారు – జారుడు బల్ల వద్దకు

మళ్ళీ వాదోపవాదాలు

సుబ్బారావు చూస్తూ వూరుకోలేదు వాళ్ళవద్దకు వెళ్ళి సర్దిచెప్పాడు వాళ్ళేమీ మాట్లాడలేదుగాని ముఖాలు మాత్రం గంభీరంగాపెట్టుకున్నారు

సుబ్బారావు చటుక్కున నిచ్చెన ఎక్కి బల్లమీదగా జారిపడ్డాడు కాలు బెణికిందికాబోలు – కుంటుతున్నాడు

పిల్లలంతా ఘొల్లున నవ్వేశారు

అంతే సుబ్బారావు కుంటి నటన మానేసి రిఫరీ అయి కూర్చున్నాడు పిల్లలందర్నీ లైన్‌లో నిలబెట్టి తను పిలిచినవారు మాత్రమే వచ్చి జారమని ఆదేశించాడు

తరతమ భేదాల్ని మరపించే మహత్తు ఆటల్లోవుంది

కొద్దిసేపు సుబ్బారావు ఆధ్వర్యంలో ఆడుకున్న పిల్లలు తర్వాత విభేదాలు విస్మరించి అంతా కలిసి హాయిగా ఆడుకుంటూవుంటే –

సుబ్బారావు నెమ్మదిగా జారుకుని భూషణం వద్దకు వచ్చేశాడు

అడ్డుగోడల్ని కూలగొట్టడమే మన కర్తవ్యం అన్నాడు చిన్నగా నవ్వేస్తూ □




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

### సి. హెచ్. నాగభూషణం, గుంటూరు

ప్ర: యలర్జీ వల్ల శరీరమంతా దద్దుర్లు, దురద

జ: ముందుగా విరేచనమునకు ఔషధము సేవించండి బైద్యనాథ్ శతపిత్త భంజనిరస, బైద్యనాథ్ సురక్షా ప్రాంగ్‌తో ఉదయం సాయంత్రం సేవిస్తూ శరీరము పైకి బైద్యనాథ్ మహా మంచాది తైలము రాయండి.

### ఐ. ఎస్. శర్మ, బొబ్బిలి

ప్ర: నాకు ఎప్పుడూ జలుబు ఉంటుంది జుట్టు రాలిపోతున్నది

జ బైద్యనాథ్ శ్వాస కుఠారం మాత్ర ఒకటి బైద్యనాథ్ మహాలక్ష్మి విలాసరస ఒక మాత్ర ఉదయం సాయంత్రం, బైద్యనాథ్ దశమూలారిష్టతో కొంత కాలం సేవించండి బైద్యనాథ్ దశమూల తేల్ ముక్కులో రెండు చుక్కల చొప్పున నశ్యముగా వేయండి

### వి. తిరుమలరావు, వుయ్యూరు

ప్ర గుండెల్లో నొప్పి, అజీర్ణము, మూత్రము సాఫీగా అగుటకు

జ తేలిక ఆహారము తీసికొనుట మంచిది వేడి చేసే పదార్థములు అసలు వాడవద్దు దురలవాటులు ఏమయినా ఉంటే మానివేయండి బైద్యనాథ్ విటా- ఎక్స్ 2 మాత్రల చొప్పున ఉదయం సాయంత్రం పాలతో సేవిస్తూ బైద్యనాథ్ అర్జునారిష్ట భోజనం తరువాత రోజూ రెండు సార్లు తీసుకోండి

### ఎస్. కృష్ణ, రామవరం

ప్ర 1986లో కామెర్లు వచ్చి తగ్గిన తరువాత ఇప్పుడు బలహీనత శీఘ్ర స్ఖలనము

జ బైద్యనాథ్ విటా ఎక్స్ 1 మాత్ర, బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ 1 చెంచా ఉదయం సాయంత్రం పాలతో సేవిస్తూ భోజనం తరువాత రోజుకు రెండుసార్లు బైద్యనాథ్ కుమార్యాసవ తీసుకోండి

### వెంకటగిరి (20 సం.లు), యస్. వి. పురం (అనంతపురం)

ప్ర దురలవాటుచే, హస్త ప్రయోగం, శక్తిహీనత

జ బైద్యనాథ్ విటా- ఎక్స్ మాత్రలు 2 చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్‌తో, పాలతో సేవించండి మంచి బలమైన ఆహారము తీసుకొంటూ, దురాలోచనలు, దుర్ వ్యసనముల జోలికి పోవద్దు

### యల్. ఓం ప్రకాష్ (వయస్సు 22 సం.లు), హైదరాబాద్

ప్ర జ్ఞాపకశక్తి లేదు, ఔషధము, వాడు విధానము

జ బైద్యనాథ్ బ్రెయిన్ టాబ్‌లెట్లు ఉదయం సాయంత్రం 2 మాత్రల చొప్పున బైద్యనాథ్ శంఖపుష్పి సిరప్‌తో సేవించండి తల నూనెగా మర్దనకు బైద్యనాథ్ బ్రాహ్మీతేల్ వాడండి

### కె. యస్. జయలక్ష్మి (వయస్సు 35 సం.లు), కందుకూరు

ప్ర. తుమ్ములు, ముక్కువెంట నీళ్ళు కారటం, తల నొప్పి, కళ్ళు మంటలు, గొంతులో కఫము.

జ తేలిక అయిన ఆహారం తీసుకోవాలి. భోజనం చేయగానే నిద్రించ వద్దు మలబద్ధకము లేకుండా చూసుకోవాలి పెరుగు, దుంపలు తగ్గించాలి.

ఔషధములు – బైద్యనాథ్ శ్వాసకల్ప ఉదయం సాయంత్రం 1 మాత్ర చొప్పున బైద్యనాథ్ కాసామృతతో లోనికి సేవించండి విడిగా బైద్యనాథ్ కాసామృత మరియొకసారి తీసుకొన వచ్చు. బైద్యనాథ్ చ్యవనప్రాశస్పెషల్ పాలతో సేవించండి

### బి. కె. రాజు, ఒంగోలు

ప్ర రాత్రులందు కాళ్ళు నొప్పులు, వళ్ళు ఎప్పుడూ వేడిగా ఉంటుంది

జ రాత్రులందు ఎక్కువగా మేలుకొని ఉండవద్దు వేడి చేసే పదార్థములు వాడవద్దు విశ్రాంతి అవుసరము మలబద్ధకము లేకుండా చూసుకోండి

ఔషధములు:- బైద్యనాథ్ కామదుధారస, బైద్యనాథ్ గుల్‌కందతో సేవిస్తూ బైద్యనాథ్ శంఖపుష్పి సిరప్ వాడండి కారము, పులుపు తగ్గించండి మజ్జిగ, పండ్ల రసములు ఎక్కువగా వాడండి

### సుశీల (వయస్సు 30 సం.లు), ఔరంగాబాదు

ప్ర శరీరమంతా దురద మొహము మీద మొటిమలు ఆకలి లేకపోవటము.

జ బైద్యనాథ్ రక్తశోధక టాబ్‌లెట్ ఉదయం సాయంత్రం 1 మాత్ర చొప్పున, బైద్యనాథ్ సురక్షా ప్రాంగు 2 చెంచాలు మందు, రెండు చెంచాలు నీరు కలిపి రోజుకు రెండుసార్లు లోనికి వాడండి కారము, పులుపు తగ్గించండి వేసవిలో ఎండలో ఎక్కువగా తిరగవద్దు బైద్యనాథ్ శంఖపుష్పి సిరప్ తీసుకొంటే వేడి తగ్గి ఉల్లాసముగా ఉంటుంది

### బి. నరసింహారెడ్డి (వయస్సు 52 సం.లు), నెల్లూరు.

ప్ర 4 సంవత్సరముల నుండి అతిమూత్రము, కొంచెముగా సుగర్ ఉన్నది. కొంచెముగా అలసట, ఎక్కువగా శ్రమ

జ మూత్రములో షుగర్ కనిపించినచో బైద్యనాథ్ మధుమేహారి యోగి రోజు ఒక మాత్ర నేరేడు గింజల కషాయంతో సేవించండి బైద్యనాథ్ బసంత కుసుమాకర రస రోజు ఒక మాత్ర పాలతో సేవించినచో అలసట, నిస్త్రాణ తగ్గి అతి మూత్రము తగ్గి, షుగరు కూడా లేకుండా పోవును పగటి నిద్ర మంచిది కాదు □

---




కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న : ...............................................

...............................................

...............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# కొత్త సెరిలాక్ ఆరంజ్




## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్ మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది

మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే అతనికి సెరిలాక్ లాభాలన్నింటిని యిస్తూనే ఉన్నారన్న మాట–ప్రతి సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి చక్కటి రుచి క్షణాలలో తయారు కావడం

కాబట్టి పాలు త్రాగించడంతోబాటు 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్ 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి–మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు

పరిశుభ్రంగా తయారు చేయడానికి మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకుగాను దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి







R K SWAMY/FSL/4974 TEL

# విచిత్ర యదార్థ గాథలు

పులిగడ్డ విశ్వనాథరావు

మర్నాడు ఉదయం లాల్‌చంద్ ఇంటిలో మరొక హత్య జరిగినట్టు రామ్‌లాల్‌కు కబురు అందింది. రామ్‌లాల్ వెంటనే లాల్‌చంద్ ఇంటికి వెళ్ళి దర్యాప్తు జరిపి శవాన్ని శవ. పరీక్షకు పంపాడు. ఈ సారి లాల్‌చంద్ మూడవ కొడుకు సురేష్ హత్య చేయబడ్డాడు. ఇంటి బైట ఇద్దరు పోలీసులు కాపలా ఉన్నా హంతకుడు తన పని సాధించుకుని అదృశ్యమయాడు. గది ద్వారం, దానికి దగ్గరగా ఉన్న కిటికీలో నుంచి గడియలు వేసి ఉన్నాయి. రెండవ వైపు ఒక కిటికి గది నేల నుంచి ఇరవై అడుగుల ఎత్తున ఉంది. కిటికీ బైట ఒక టిన్ను కాలువ గొట్టం ఉంది. దాని ద్వారా ఈ కిటికీ గుండా లోనికి ప్రవేశించడం ఎవరికైనా దుస్సాధ్యం. ఈ కిటికీ సురేష్ లోనుంచి వేసి ఉంచేవాడు కాదు. ఈ కిటికీ గుండా ఎవరూ గదిలోకి ప్రవేశించగలరని అతడికి కూడా అనిపించ లేదు కాబోలు. ఐతే హంతకుడు ఎక్కి కిటికీ గుండా గదిలోకి ప్రవేశించి 20 అడుగుల ఎత్తు నుంచి గది నేల పైకి దూకి సురేష్‌ని హత్య చేసినట్టు స్పష్టమవుతోంది. సురేష్ మృతదేహం నరేష్ మృతదేహం లాగే పడి ఉంది. సురేష్ కళ్ళు భయభ్రాంతులతో విప్పారి ఉన్నాయి. జుత్తు చింపిరిగా ఉంది. చాకుతో గొంతు కోసినట్టు ఉంది. బైట పోలీసుల కళ్ళబడకుండా తప్పించుకుని, కాలువ గొట్టం ఎక్కి కిటికీ గుండా ప్రవేశించి ఇరవై అడుగుల ఎత్తు నుంచి దూకి ఒక దృఢకాయుడైన యువకుణ్ణి హతమార్చడం ఒక ఆడమనిషి చేయగలిగే పని కాదని స్పష్టమవుతోంది. రామ్‌లాల్ మామ్‌చంద్, అతడి కొడుకుల్ని అరెస్టు చేశాడు, లేకపోతే వాళ్ళ ప్రాణాలకే ముప్పు వాటిల్లవచ్చు.

ఈలోగా రామ్‌లాల్ చుట్టుప్రక్క ప్రదేశాల్లో చదువుకున్న వాళ్ళ సంతకాలు సేకరించాడు. అవి ముప్పై మాత్రమే పోగయాయి. అనగా అంత మందికే అక్కడ చదువువచ్చునన్న మాట. ఆ సంతకాలను ఆకాశరామన్న ఉత్తరాలతో పోల్చి చూశాడు కాని ఒక్క సంతకమూ వాటిలో దస్తూరీతో కలియలేదు.

(గత సంచిక తరువాయి)

విజయపుర్ పోస్టుమాస్టర్ని పిలిచి అక్కడ తనపేర పోస్టుఅయ్యే ఉత్తరాల్ని, వాటిని పోస్టు చేస్తున్న మనుషులపైనా నిఘా వేసివుంచమని కోరాడు.

విజయపుర్ పోస్టుమాస్టరు ఒకరోజు ఒక పసుపు పచ్చని ఉత్తరం తీసుకొచ్చి రామ్‌లాల్‌కి అందించి అది పోస్టు చేసిన మనిషి దొరకలేదని చెప్పాడు. అది విప్పిచూడగా లోపల ఒక పేజీపై వంకరటింకర అక్షరాల్లో "దసరాముందు లాల్‌చంద్ ఆఖరి కొడుకు రాజేష్ ఆయువు మూడుతుంది" అని రాసివుంది. రామ్‌లాల్ వెంటనే లాల్‌చంద్ యింటి చుట్టు పదిహేనుమంది పోలీసుల్ని కాపలాపెట్టాడు.

సురేష్ హత్య జరిగిన రోజు ప్రమీల భర్త రంగా గ్రామంలోనే వున్నట్టు తెలిసింది. రామ్‌లాల్ వెంటనే అతణ్ణి అరెస్టు చేశాడు. అతణ్ణి ఎంత కొట్టినా, బెదిరించినా ఏమీ వెళ్ళగ్రక్క లేదు. తుదకు రామ్‌లాల్ విసిగి అతణ్ణి యాతన పెట్టడం ఆపించాడు.

మర్నాడు దసరా, ఇంతవరకు ఏ ప్రమాదం జరుగలేదని రామ్‌లాల్ లాల్‌చంద్ యింటి చుట్టు భద్రతా ఏర్పాట్లను తనిఖీచేసి సంతృప్తి చెంది పోలీసు స్టేషనుకు తిరిగి వచ్చాడు. రాత్రి పన్నెండు అయింది. హఠాత్తుగా ఏ. ఎస్. ఐ. ఇందర్‌సింగ్ స్టేషనులోకి వచ్చి, లాల్‌చంద్ యింటిలో తుపాకీ కాల్పులు జరిగాయని, ఒక హత్య జరిగిందనీ చెప్పాడు. రామ్‌లాల్ వెంటనే లాల్‌చంద్ యింటికి వెళ్ళాడు. అక్కడ పశువులశాలలో మంచంపై రాజేష్ చనిపోయి పడివున్నాడు. అతడి గొంతుక నుంచి బొటబొటా రక్తం కారుతోంది. అతడి కుడిచేయి మూడు వేళ్ళు తెగివున్నాయి. ఈసారి హంతకుడు హతుడితో పోరాడవలసివచ్చినట్టు గుర్తులున్నాయి. హంతకుడు చాకుతో హత్య చేద్దామని చూశాడు. కాని హతుడు ఎదుర్కోవడంవలన అతడి వేళ్ళకు గాయాలు తగిలాయి. హతుడు తన భద్రత కోసం తలవద్ద తుపాకీ వుంచుకుని పడుకునేవాడు. హంతకుడు ఈ తుపాకీని కైవసంచేసుకుని పేల్చినట్టువుంది. తొలి గుండు కప్పుని భేదించి దూసుకుపోయింది. కాని రెండవగుండు రాజేష్ గడ్డంగుండా వెళ్ళి తల వెనుకవైపునుంచి బైటకుపోయింది. ఈ గుండువలన రాజేష్ మృతిచెందాడు. హంతకుడు మెరుపులాంటి మనిషిలా వున్నాడు. తుపాకీ పేలిన ధ్వని విని యింట్లోవారు పశువులశాలలోకి వచ్చేలోగా అతడు అదృశ్యమయ్యాడు. పారిపోతూ హంతకుడు తుపాకీని గేదెలతొట్టిలో పారవేశాడు. కుడితిలో అది తడియడంవలన దానిపై వేళ్ళ గుర్తులు వుండే అవకాశం లేకుండాపోయింది.

రామ్‌లాల్ పరిసరాలు సోదాచేశాడు. అందర్నీ ప్రశ్నించాడు. పోనీ యింటిలో మనిషి ఈపనిచేశాడా అంటే రాజేష్ తండ్రి లాల్‌చంద్ ఈపనిచేయలేడుగా. అసలె యిద్దరు కొడుకుల్ని పోగొట్టుకున్నాడు. హతుడు అన్న సుభాష్‌చేశాడా అంటే అతడు అప్పుడు కొంతమంది గ్రామస్తులతో కలిసి ఎక్కడో పేకాట ఆడుతున్నట్టు సాక్షులు చెప్పారు. ఇహ మిగిలింది వదినగారు షీలా. ఆమె అప్పుడు నిద్రపోతోందని చెప్పింది. ఐనా ఇటువంటి దారుణమైన పని ఆడమనిషిలా చేయగలదు. రాజేష్ కూడా బలిష్ఠమైన వ్యక్తి. అదీ తుపాకీ పక్కనే పెట్టుకుని పడుకున్నాడు. అతడితో పోరాడి అతన్ని తుపాకీతో హత్య చేయడం బలిష్ఠమైన మొగాడికే వీలుకాకు. అదీగాక ఈ హత్యకూ ఇదివరకు రాజేష్ అన్నల హత్యలకు సంబంధం ఉన్నట్టు ఉంది. టిన్ను పైపు ఎక్కి, కిటికీగుండా గదిలో ప్రవేశించి 20 అడుగుల ఎత్తు నుంచి దూకి హత్య చేయగలగడం ఒక స్త్రీకి సాధ్యం కాదు. మరి ఆ హత్య చేసిన మనిషే ఈ హత్య చేసినట్టు స్పష్టంగా ఉంది. దానికితోడు షీలాకు మరదితో ఏమి వైరం ఉంటుంది? నిస్సందేహంగా ఈ హత్య ఎవరో బైట నుంచి వచ్చి చేసిన పనే. కాని ఇంతమంది పోలీసుల కళ్ళ పడకుండా లోనికి చొరపడగల ఆ మనిషి మామూలు మనిషి కాదు.

రామ్‌లాల్‌కి థ్రిల్ మాట ఎలా వున్నా, తీరా

కోరుకున్న కేసు తగిలాక గొప్ప చిక్కే వచ్చి పడినట్టయింది అతడి మనుషులు పారా ఉండగా రెండు హత్యలు జరిగిపోయాయి ఈ హంతకు డెవడో మానవ మాత్రుడిలా లేడు రాజేష్ శవాన్ని శవ పరీక్షకి పంపించి మిగతా తంతు చూసుకుని పోలీసు స్టేషనుకు తిరిగి వచ్చాడు అతడి మెదడులో ఈ కేసు సంబంధించిన ఆలోచనలే తిరుగుతున్నాయి

ఇంకా రంగా లాకప్‌లోనే ఉన్నాడు అలాగే మామ్‌చంద్, కొడుకులు కూడా లాకప్‌లో ఉన్నారు ఈ మూడు హత్యలు చేసింది ఒక మనిషేనని స్పష్టమయినప్పుడు వీరందరూ హంతకులు కారని రుజువైనట్టే కదా ఎందుకంటే ఈ మూడవ హత్య జరిగినప్పుడు వాళ్ళు లాకప్‌లో ఉన్నారు ఇహ వీళ్ళని విడిచిపెట్టవచ్చునని అనుకుంటూ ఉండగా ప్రమీల తన ఇద్దరి కొడుకులనూ వెంట పెట్టుకుని వచ్చి బిగ్గరగా విలపిస్తూ రంగాను విడిచిపెట్టమని బ్రతిమాలసాగింది

రంగా తాపీ మేస్త్రీ రెక్కాడితే గాని ఆ పూటకు డొక్కాడని మనిషి అతణ్ణి లాకప్‌లో ఉంచితే అతడి కుటుంబం మలమల మాడి చావడం ఖాయం

ఇవన్నీ ఆలోచించి అతణ్ణి విడిచి పెట్టడమే మంచిదని నిర్ణయించుకున్నాడు రామ్‌లాల్ ఇలా ఆతడు అనుకుంటుండగా అతడి దృష్టి ప్రమీల పెద్ద కొడుకు గోవింద్ చేతిలో ఉన్న పుస్తకాలపై పడింది రామ్‌లాల్ ఏదో కరెంట్ షాక్ తిన్నట్టయింది ఆ కుర్రాణ్ణి వాళ్ళ అమ్మ బడి నుంచి నేరుగా పోలీసు స్టేషనుకు తీసుకు వచ్చినట్టుంది పిల్లలను చూసి రామ్‌లాల్ మనసు కరుగుతుందని ఆమె ఉద్దేశం

పుస్తకాలపై ఖాకీ రంగు అట్టలు వేసి ఉన్నాయి వాటిపై 'గోవింద్ అని హిందీలో రాసుంది 'గ' అక్షరంలో గీతలు నేరుగా కాకుండా కెరటాల మాదిరిగా రాసున్నాయి ఈ 'ద' అక్షరం రామ్‌లాల్‌కు ఇదివరకు ఎక్కడో చూసినట్టు గుర్తు వచ్చింది ఔను, ఇటువంటి అక్షరాలు ఆకాశరామన్న ఉత్తరాలలో ఉన్నాయి రామ్‌లాల్ ఆ కుర్రాణ్ణి వేరే గదిలోకి తీసుకెళ్ళి ఆ ఉత్తరాలను బైటకు తీశాడు గోవింద్ వద్ద నుంచి అతడి కాపీలు అడిగి తీసుకుని ఆ ఆకాశరామన్న ఉత్తరాలలో దస్తూరీని, కాపీలలో దస్తూరీని పోల్చి చూశాడు రెండింటి దస్తూరీలు అచ్చంగా ఒకమాదిరిగానే ఉన్నాయి

గోవింద్ నువ్వేనా ఈ ఉత్తరాలు రాసింది?" అని రామ్‌లాల్ గోవింద్‌ని మచ్చికగా అడిగాడు కాని అతడు ఏమీ జవాబు చెప్పలేదు

'నీకేం భయంలేదు, బాబు నిజం చెప్పు మీ నాన్నని వెంటనే విడిచిపెడతాను" అని రామ్‌లాల్

ప్రలోభం చూపాడు కాని గోవింద్ గుడ్లప్పగించి చూస్తూ ఉన్నాడు కాని జవాబు చెప్పలేదు

ఇలా లాభం లేదని రామ్‌లాల్ అతడి చెంప ఛెళ్‌మనిపించాడు దాంతో కుర్రాడు బిగ్గరగా ఏడవసాగాడు అప్పుడు అతడికి ఒక రూపాయి ఇచ్చి ఊరుకోబెట్టాడు కొద్దిసేపు తర్వాత కుర్రాణ్ని మరల ప్రశ్నించాడు అతడు చెప్పిన జవాబు విని రామ్‌లాల్ విస్తుపోయాడు

రామ్‌లాల్ ఏ ఎస్ ఐ ఇందర్‌సింగ్‌ని ప్రమీల, పిల్లల్ని తాను తిరిగి వచ్చేదాకా స్టేషనులో ఉంచమని పురమాయించి బైలుదేరాడు బైలుదేరే ముందు ప్రమీలను షీలా పుట్టినిల్లు గల గ్రామం పేరు, దానికి దారి తెలుసుకున్నాడు గుర్రం మీద స్వారీ అయి బయలుదేరాడు ఆ గ్రామం పేరు షివపురి అక్కడ గ్రామ వాసులను కలుసుకుని షీలా చరిత్రను వివరంగా తెలుసుకున్నాడు

షీలా గ్రామ పెద్ద కూతురు ఆమె పుట్టిన వెంటనే ఆమె తల్లి చనిపోయింది తండ్రి ఆమెను అల్లారు ముద్దుగా పెంచాడు దాంతో ఆమె మొండిఘటంగా తయారయింది దారంట్ల వెళ్ళే వారి టోపీలు, పాగాలు ఊడదీయడం, సందుల్లో పడుకునేవారి మంచాలను తిరగదోసేయడం, ఇళ్ళల్లో దూరి పాలు త్రాగి గిన్నెల్లో మట్టి నింపడం లాంటి అగడాలు చేస్తూ ఉండేది ఆమె మగపిల్లాడిలా గోళీకాయలు, బిళ్ళంగోడీ, లాంటి ఆటలు ఆడేది ఎత్తైన చెట్లపై పిల్లిలా ఎక్కిపోయి పళ్ళు దొంగిలించేది రామకలీ అనే లావుపాటి స్త్రీని తోసేసి ఆమె లేచి నిల్చోడానికి అపసోపాలు పడుతూంటే విరగబడి నవ్వేది ఒకసారి ఆమె మొహానికి ముసుకు కప్పుకుని గ్రామంలో దోపిడి జరిపి నగలు అపహరించింది ఆమె తండ్రికి ఇది తెలిసి బాధపడి ఆమెను నిలదీశాడు కాని ఆమె లొంగే మనిషి అయితేనా మర్నాడు మరింత గగుర్పొడిచే ఆగడం చేసేది

ఇంతలో షీలా మన్మద బాణాలకు గురైంది గ్రామంలో శంకర్ అనే యువకుడికి తన హృదయాన్ని అర్పించింది శంకర్ రామకలీ కొడుకు శంకర్ ఎత్తుగా, విశాలమైన ఛాతీతో చూడ ముచ్చటగా ఉండేవాడు అతడు వస్తాదు ప్రేమలో పడ్డాక షీలాలో మార్పు వచ్చింది ఆమె ఆగడాలకు పగ్గాలు పడ్డాయి రామకలీ పట్ల షీలా వైఖరి మారి పోయింది ఇప్పుడు షీలా ఆమెను ఆదరించడం మొదలెట్టింది ఆమె కోసం పిడకలు చేయడం, వంటలో సాయం చేయడం షీలా దిన చర్య ఐంది

హఠాత్తుగా ఒక రాత్రి రామకలీ ఇల్లు కాలి బూడిదయింది ఇంటిలో రామకలీ, ఆమె కొడుకు శంకర్ కూడా ఉన్నారు వారిరువురూ కూడా మసి అయిపోయారు ఇది జరిగిన ఒక నెలకు షీలా పెళ్ళి లాల్‌చంద్ కొడుకుతో అయింది అగ్ని ప్రమాదం దానంతట అదే జరిగిందా లేక ఎవరైనా చేయించారా అని రామ్‌లాల్‌కు అనుమానం వచ్చి దర్యాప్తు జరిపాడు శంకర్‌తో షీలా ప్రేమ వ్యవహారం కిట్టక ఆమె తండ్రి చేయించ వచ్చుగా కాని అతడు అటువంటి మనిషి కాదు అని తేలింది మరెవరు ఇటువంటి పనిచేయ సమర్థులు?

షీలా, లాల్‌చంద్, అతడి కొడుకులు మాత్రమే ఇటువంటి పనులు చేయగల సమర్థులు అని తెలియ వచ్చింది శంకర్‌ని తుద ముట్టించి, షీలాని లాల్‌చంద్ కొడుకు సుభాష్‌కు చేసుకుంటే బోలెడంత డబ్బు కట్న రూపంగా ఇస్తానని షీలా తండ్రి ఆశ చూపాడట దాంతో వాళ్ళు అంత పనీ చేసి ఉండవచ్చునని అంతా అనుకున్నారు షీలాకు అసలు విషయం ఆమె పెళ్ళి అయ్యాక తెలిసి నట్టుంది దాంతో ఆమె పగబట్టి లాల్‌చంద్, మామ్‌చంద్ కుటుంబాల రహస్యాలను పోలీసులకు తెలియ జేసినది ఆమెకు చదువు రాదు అందుకు గోవింద్ సహాయం తీసుకుంది గోవింద్‌కు డబ్బు ఆశ చూపి అకాశరామన్న ఉత్తరాలు రాయించి విజయ్‌పుర్ నుంచి పోస్టు చేయించేది వీలు చూసుకుని అతి నేర్పుతో, దుస్సాహసంతో లాల్‌చంద్ ముగ్గురు కొడుకులను అనగా తన మరుదలనీ హత మార్చింది ఇహ మిగిలింది లాల్‌చంద్ తన భర్త సుబాష్

వెంటనే రామ్‌లాల్ తిరిగి గుర్నాలా గ్రామం చేరుకుని లాల్‌చంద్ ఇంటి చుట్టు తాను నియమించిన కానిస్టేబుల్స్‌ని అంతా సవ్యంగా ఉందా అని ప్రశ్నించాడు ఈ రాత్రి కూడా షీలా ఏదో అఘాయిత్యం చేస్తుందేమోనని అతడికి ఎందుకో అనిపించింది వాళ్ళంతా అంతా సక్రమంగానే ఉందని చెప్పారు రామ్‌లాల్ లోనికి వెళదాం అని అనుకుంటూండగా ఒక స్త్రీ కేక వినిపించింది అది బాధతో పెట్టిన కేక కాదు దాంట్లోంచి క్రౌర్యం, పైశాచికత్వం ఉట్టిపడు తున్నాయి రామ్‌లాల్ అతని మనుషులు పరుగు పరుగున ఇంట్లోకి ప్రవేశించాడు ఇంటి రెండవ అంతస్థు నుంచి ఒక మనిషి క్రిందకు దూకి పారిపో బోయాడు కాని తడబడి పడిపోయాడు అతడు షీలా భర్త సుబాష్ ఇంతలో మరొక మనిషి గబగబా మెట్లు దిగి వచ్చాడు ఆ మనిషి మొహంపై గుడ్డ కట్టి ఉంది చేతిలో పొడవాటి చాకు ఉంది సుబాష్ నన్ను కాపాడండి, నన్ను కాపాడండి అని ఆర్తనాదం చేస్తున్నాడు మొహానికి గుడ్డ కట్టుకున్న ఆ మనిషి పోలీసుల్ని చూసి ఒక క్షణం తమాయించు కున్నాడు ఏ ఎస్ ఐ ఇందర్‌సింగ్ ఆ మనిషిని అడ్డ బోయాడు కాని అతడు నేర్పుతో చాకును దూసి ముందుకు ఉరికాడు దాంతో ఇందర్‌సింగ్ వెనక్కు తగ్గవలసి వచ్చింది ఈలోగా ఒక కానిస్టేబుల్ ఒక ఇటుక ఎత్తి ఆ మనిషిపై విసిరాడు అది ఆ మనిషి భుజానికి తగిలింది దాంతో ఆ మనిషి ఆ కానిస్టేబుల్‌ని వెంబడించాడు ఇది గమనించిన మరొక కానిస్టేబుల్ వెనుకగా వెళ్ళి ఆ మనిషిని గట్టిగా పట్టుకున్నాడు

రామ్‌లాల్ ఆ మనిషి చేతిలోంచి చాకు లాగబోయాడు కాని ఆ మనిషి అంత సుళువుగా లొంగితేనా పెనుగులాటలో ముసుగు తొలగి పోయింది ఆ మనిషి మరెవరో కాదు, షీలానే వాళ్ళు నా శంకర్‌ని చంపారు అతణ్ని కాల్చి మసి చేశారు నేను వాళ్ళను కూడా మసి చేస్తాను, అని కళ్ళంట నిప్పులు కక్కుతూ ఆమె అరుస్తోంది రామ్‌లాల్ ఆమెను, లాల్‌చంద్‌ను, సుబాష్‌ను అరెస్టు చేసి బేడీలు వేయించాడు

రామకలీ, శంకర్‌ల హత్యా కేసులో లాల్‌చంద్, అతడి కొడుకు సుబాష్‌లకు యావజ్జీవ కారాగార శిక్ష విధింప బడింది మరుదలను హత్య చేసినందుకు షీలాకు తొలుత మరణ శిక్ష విధింప బడింది కాని అపీలు చేయగా పై న్యాయస్థానం శిక్షను యావజ్జీవ కారాగార శిక్షగా మార్చింది (అయిపోయింది)



# క్షయ రోగంతో పోరాడండి

1. రెండు వారాలకు మించి ఎడతెరిపిలేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు. ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ పడుతూ ఉండవచ్చు

2. మీ సమీపమందలి ప్రాదమిక ఆరోగ్య కేంద్రం. డిస్పెన్సరీ లేక టిబి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మిమ్మల్ని పరీక్ష చేయుంచుకోండి




3 నిర్ధారిత సమయం వరకు. క్రమంగా డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే క్షయ రోగాన్ని నయం చేయవచ్చు

4 చికిత్సకంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిదే అందుచేత మీ బిడ్డకు బిసిజి టీకాలు వేయించండి



సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి.జి.హెచ్.ఎస్.)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు, న్యూ ఢిల్లీ.

davp 87/585 Tel

# సినిమా విశేషాలు

_జి.వి.జి.

## "అల్లుడు బాబోయ్ అల్లుడు"

"ప్రపంచంలో రాజకీయపరంగా జరిగే అనేక సంఘటనల ఆధారంతో డాక్టర్ ఎం. ప్రభాకరరెడ్డి సమకూర్చిన ఇతివృత్తం. రెండు షెడ్యూల్స్‌లో ఏప్రిల్ రెండవ వారానికి షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వంలో పద్మ ఫిలిమ్స్ డాక్టర్ డి.వి. ఎస్. రాజు నిర్మిస్తున్న పై చిత్రంలో భానుచందర్, అశ్విని, ప్రభాకరరెడ్డి, పి. ఎల్. నారాయణ, త్యాగరాజు, వీరభద్రరావు, సారధి, జీవా, ప్రదీప్‌శక్తి, నవనటుడు సుధాకర్ పాల్గొంటున్నారు. రాజ్ కోటి సంగీతం, సత్తిబాబు ఛాయ, భాస్కరరాజు శిల్పం, మన్నే రాధాకృష్ణ సంయుక్త దర్శకత్వం, జ్యోతిప్రసాద్ ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.

## కృష్ణ "అశ్వత్థామ"

"కథానాయకుడు కాన్వెంట్ స్కూల్ బస్సుడ్రయివర్. అతని సోదరి ఓ సంపన్నుల యువకుని ప్రేమిస్తుంది. పెళ్ళికి అంతస్తులు అడ్డుగోడలయ్యాయి. ఎలాగైనా తన సోదరికి ఆమె ప్రియునితో నే వివాహం చేయాలని ప్రతిజ్ఞపూని, ఎన్ని అవాంతరాలొచ్చినా తన ప్రాణాలను సైతం పణంగా పెట్టి, తన శపధాన్ని సాధిస్తాడు. కొట్టు మిట్టాడుతున్న న్యాయాన్ని కోర్టుకు తెచ్చి బతికిస్తాడు. అశ్వత్థామ అంటే చిరకాలం జీవించే వాడని అర్థం. కథానాయకుని పేరు అదే," అన్నారు బి. గోపాల్. ఈయన దర్శకత్వంలో సాంకేతిక నిపుణులు ఎం. కృష్ణ, శేఖర్ నిర్మించే శ్రీ రాఘవేంద్ర ఆర్ట్ పిక్చర్స్ వారి పై చిత్రంలో కృష్ణ, శారద, విజయశాంతి, జగ్గయ్య, నూతన్ ప్రసాద్, రాజా, రాజేష్, వరలక్ష్మి, ఒక విశిష్టమైన పాత్రలో మోహన్‌బాబు, నటిస్తున్నారు. పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతం, మహీధర్ ఛాయ, భాస్కరరాజు శిల్పం కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు, తెర వెనుక హంగులు.

## చిరంజీవి, విజయబాపినీడుల "ఖైదీ 786"

"ఒక సరికొత్త చిరంజీవిని చూస్తారీ చిత్రంలో", అన్నారు విజయబాపినీడు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మించిన శ్యాంప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో చిరంజీవి, భానుప్రియ, మోహన్‌బాబు, సత్యనారాయణ, ప్రసాద్‌బాబు, నూతన్ ప్రసాద్, కోట శ్రీనివాసరావు, స్మిత, మాయ, నిర్మల పాల్గొన్నారు. సత్యమూర్తి రచన, బాబూరావు రచనా సహకారం, వేటూరి – భువన చంద్రగీతాలు, రాజ్ కోటి సంగీతం, లోక్‌సింగ్ ఛాయ, తార నృత్యాలు, రాజు సాహసాలు, రవీంద్రబాబు – నరేష్ సహకార దర్శకత్వంతో గుత్తా మధుసూదనరావు నిర్మాణ సారథి.



"స్వర్ణకమలం"లో వెంకటేష్, భానుప్రియ

## వంశీ దర్శకత్వంలో "కనక మహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్"

"ఫిబ్రవరి 15న రాజమండ్రి దగ్గరున్న శివకోడులో షూటింగ్ మొదలెట్టాం. అందాల కోనసీమలోని రాజోలు ప్రాంతంలో నెల రోజుల ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది. రికార్డింగ్ డాన్స్ కళాకారుల ఇబ్బందులను ఈ చిత్రంలో చూపుతున్నాం. పుష్కలంగా హాస్యం కూడా వుంటుంది. నాయిక, నాయకుడ్ని ప్రేమించి, ఒక రికార్డింగ్ డాన్స్‌ట్రూప్‌లో చేర్పిస్తుంది. దాంతో కథ చిత్ర విచిత్రంగా సాగుతుంది", అన్నారు వంశీ. ఈయన కథ దర్శకత్వంలో డాక్టర్ పి. విజయకుమార్ రెడ్డి, డాక్టర్ పి. రమేష్ రెడ్డి నిర్మిస్తున్న శ్రీ తేజ ఆర్ట్ మూవీస్ వారి పై చిత్రంలో నరేష్, మాధురి, సంధ్య, వై. విజయ, తనికెళ్ల భరణి, కోట శ్రీనివాసరావు, మల్లికార్జునరావు, థమ్, నిర్మల వగైరా నటవర్గం. తనికెళ్ళ భరణి సంభాషణలు, సీతారామశాస్త్రి గీతాలు, ఇళయరాజా సంగీతం, హరి అనుమోలు ఛాయ, తోటయాదు శిల్పం, శివశంకర్ నృత్యాలు, తమ్ముడు సత్యం నిర్వహణ, అనిల్ మల్నాడ్ కూర్పుతో వేముల సత్యనారాయణ ప్రొడక్షన్ డిజైనర్.



## అన్నపూర్ణ స్టూడియోస్ కొత్త చిత్రాలు

బి. గోపాల్ దర్శకత్వం వహించే చిత్రం మే 16న సెట్స్‌కు వెళ్తుంది. పరుచూరి సోదరులు స్క్రిప్ట్ తయారు చేస్తున్నారు.

ఎ. కోదండరామిరెడ్డి డైరెక్ట్ చేసే చిత్రం అక్టోబర్‌లో మొదలవుతుంది. వెంకట్ అక్కినేని నిర్మించే ఈ రెండు చిత్రాలలోను నాగార్జున హీరో

## రచయిత జి. సత్యమూర్తి దర్శకత్వంలో శ్రీ రత్నగిరి ఆర్ట్ క్రియేషన్స్ చిత్రం

"హాస్యం, శృంగారం మేళవించిన ప్రణయగాథ. రెండు షెడ్యూల్స్‌లో ఏప్రిల్ నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జి. సత్యమూర్తి. ఈయన రచన, దర్శకత్వంలో సుప్రసిద్ధ డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి సమర్పించే శ్రీ రత్నగిరి ఆర్ట్ క్రియేషన్స్ తొలి చిత్రంలో సుమన్, గౌతమి, మాధురి, వై. విజయ, నూతన్ ప్రసాద్, రాజా, మహారథి ఆదిగా గల వారు పాల్గొంటున్నారు. రాజ్ – కోటి సంగీతం, వి. సురేష్ ఛాయ, తాడి రంగవరప్రసాద్ ప్రధాన సహకార దర్శకత్వం, విజయ్– మోహన్‌రావు సహకార దర్శకత్వం, శివశంకర్ నృత్యాలు, శ్రీధర్ – గురువయ్య, శ్రీనివాస్‌కుమార్ ప్రొడక్షన్, దండమూడి సాంబశివరావు నిర్వహణతో పి. సూర్యనారాయణ, ఎం. రమేష్‌బాబు నిర్మాతలు.

## "అత్త మెచ్చిన అల్లుడు" ఆఖరి షెడ్యూల్

"ఏప్రిల్‌లో 11 నుండి 21 వరకు చివరి షెడ్యూల్. జూన్‌లో విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారు వాకాడ అప్పారావు. ఈయనా, దాట్ల రామకృష్ణంరాజు నిర్మిస్తున్న శ్రీ లలిత కళాంజలి ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో కృష్ణ, డాక్టర్ భానుమతీ రామకృష్ణ, జయప్రద, సత్యనారాయణ, రాజా, కోడి రామకృష్ణ, చలసాని రామారావు, పది పైసలు సుబ్బారావు, భక్తవత్సలం, గాదిరాజు సుబ్బారావు, నాగేశ్వరరావు, గోపి, బేబీ విజయ, వై. విజయ, జయమాల, శ్రీ శైలజ నటిస్తున్నారు. ఎన్. వి. రామారావు కథా సంవిధానకర్త, తోటపల్లి మధు మాటలు. సి. నారాయణరెడ్డి పాటలు. కె. ఎస్. హరి ఛాయ. కె. ఎల్. ధర్ శిల్పం, రవికుమార్ – బుజ్జి సహకార దర్శకత్వం, బి. శ్రీధర్ – కోడి వెంకటరమణ ప్రొడక్షన్, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, సాహుల్ సాహసాలు, తాతా సురేష్ కూర్పు, బి. హెచ్. సూర్యచంద్రరాజు నిర్వహణతో సూర్యకిరణ్ సమర్పించే ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : కోడి రామకృష్ణ.

## కృష్ణ, తాతినేని రామారావుల "అగ్ని కెరటాలు"

ప్రతీకారంతో కూడిన కుటుంబ కథాచిత్రం మే నెలాఖరున విడుదల," అన్నారు ఎం రామకృష్ణారెడ్డి ఈయన సమర్పణలో ఎం శ్యామలాదేవి నిర్మించిన ఎస్ ఎస్ ఫిలిమ్స్ వారి పై చిత్రంలో కృష్ణ, భానుప్రియ, శారద, శివకృష్ణ, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, రాజేష్, రఘునాద్, రాజ్యలక్ష్మి, చంద్రిక పాల్గొన్నారు పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎం వి రఘు ఛాయ, పేకేటిరంగా శిల్పం, శివశంకర్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, విశ్వం సంయుక్త దర్శకత్వం, వి ఎస్ రెడ్డి - రఘురాం ప్రొడక్షన్, కృష్ణస్వామి కూర్పు నిర్వహిస్తున్నారు

## రేలంగి, రాజేంద్రప్రసాద్‌లతో అబ్బులు చిత్రం

జూలై, ఆగస్ట్, సెప్టెంబర్‌లలో ప్రతి నెలా 11, 20 తేదీల మధ్య పూర్తిగా ఔట్‌డోర్ లోనే షూటింగ్,' అన్నారు శుభోదయా ఆర్ట్ ప్రొడక్షన్స్ అబ్బులు ఈయన 'దొంగగారూ స్వాగతం అనంతరం నిర్మించే కొత్త చిత్రంలో రాజేంద్రప్రసాద్, గౌతమి, శారద, శరత్‌బాబు ప్రదాన పాత్రధారులు కాశీవిశ్వనాధ్ రచన, రాజ్‌కోటి సంగీతం, బి కోటేశ్వరరావు చాయ తెర వెనుక హంగులు




ఏ.సి. తగ్గించారుకదా-టికెట్టు రేటు కూడా తగ్గించుకోరాదూ?

## అంజనా ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రం చిరంజీవి శత చిత్రం

'మాదక ద్రవ్యాలకు బానిసలైన యువతీ యువకులకు ఆ పిశాచాల బారి నుండి రక్షించడానికి కథానాయకుడు చేసే సాహసమే ఈ చిత్ర కథాంశం. వినోదాత్మకమైన క్రయిమ్ చిత్రమిది ఉత్తర బారతంలో రికార్డులు సృష్టించిన 'జాల్వా' హిందీ చిత్రం ఆధారం," అన్నారు ఎ కోదండరామిరెడ్డి, ఈయన డైరెక్ట్ చేస్తున్న అంజనా ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో చిరంజీవి, భానుప్రియ, మురళీమోహన్, అనుపమ ఖేర్, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, రంగనాధ్, ప్రసాద్‌బాబు, బ్రహ్మనందం, ఆంథోని, గెస్ట్‌గా చంద్రమోహన్ నటిస్తున్నారు యండమూరి వీరేంద్రనాధ్ స్క్రీన్‌ప్లే, సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, రాజ్‌కోటి సంగీతం, లోకసింగ్ ఛాయ, బి చలం శిల్పం, రాజు సాహసాలు, తార నృత్యాలు, ఎన్. బి చక్రవర్తి సంయుక్త దర్శకత్వం, వెళ్ళిస్వామి కూర్పుతో నర్సయ్య ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ఇది మా డైరెక్టర్ గారికి 50వ చిత్రం ఏప్రిల్ 11 నుంచి 15 వరకు ఒక షెడ్యూల్ జరిగింది తదుపరి షెడ్యూల్స్ మే 11 నుంచి జూన్ 10 వరకు కాశ్మీర్‌లో, జూన్ 21 నుంచి 30 వరకు గోవాలో, అన్నారు నిర్మాత కె నాగేంద్రబాబు □

# నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్

NAGARJUNA FINANCE

నాగార్జునహిల్స్, పంజగుట్ట, హైదరాబాద్-500482 ఫోన్: 37389/224445

## డిపాజిట్ల స్వీకరణ/పునరుద్ధరణ

| స్కీము 1 | కాల వ్యవధి | కనీస డిపాజిట్టు | వడ్డీ రేటు | వార్షికాదాయము * |
|---|---|---|---|---|
| నెలసరి ఆదాయ పథకం | 1 సంవత్సరం | రూ. 10,000 | 14% | 14.90% |
| | 2 సంవత్సరాలు | రూ. 8,000 | 14% | 16.00% |
| | 3 సంవత్సరాలు | రూ. 5,000 | 14% | 17.25% |

* అదనపు సొమ్ము రూ 1000 – గుణిజములలో ఉండాలి * డిపాజిట్ చేయబడిన తేదీ నుండి మార్చినెల వరకు గల కాలవ్యవధికి గాను ఫిక్సెడ్ డిపాజిట్ రశీదుతో పాటు మొదటి సంవత్సరపు వడ్డీ వారెంట్లు ఇవ్వబడతాయి * సంబంధిత ఆర్థిక సంవత్సరాలకు (ఏప్రిల్ మార్చి) గాను పన్నెండు నెలసరి వడ్డీ వారెంట్లు ఆ ఆర్థిక సంవత్సర ప్రారంభమునందు ఇవ్వబడతాయి

| స్కీము 11 | కాల వ్యవధి | కనీస డిపాజిట్టు | వడ్డీ రేటు | వార్షికాదాయము * |
|---|---|---|---|---|
| త్రైమాసిక ఆదాయ పథకం | 1 సంవత్సరం | రూ. 3,000 | 14% | 14.75 |
| | 2 సంవత్సరాలు | రూ. 3,000 | 14% | 15.85 |
| | 3 సంవత్సరాలు | రూ. 3,000 | 14% | 17.00% |

* అదనపు సొమ్ము రూ 1000/- గుణిజములలో ఉండాలి * డిపాజిట్ చేయబడిన తేదీ నుండి మార్చినెల వరకు గల కాలావ్యవధికి గాను ఫిక్సెడ్ డిపాజిట్ రశీదుతో పాటు మొదటి సంవత్సరపు వడ్డీ వారెంట్లు ఇవ్వబడతాయి * పూర్తి ఆర్థిక సంవత్సరానికి (జూన్/సెప్టెంబర్ డిసెంబర్ మార్చి) గాను నాలుగు త్రైమాసిక వడ్డీ వారెంట్లు ముందుగా ప్రతి ఆర్థిక సంవత్సర ప్రారంభములో ఇవ్వబడతాయి

| స్కీము 111 | కాల వ్యవధి | కనీస డిపాజిట్టు | మెట్యూరిటీ సమయం నందు చెల్లింపబడు మొత్తం | వార్షిక ఆదాయము * |
|---|---|---|---|---|
| కుమ్యులేటివ్ డిపాజిట్ల పథకం | 6 నెలలు | రూ. 25,000 | రూ. 26,735 | 14 % |
| | 1 సంవత్సరం | రూ. 2,000 | రూ. 2,300 | 15 % |
| | 2 సంవత్సరాలు | రూ. 2,000 | రూ. 2,640 | 16 % |
| | 3 సంవత్సరాలు | రూ. 2,000 | రూ. 3,036 | 17.26% |

* అదనపు సొమ్ము రూ 1000/- గుణిజాలలో ఉండాలి వడ్డీ ప్రతి నెల కలుపబడుతుంది

రీ – ఇన్వెస్ట్‌మెంట్ మీద సంవత్సరానికి 14% వడ్డీ ఉద్దేశించ బడినది

అన్ని స్కీములకు వర్తించు అంశాలు * కంప్యూటరైజ్డ్ ఎంకాసిబుల్ వడ్డీ వారెంట్లు ఇండియాలో 7 000 పైగా ఉన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా యొక్క అన్ని శాఖలలో ఒకే సారి చెల్లింపబడతాయి * ఏ ఆర్థిక సంవత్సరంలోనైనా రూ 2 500/– దాటని వడ్డీ మీద పన్ను లేదు * డిపాజిటరు ఫారం 15 హెచ్/15 ఎ నందు డిక్లరేషన్‌ను దాఖలు చేసినట్లయితే ఏ ఆర్థిక సంవత్సరంలోనైనా రూ 2 500/– దాటిన వడ్డీ మీద కూడా పన్ను ఉండదు * అన్ని స్కీముల విషయంలో కూడా మెట్యూరిటీ సమయమునందు డిమాండ్ డ్రాఫ్టుల ద్వారా సకాలంలో ఖచ్చితమైన చెల్లింపులు జరుపబడతాయి

నాన్ – బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలు మరియు మిస్లేనియస్ నాన్ – బ్యాంకింగ్ కంపెనీల (ప్రకటనలు) సవరించబడిన 1977 నిబంధనల ప్రకారం వివరాలు

| | | |
|---|---|---|
| ఎ | కంపెనీ పేరు | నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్ |
| బి | ఏర్పాటు చేసిన తేది | 24-3-1982 |
| సి | కంపెనీ ద్వారా నిర్వహించిన వ్యాపారం మరియు శాఖల యొక్క వివరాలతో పాటు దీని యొక్క సబ్సిడరీలు | హైర్ పర్చేజ్ ఫైనాన్సింగ్ ఎక్విప్‌మెంట్ లీజికిచ్చుట పెట్టుబడులు మరియు పారిశ్రామిక ఆర్థిక సహాయం ఈ కంపెనీ ఎటువంటి సబ్సిడరీలు కలిగి లేదు ఈ కంపెనీ యొక్క శాఖలు/కార్యాలయాలు బొంబాయి మద్రాసు మధురై తిరుచ్చి వైజాగ్ విజయవాడ మరియు కోయంబత్తూరుల్లో ఉన్నవి |
| డి | కంపెనీ నిర్వహణ యొక్క సంక్షిప్త వివరాలు | అర్హత మరియు అనుభవం కలిగిన ప్రొఫెషనల్స్ యొక్క టీమ్ చేత సహాయ్యు చేయబడిన డైరెక్టర్ల బోర్డుచే ఈ కంపెనీ నిర్వహించ బడుచున్నది |

* డైరెక్టర్ల పేర్లు చిరునామాలు మరియు వృత్తులు :

| పేరు | చిరునామ | వృత్తి |
|---|---|---|
| శ్రీ ఆర్ కె తల్వార్ ఛైర్మన్ | తిరువినయ్ 2వ అంతస్థు, 13 పెరుమాళ్ కోవిల్ స్ట్రీట్ పాండిచ్చేరి – 605 001 | బ్యాంకర్ |
| శ్రీ మినూ ఆర్ ష్రాఫ్ | జె కె బిల్డింగ్ ఎన్ మొరార్జీ మార్గ్ బల్లార్డ్ ఎస్టేట్ బొంబాయి – 400 038 | ఫైనాన్షియల్ కన్సల్టెంట్ |
| శ్రీ హెచ్ పి.రానిన | కామన్వెల్త్ ఫ్లాట్ నెం 24 6వ అంతస్థు 181 బ్యాక్ బే రిక్లమేషన్ బొంబాయి – 400 020 | అడ్వకేట్ సుప్రీంకోర్టు ఆఫ్ ఇండియా |
| శ్రీ విమల్ ఎస్ కంపాని | 51 పెర్సిపోలిస్ అపార్ట్‌మెంట్సు 100 కుఫే పరేడ్ కొలబా బొంబాయి – 400 005 | ఫైనాన్షియల్ కన్సల్టెంట్ |
| శ్రీ కె ఎస్.రాజు | నెం 6 నాగార్జున హిల్స్ హైదరాబాద్ – 500 482 | ఇండస్ట్రియలిస్ట్ |

ఎఫ్. లాభాలు మరియు లాభాంశాలు (డివిడెండ్లు)

| గడువు | పన్నుకుపూర్వం లాభం (రూ లక్షలలో) | పన్ను తర్వాత లాభం (రూ లక్షలలో) | ఈక్విటీ డివిడెండ్ సొమ్ము (రూ లక్షలలో) | రేటు |
|---|---|---|---|---|
| 30-9-87 | 159 42 | 134 27 | 56 06 | 23 % |
| 30-9-86 | 143 07 | 133 72 | 56 06 | 23 % |
| 30-9-85 | 109 55 | 109 55 | 30 00 | 20 % |

* ఆడిట్ చేయబడిన గత రెండు బ్యాలెన్స్ షీట్ల ప్రకారం సంగ్రహపరచబడిన కంపెనీ ఆర్థిక స్థితి

| అప్పులు | 30-9-87 నాటికి (రూ లక్షలలో) | 30-9-86 నాటికి (రూ లక్షలలో) |
|---|---|---|
| వాటా మూలధనం | 241 80 | 241 07 |
| రిజర్వులు మరియు మిగులు | 269 88 | 191 67 |
| సెక్యూర్డ్ లోన్లు | 2322.71 | 1508 93 |
| అన్ సెక్యూర్డ్ లోన్లు | 956 27 | 815 12 |
| సప్లయర్స్ నుండి క్రెడిట్ చేయబడిన డిఫర్డ్ పేమెంట్ | 40 84 | |
| ప్రస్తుత అప్పులు మరియు ప్రొవిజన్లు | 1820.97 | 1543 69 |
| మొత్తం | 5652.47 | 4300 48 |

| ఆస్తు లు | 30-9-87 నాటికి (రూ లక్షలలో) | 30-9-86 నాటికి (రూ లక్షలలో) |
|---|---|---|
| స్థిరాస్తులు | 824.65 | 598 94 |
| పెట్టుబడులు | 37 75 | 37 50 |
| ప్రస్తుత ఆస్తు లు ఋణాలు మరియు బయానాలు (అడ్వాన్సులు) | 4731 70 | 3593 84 |
| మిస్లేనియస్ ఎక్స్‌పెండిచర్ | 58 37 | 70 20 |
| మొత్తం | 5652 47 | 4300 48 |

| తాత్కాలిక (కంటిజెంట్ అప్పులు) | 30-9-87 నాటికి (రూ లక్షలలో) | 30-9-86 నాటికి (రూ లక్షలలో) |
|---|---|---|
| I) బ్యాంకు గ్యారంటీలు సంబంధించి కౌంటరు గ్యారంటీలు | 48.25 | 1 49 |
| II) డిస్కౌంట్ చేయబడిన బిల్లు లు | 219 40 | 450 43 |
| III) నిర్వహించ వలసిన మిగిలిన కాంట్రాక్టుల అంచనా చేయబడిన సొమ్ము | లేదు | 5 42 |

హెచ్ సవరించబడిన నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీల (రిజర్వు బ్యాంక్ సూచనలు) 1977 నిబంధనల క్రింద డిపాజిట్ల ద్వారా కంపెనీ పెంచగల మొత్తం రూ 4 533 లక్షలు 30-9-1987 నాటికి నిర్వహించబడిన మొత్తం డిపాజిట్లు రూ 862 44 లక్షలు

ఐ ఈ ప్రకటన తేది నాటికి అన్‌క్లెయిమ్డ్ డిపాజిట్లు మినహా కంపెనీ ఎటువంటి ఓవర్‌డ్యూ డిపాజిట్లను కలిగిలేదు

జె కంపెనీ ఇందుమూలంగా ప్రకటించుచున్నది (డిక్లరేషన్)

I) సూచనల ప్రకారం వర్తించునటువంటి అన్ని నిబంధనలను ఈ కంపెనీ పాటిస్తు oది

II) సూచనల ప్రకారం నిబంధనలను పాటించినంత మాత్రాన డిపాజిట్లు తిరిగి చెల్లింపునకు రిజర్వు బ్యాంకు ఎటువంటి గ్యారంటీ ఇవ్వదు

III) ఈ కంపెనీలచేత అంగీకరించబడిన డిపాజిట్లు అన్ సెక్యూర్డ్ డిపాజిట్లు మరియు ఇతర అన్ సెక్యూర్డ్ లయబిలిటీస్‌తో సమానమవుతాయి

ఈ ప్రకటన కంపెనీ డైరెక్టర్ల బోర్డుయొక్క అధికారంతో మరియు వారి పేరున జారీ చేయబడుచున్నది 30-11-87 నాడు నిర్వహించబడిన సమావేశమునందు ఈ ప్రకటన ఆమోదించబడి రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా బెంగుళూరులో ఫైలు చేయబడినది

బోర్డువారి ఆజ్ఞానుసారము.
నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్ తరపున
ఎస్.ఎ కృష్ణన్
ప్రెసిడెంట్

స్థలము బొంబాయి
తేది 30-11 1987

శాఖలు : డిపాజిట్లు హైదరాబాద్‌లో ని కంపెనీ యొక్క రిజిష్టర్డు ఆఫీసులోను మరియు ఈ దిగువ శాఖలలోను స్వీకరించబడతాయి బొంబాయి : ఫ్లాట్ నెం 44 ఫ్రీ ప్రెస్ హౌస్ 215 ఫ్రీ ప్రెస్ జర్నల్ మార్గ్ నారిమన్ పాయింట్ ఫోన్ 2041622 2042655 2871383/2871384 మద్రాసు : రేర్ వింగ్ 3వ అంతస్థు ఇండియా గ్యారేజ బిల్డింగ్ 184 అన్నాసలై ఫోన్ 862511/862566 టెలెక్స్ 041 6535 మదురై : 57 నాయకర్ న్యూ స్ట్రీట్ (మొదటి అంతస్థు) ఫోన్ 31741/35397 కోయంబత్తూర్ : 365 డా రాజేంద్రప్రసాద్ రోడ్డు తాతాబాద్ తిరుచ్చి మొదటి అంతస్తు ఎ-2 కాలనీ మెయిన్ రోడ్డు (సౌత్), తిల్లాయ్‌నగర్ ఫోన్ 37276 **విజయవాడ, ఫ్లాట్ నెం 6 రైల్వే ఆఫీసర్స్ కాలనీ వెంకటేశ్వరపురం, ఫోన్ 65440** **విశాఖపట్నం : 48-8-11 ద్వారకానగర్ ఫోన్ :** 61994

కొత్త పద్ధతుల్లో పెరుగుదల

# నిత్య నూతన సీరియల్




(గత సంచిక తరువాయి)

ఆ రోజంతయు గడచిపోయెను. అరుంధతీ ద్వయమునకెడబాటు లేదు. వారు మరునాడు మరల బయలుదేరిరి. పశుపతి అన్నాడు. "మీరు సోమవారమునాడు బయలుదేరినచో బెజవాడ వరకు నేను వత్తును.

ధర్మా: నీ మాట నమ్మినదెవరు? నేడేమి వారము?

పశు: గురువారము.

ధర్మా: శుక్ర, శని, ఆది మూడు రోజాలే! నేనుండనబ్బా.

పశు: ఉండక తప్పదబ్బా.

ధర్మా: నీవు తప్పక వచ్చెదవా?

అన: నీ వబద్ధము చెప్పెదవు గాని వారు చెప్పరు. ఎనిమిదేండ్లకు వచ్చితిని. ఎనిమిది రోజాలైన నుండననుచున్నావు.

ధర్మా: ఇన్ని ఏండ్లకు వచ్చితిని గనుకనే మీ యరుంధతి నిట్లు చూచితిని.

అన: నీ మోస్తరంతయుచూచినచో నీవు మా యరుంధతిని వలచినట్లున్నది.

ధర్మా: అంత దూరము రాలేదు. ఆమెను వలచుటతో నాకేమి పని! వలసినచో ఆమెయే నన్ను వలచునేమో!

అన: మా పిల్ల నీవనుకొన్నంత లేత గుండెది కాదు.

పశు: సరే! ప్రయాణము సోమవారమనియే కదా!

అన: అంతే!

మరల వారు ప్రయాణమాపుకొనిరి. వసంతకాలము మూన్నాళ్ళ క్రిందకన్న మరియు విజృంభించినది. పశుపతికి మామిడితోట ఉన్నది. సాయంవేళ వాహ్యాళిగా అందరూ తోటకు పోయిరి. మిగిలిన దొక్క పశుపతి తల్లియే. మామిడి తోట ఎకరము మేరనున్నది. తోట చిన్నది. కోరడి వెంట కొబ్బరి చెట్లున్నవి. మధ్య రకమున కొకటి రెండు బత్తాయిలు, నారింజలు, నిమ్మలు కలవు. నిమ్మ చెట్లు వడ పిందెలు వేసెను. అందు కొన్ని చెట్లు క్రింద పడి ఉండెను.

ధర్మా: తోటకు నీరు పెట్టుట లేదా?

పశు: ఉన్నాడు. మాకొక దేభ్యము. వాడు దున్నబోయిన దూడ, మేయబోయిన ఎద్దు. వాడు సరిగా పని చేయడు. మావి తరువులు చివుళ్ళ చివళ్ళు వేసి గాలిచే కదలి అతిథులను సమాహ్వానించు చున్నట్లుండెను. గున్న మామిడులు నేలకు వాలుచుండుట చేత చిన్ని అరుంధతి యొక చివురు జొంపమును త్రుంచెను.

పశు: చివురు త్రుంచితివెందులకే?

ధర్మా: దానికి లేత వయసుననే అనుభవించుట యిష్టము కాబోలు.

అరుం: లేత వయసేమి? చి[?]రు కొంచెము ముదిరినది. మరియు లేతగా లేదు. చేతికి శోభగా నుండవలయుననిన చివురాకు గాక మామిడి మంద పుచ్చుకొనెదరా! మంద నుండి ఫలము మాత్రమే వచ్చును.

అన: నీకు తెలియని దేదియును లేదు.

పశు: ఆడబిడ్డ యంతమాత్రమైన అనకపోయిన నెట్లు?- దోటయంతయు క్రొత్తగా దున్ని చెట్లకు నీరు పెట్టిరి.

ధర్మా: ఇక్కడ నీరు తోడిరే!

పశు: నిమ్మ చెట్లకు పానికి తోడలేదు. దున్నిన చాళ్ళలో మట్టితో బోదెలు చేసి నీరు పెట్టిరి. నేల అంతయు పదలుగా నుండుట చేత బోదె గట్టు తడిసి ప్రక్కన గజము మేర తడిసెను. పశుపతి కాలు బురదలో దిగబడెను.

ధర్మా: అది పప్పు కాదు. అనసూయ నవ్వెను.

పశు: మీ అబ్బాయిని కూడ దింపి నడిపించుము, వాడెంత లోతు దిగ బడునో తెలియును.

ధర్మా: వాడు నాల్గు మల్లెపూల ఎత్తు. వాడసలు నీటి మీద కూడ నడిచిపోగలడు.

అరుం: అయినను దింపి చూతునా?

ధర్మా: (నవ్వి) నిజముగా దింపెదవు సుమా?

అరుం: ఇన్ని కంతులు కోసితిని. నా కంతి యంత నొప్పి లేదన్నాడట.

అన: ఏమమ్మా! దింపుదునంటివి కదా, పిల్లవానిని. ఏది దింపుము. ఆయన యొక్కడే కన్నాడా?- కోకిల "కుహూ" అనెను. చిన్న యరుంధతియు కోకిల నొకరినొకరు రెట్టించుకొనిరి.

అన: ఎందుకే నీవు దానినంత రెట్టించెదవు?

ధర్మా: రెట్టించుటయే కాదు, అది కూత మానివేసిన తరువాత కూడ కూయుచున్నది.

అన: అంతేనమ్మా యీ పిల్ల! రేపు మగడు నాకు వలదనినను నీవే కావలయునని వాని వెంటపడును.

పశు: పతివ్రతలంతియే కదా!

అన: శారదా చట్టము వచ్చిన తరువాత ఇంకను పాతివ్రత్య మేమిటి?

పశు: మన యిండ్లలో స్త్రీలనందరిని చదువు చెప్పక వట్టి చాదస్తపు మనుషులుగా తయారు చేయుదుము.

ధర్మా: చదువుకొనిన వారికన్న చాకలులే మేలట. ఆమె అనిన దానిలోనే ఎక్కువ యాదార్థ్య మున్నదేమో!

పశు: నీవు ధర్మారావువాయెను!

మధుమాసపు చిరు వెచ్చని యావిరులు చెట్ల సందుల నుండి దూరి మొగముల మీద, చెవులలో దూరి ఎండబెట్టెను. అరుంధతి పిల్లవాని నెత్తుకొని నడువలేక పోయినది. ఆమెకు కొంచెముగా వడకొట్టినది. ఆమె కుర్రవానిని ధర్మారావు చేతికిచ్చెను. ఇచ్చుటలో ఇరువురి మేనులు తాకినవి.

యొడళ్ళు పులకిత బ్రహ్మానంద పథమున నడచెను. ఇరువురకును మనసులలో నొకరినొకరు ఎడబాయలేమనిపించెను. ఇంతలో పిల్ల వానిని నేను తీసికొనెదనని చిన్న అరుంధతి వారి యిద్దరి నడుమకు వచ్చెను. అరుంధతి చిన్న అరుంధతిని నివ్వెరపోయి చూచెను. ధర్మారావు పసివానినామె

జరిగినకథ: 48- రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు. దేవదాసి ప్రతి రోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. రామేశ్వరము జైలుకి పోయిన తరువాత మంగమ్మకు అతని ఆస్తి దక్కుతుంది. ధర్మారావుకు కొడుకు పుడతాడు. గణాచారి ఎప్పటిలాగానే తిరుగుతూ ఉంటుంది. పంకజమ్మగారి ఇంటిలో అప్పుడప్పుడూ జరిగేచర్చలలో ధర్మారావు పాల్గొంటూ ఉంటాడు. ఆ చర్చల్లో భారతీయ సంప్రదాయం గురించి ధర్మారావు ఆవేశంగా ఉపన్యసిస్తాడు. ధర్మారావు అరుంధతి పశుపతి ఇంటికి వెడతారు. ధర్మారావు విద్య గురించి వివరిస్తాడు.

చేతికిచ్చెను అరుంధతి మోట వద్దకు పోయి తొట్టి వద్దనున్న నీళ్ళతో మొగము కడుగుకొనెను ఆమె వెంట ధర్మారావును పోయెను పశుపత్యనసూయలు, ముగ్గురు పిల్లలు తోటకు ఒక వైపున నుండిరి అరుంధతీ ధర్మారావు లొక వైపున నుండిరి

ధర్మా వడగొట్టినదా ఏమి?

అరుం రోజు రోజుకు నా యోపిక పోవుచున్నది నాకేమైన మందిప్పించుడు నేనింక ఎన్నాళ్ళో బ్రతుకను నా వలన మీకేమైనా సుఖమా బండలా?

ధర్మా చీ ఛీ! అట్లనకుము నీవున్నావన్నదియే చాలు ఆ మహాకవి అన్నట్లు "నిబ్బరముగ రేత్రి నిదురపొయ్యేను-"

అరుం నేను నిజముగా చాల రోజులు బ్రతుకను

ధర్మా నీవు లేకున్న నేను మాత్రము బ్రతుకుదునా?

అరుం లోకములో అందరును బ్రతుకుట లేదా? అయినను నేను మిమ్ము వదలిపోను-

ధర్మారామె వద్దకు పోబోయెను

అరుం వారు చూచెదరేమో! పదండు పోవుదము

వసంత కోకిల మావి చివుళ్ళు గీసికొనిపోయి కుహూ నిస్వానము మరల ప్రారంభించెను మరల పోయి, వారును వీరును కలసికొనిన తరువాత అనసూయ అన్నది-"ఇప్పుడు . కాదమ్మా! మామిడిపండ్లు కాపు వేసిన తరువాత మీరు రావలయును"

పశు మా తోటలో మంచి జాతులన్నియు ఉన్నవి జహంగీరు ఇమాందీనులున్నవి ఆ మూలనున్న వంకరచెట్టు జహంగీరు; దాని వైపున నున్న రెండును ఇమాందీనులు

ధర్మా ఒక రెండు నెలలు పోనిచ్చి మరల వత్తుము కదా!

పశు అరుందతిని కూడ తీసుకొని రావలయును

అరుం నీ వెంటనేఉన్నది కదా అయింధతి?

అన ఒక్క యరుంధతి పనికిరాదు మీరిద్దరును కూడ ఉండవలెను అప్పు డిమాందీనులు మిక్కిలి రుచి

ధర్మా ఇమాందీనులు పండిన సంపెంగ చక్రకేళీల వాసనయు, మామిడిపండు రుచియు కలవి

అన మామిడిపండు చిన్న యరుంధతికి





సంపెంగతావి పెద్దయామె

ధర్మా అది చక్రకేళీ కూడను సోమవారము వచ్చినది అరుంధతీ ధర్మారావులును, రామేశ్వర శాస్త్రియును పశుపతియు బయలుదేరిరి పశుపతి యరుంధతీ ధర్మారావులకు నూత్న వస్త్రములు పెట్టెను శాస్త్రికి రెండు రూకలు చేతిలో పెట్టెను వారు వలదనిరి కాని పుచ్చుకొనక తప్పక వచ్చెను అరుంధతి అన్నది"వదినె! మా ఊరిలో దేవుని కళ్యాణములు జరుగును నీవప్పుడు తప్పక రావలయును శశిరేఖా కిరీటులు కూడ వత్తురు నీవు శశిరేఖ నిదివరకు చూడలేదు కదా! బంగారుతల్లి- చూతువుగాని"

బెజవాడ స్టేషనులో దిగిరి దిగి వంతెన దాటుచుండగా పన్నెండేండ్ల పిల్లవాని నొక పోలీసువాడు పట్టుకొని కొట్టుచుండెను వాడు "నేనేమి దొంగిలించితినో చూపించుడు ఊరకే కొట్టుట ఏమి న్యాయము' అనెను పోలీసు "వెధవా' నీవు దాచిన చోటు నాకు తెలియునా? నీయంత యింద్రజాలపు ముండకొడుకుండ"దని

## వ్యాయామ క్రీడా కారిణి పాఠశాల విద్యార్థిని

పదమూడు సంవత్సరాల రష్యన్ వ్యాయామ క్రీడాకారిణి ఓల్గా మొస్త్రవనోవా ఇప్పటి వరకు సీనియర్



కాంస్య పతకం గెలుచుకున్న వారందరి లో కీ వయసులో చిన్న.

బేస్‌బాల్‌ను పూర్తిగా అమెరికన్‌లే కనిపెట్టారని అంతరూ అనుకుంటారు గాని అది నిజం కాదు. అది 1744 నాటికే ఇంగ్లీషు ప్రచురణలలో ప్రస్తావనకు వచ్చింది. 1818లో జేన్ ఆస్టిన్ వ్రాసిన ఒక నవలలో కూడా, ఈ ఆట ప్రస్తావన ఉంది.



## బేస్ బాల్

కొట్టుచుండెను ధర్మారావు పోయి "వానివద్ద ఏమియు దొరకనప్పుడు కొట్టుట ఎందులకు?వానిని వదలిపెట్టుమనెను పోలీసు"అయ్యా! వీడు జగజంత్రి ముండకొడుకండీ! వీనిని దయదలచరా"దనెను ధర్మారావు పోనిద్దూ పాపము! వాడును బ్రతకవలయును కదా!" అనెను. కుఱ్ఱవాడు "అట్లు చెప్పండి బాబూ! నేనెప్పుడును నాకు కావలసిన దానికన్న ఎక్కువ తీసికోను ఈ పోలీసాయననే అడుగుడు మొన్న ఒక పెద్దమనిషి జేబులో డబ్బు సంచి కొట్టివేసితిని అందులో పది రూపాయలున్నవి నాకు గావలసిన దొక్క రూపాయే! ఆనాడు మా ఇంటిలో బియ్యము లేవు రెండు నాళ్ళ నుండి నాకు, మా అమ్మకు తిండి లేదు అందుచేత ఆ రూపాయి తీసికొని తక్కిన తొమ్మిది రూపాయలు "మీ సంచి క్రింద పడిపోయినదండే" అని ఆయనకే యిచ్చితిని ఆయన ఒక రూపాయ తక్కువైనదని చూచుచున్నాడు క్రిందనేమో పడిపోయియుండవచ్చుననుకొని కొంతసేపు వెతకి వెళ్ళిపోయెను అయ్యా! యీ పోలీసువారు నన్ను ఖైదులోను వేయరు నన్ను సంపాదించుకోను నీయరు" అని ఏడ్వసాగెను

ధర్మా నిన్ను ఖైదులో వేసినచో మీ అమ్మకు తిండి ఎట్లు?

వాడు అది ఏమి చావు చచ్చునో నేను చూడవచ్చితినా? ఎదురుగా ఉన్నంత వరకే నా బాధ్యత

ధర్మా ఏమి వేదాంతము? నీకున్నంత మాత్రము జ్ఞానము తిండిగల వారికి లేదోయి నీ పేరేమి?

వాడు "అసిరి"

ధర్మారావు వానిని వదలించెను పోలీసువాడు వానిని వదలిపెట్టి పోయెను ధర్మారావు.

### వేయిపడగలు

పశుపత్యాదులు నడుచుచుండిరి కొంత దూరము పోయి బండి కట్టించికొనిదానిలో ఎక్కిరి అసిరి వెనునే వచ్చుచుండెను ధర్మారావు బండి ఆపుమనెను "ఎందుకురా మా వెంట వచ్చెద?"వని అడిగెను

వాడు మీఇల్లు చూచిపోయెదను బాబూ!

ధర్మా మా యిల్లెందుకురా? ఏమైనా చేతి దెబ్బ కొట్టవలయుననియా?

అసిరి మీకంత అనుమానమైనచో తిరిగి పోవుచున్నాను

ధర్మా "కాదులే" రమ్మని బండి ఎక్కించుకొనెను సూర్యపతి యింటికి పోయిరి సూర్యపతి వారిని కలిసికొని మహానంద నిమగ్నుడయ్యెను ధర్మారావరుంధతితో సహా వచ్చినందుకు సూర్యపతి ఆనందము పట్టలేక పోయెను అతని భార్య వచ్చి అరుంధతిని లోనికి తీసుకొనిపోయెను హొటలు నుండి అన్నము తెచ్చి యరుంధతికి బెట్టిరి వారిద్దరును భోజనము చేసిరి స్నేహితులు ముఫ్ఫురును చిత్రవిచిత్రపు కబురులతో మధ్యాహ్నము గడిపిన తరువాత ధర్మారావు 'పోవుదు"నని ప్రయాణమయ్యెను

సూర్యపతి చాలు లేవయ్యా? మహ వెళ్ళినావు? ఇప్పుడే వచ్చి యిప్పుడే వెళ్ళెదవా ఏమిటి? సాయంకాలము కొండ ఎక్కుదము

ధర్మా దొంగ! కొండ యున్నచో నేనుందును గదా యని కొండ అనుచున్నాడు

సూర్య మా వాండ్రు కూడ కనకదుర్గ గుడికి పోవుదమనుచున్నారు కలసి పోవుదము ఉందువా, ఉండవా?

పశు ఇంక నెచటికి వెళ్ళనులే?

ధర్మా రాఘవరావునకు ఖైదింకెన్నాళ్ళున్నది?

సూర్య ఇంక రెండు మూడు నెలలలో వచ్చుననుకొందును సంవత్సరము పైని కాలేదావెళ్ళి?

ధర్మా ఆసిరి కన్నము పెట్టిరా?

సూర్య వానిదీ ఊరే! దొంగ వెధవ నెచ్చట నుండి తెచ్చితివి? వీడొకనాడు నా జేబులో అర్ధ రూపాయి కొట్టేసినాడు

ధర్మా ఈ ఊరికి ప్రాత కాపన్న మాట

సూర్య వీని కాఱేండ్లు వచ్చినప్పటి నుండియు ఇదియే వృత్తి అప్పుడే రెండుసార్లు రెండారు నెలలు వెళ్ళి వచ్చినాడు

పశు నాలుగున్నరయైనది కొండకు పోదము పదండు

సూర్య మా గుఱ్ఱపు వాడింకను రాలేదు

ధర్మా వాండ్రు గుఱ్ఱపు బండి మీద వత్తురులే మనము నడువవచ్చును

వీరు ముఫ్ఫురును గవర్నరుపేటలో బయలుదేరి వంతెన వద్దకు నడచిరి అసిరి వెనక వచ్చుచుండెను ధర్మా వాగి అసిరిని కలిసికొని "ఏమిరా, ఏమైనను కావలయునా ఏమి? జేబులో నుండి మాత్రము లాగివేయకుము! అనెను

అసిరి ఒక్కటే మాట బాబూ? మీ దగ్గర ఏమియు కాజేయను

ధర్మా తెలియకుండ ఎట్లు కాజేసెదవురా?

అసిరి మీరు ప్రక్క జేబులో డబ్బు వేసుకొనుడు నా మాట మఱచిపోయి నడుచుచుండుడు నేను లాగి వేసెదను చూడుడు

ధర్మా వారిద్దరిలో నా పొడుగాయన కాక, పొట్టి గుమ్మటమ్ములాగున్నాడు- ఆయన ఖద్దరు చొక్కా,



## 'స్కై'లు తేలుతుంటాయి!

మంచు మీద స్కైలు ఎందుకు జారుతాయంటే రాపిడిలో అవి ఒక సన్నని మంచు పొరను కరిగిస్తాయి. అందువల్ల నీటి తెర ఏర్పడుతుంది. ఆ తెరమీద స్కైలు వాస్తవంగా తేలుతుంటాయన్నమాట.

ప్రక్క జేబులో డబ్బున్నది. నేను వారితో చెప్పను. ఇంక రా!

అసిరి: మీరును నా వంక అటునిటు చూడరాదు. అట్లు చేసినచో వారనుమానపడెదరు.

ధర్మా: చూడనులే.

మువ్వురును కలిసి కొండదాక పోయిరి. అప్పటికి గుఱ్ఱపు బండి మీద సూర్యపతియు యిర్వురు కూతుండ్రును, అతనిభార్యఛాయాదేవియు, అరుంధతియు, నామె కుమారుడును వచ్చిరి. సూర్యపతి "కొబ్బరికాయలు, హారతి కర్పూరము, పసుపుకుంకుమలను కొనిపోవుదము, దుర్గ గుడికి" అని డబ్బు తీయుటకు జేబులో చేయి పెట్టెను. పశుపతి కూడ జేబులో చేయి పెట్టి డబ్బు సంచి లేక యటునిటు చూచి గల్లంతు పడుచుండెను. ధర్మారా"వేమి"టనెను. పశుపతి "డబ్బు సంచి లేదోయి!" అనెను.

ధర్మా: నీవెంత ధనవంతుడవైనను అంత యశ్రద్ధ ఏమి? ప్రక్క జేబులో వేసికొందురా? అందులో నీ యొడలే నీకు తెలియదామెను.

పశు: అంత తెలియకుండ లేదు కాని, ఏదో పొరపాటు వచ్చెను.

అసిరి నెమ్మదిగా వెనుక వెనుకనే వచ్చుచుండెను. సూర్యపతి వానిని చూసి "అదుగో! దొంగ కుంక! యిట్లు రా! డబ్బు సంచి ఏదిరా?" అనెను. ధర్మారావు కన్నిలుపుచున్నను, అసిరి డబ్బు సంచి పశుపతి కిచ్చి వేసెను.

పశుపతి: నీకెంత కావలయునో తీసికొని యీయరా.

అసిరి: తీసికొన్నాను బాబూ! బీడీల కర్చునా తీసికొన్నాను.

ధర్మా: ఇంటిలో బియ్యమున్నవటరా?

అసిరి: నేటికున్నవి.

ధర్మా: మరి రేపటికో?

అసిరి: రేపింకనూ రాలేదు కదండీ! అది రేపటి మాట, రేపు ప్రొద్దున్న మరెవరో దొరకరా?- పశుపతిని చూపించి "అయ్యగారే ఉండినచో మరల కాజేసెదను." ముప్పురును విరుగబడి నవ్విరి.

పశు: నేనొక రూపాయి యిచ్చెదను తీసుకొనుము. రెన్నాళ్ళ వరకు దొంగతనము చేయనక్కరలేదు కదా!

అసిరి: దొంగతనము చేయకున్నచో నాకు తోచదండీ! ఆ రోజున కూడు సయించదు. మీరూరకే యిచ్చినచో నది బిచ్చము వంటిది. నేను సంపాదించుకొనియే తిందును.

ధర్మా: దొంగతనము సంపాదనటరా!

అసిరి: చిత్రము! చిత్రము! పెద్ద పెద్ద జీతగాండ్రందరునూ జేసెడిదేమిటండీ? నేను న్యాయముగా సంపాదించుచున్నాను. వారన్యాయముగా సంపాదించుచున్నారు.

సూర్య: నీది న్యాయము; వారిదన్యాయిమూనా?

అసిరి: నేను నాకున్న విద్యవలన ఎవ్వరికిని తెలియకుండ, ఎవరికిని నష్టము లేకుండ, నాకు జాలినంత మాత్రమే తీసుకొని తృప్తిపడుతున్నాను. వారందరును విద్య వలన గాక సిఫారసులు, లంచాలు పెట్టి అందకి తెలిసిన అన్యాయ వృత్తి చేత బోలెడంత మంది పేదవారికి తిండి లేకుండ చేసి సంపాదించుచున్నారు. నేయి అన్నము తిను మహారాజులు- మీరు చెప్పుడు. ఎవరిది న్యాయము?

ధర్మా: వానికి చూచితిరా? ఎంత ఆర్థిక శాస్త్రము తెలియునో!

అందరును కొండ మెట్లెక్కుచుండిరి. అసిరియు ఎక్కుచుండెను. ధర్మారావు అసిరితో కలసికొనెను.

ధర్మా: మరి నీ వింత జాగ్రత్తగా జేయుచుండగా పోలీసువాండ్రు నిన్నెట్లు పట్టుకొందురు?

అసిరి: వెధవలెప్పుడు నన్ను పట్టుకొనలేదు. చిన్నప్పుడొకటి రెండు తెలివి తక్కువగా చేసితిని. అప్పుడు నన్ను ఖైదులో వేసిరి. అప్పటి నుండి వారికి నా మీద కన్ను. అంతేగాని వారునన్ను బట్టుకొనిఏడ్చిరా? పట్టుకొనిన మాత్రము నాకేమి నష్టము? ఇక్కడ కన్న నా కక్కడనే బాగుండును. దిగులు లేకుండా గవర్నమెంటువారు పోషింతురు.

ధర్మా: దొంగతనములో మెలకువ లన్నియు తెలియునా నీకు.

అసిరి : నేను జేబుదొంగను మాత్రమేనండి. నాకీ విద్య సంపూర్ణముగా తెలియును. పెద్దవాండ్రు కూడ అసలు పెద్ద దొంగతనము చేయరండి! ఎవరో ధనవంతులు, ఉద్యోగస్థులే చేయించెదరు. ఒక్కటే మాట వినుడు. పేదవాని కాపూట గడచిన చాలును రేపటిసంగతివాడు చూచుకొనడు. ఒక్కటి చూడండి! లోకములో ఇన్ని దొంగతనములు



జరుగుచున్నవికదా! బాగుపడిన దొంగ యెవడు? ధనమంతయు చేయించిన వాని యింటికి జేరును కల్లుదుకాణమునకు కావలసినంత మాత్రమే వీడు తీసికొనును రెండేండ్లు కఠినపునరకము వీరికి ఇది మనదేశములో మాట లండనులో నటండీ! దొంగతనము చేసి ధనవంతులగుదురట! వారు టార్చిలైట్లు, అద్దాలు కోసెడి సాధనములు, తాళములు కరగించు లైట్లు పుచ్చుకొని దొంగతనము చేయుదురట హస్త లాఘవము వారికేమి తెలియును? అది మనదేశములోని విద్య

ధర్మా నీకీ వర్తమానములన్నియు ఎట్లు తెలియును?

అసిరి మాలో పత్రికలు చదివి వార్తలు చెప్పెడివారు కొందరున్నారు.

ధర్మా . మీ దొకపెద్ద సంస్థరా!

అసిరి అనగా

ధర్మా ఏమియును లేదులే

దుర్గగుడికి అందరును ప్రదక్షిణము చేసిరి అసిరియు తిరిగెను. కొబ్బరికాయలు కొట్టిరి బలహీనురాలైన అరుంధతి పిల్లవాని నెత్తుకొన లేక పోయెను ఛాయాదేవి కెడపిల్ల నాలుగేండ్లది ఆమె ఆమెను దించి రామేశ్వరశాస్త్రి నెత్తుకొన్నది

సూర్య ఆమె చాల చిక్కిపోవుచున్న దయ్యా మునుపు నేను చూచినప్పటి కిప్పటికి చాల బేదమున్నది




## వేయిపడగలు

పశు మందేమైన తప్పక యిప్పించవలయును సుమా!

ధర్మా మీ యిర్వురితో గోలగా ఉన్నది నా దగ్గర డబ్బెక్కడ నున్నది? ఉండికి పదిరూపాయలప్పు చేసి వచ్చితిని తెలియునా?

అందరును దేవి ప్రసాదము తినుచుండిరి అసిరికొక రెండు కొబ్బరి చిప్పలిచ్చిరి ఎల్లరును పోయి మల్లికార్జునస్వామిని కూడ దర్శించి మరికొండ పైకి పోవు మార్గమువద్ద కొంత పైకి పోయి మువ్వురును గూర్చుండిరి ఆత్రోవ మొదటి ఛాయారుంధతులు, పిల్లలు

ధర్మా ఒరేయి! అసిరీ! పెద్దదొంగలను పట్టుకొనినచో దొంగలు మేముచేయలేదు వారు చేయించిరని యెందుకు చెప్పరు?

అసిరి అది కులవిద్య తాను చేసితిననిగాని, యితరులు చేసిరని గాని చేయించిరనిగాని చెప్పగూడదు, ఇది మొదటనే ప్రమాణము చేయవలయును

ధర్మా అట్లు చేయించినవారి నెవరినైన ఎరుగుదువా, నీవు?

అసిరి బాబోయి, పేర్లు చెప్పగూడదండీ!

ధర్మా మన మిచట నలువురమేకదా!

అసిరి . ఆ రోజు వచ్చునప్పటికి గాలికూడ సాక్ష్యమిచ్చును

ధర్మా నీకు నీ విద్యలలో రహస్యములన్నియు తెలియునురా

అసిరి : లేకపోయిన నా తల్లియు, నేను ఎట్లు బ్రతుకుచున్నాము?

ధర్మా ఎవరినో యొకరిని చెప్పుము

అసిరి అయ్యా! చెప్పరాదు సరికదా, మీరు తీసికొనిపోయి ఎచ్చటను వ్రాయను కూడరాదు

పశు ఈయన కవియని నీకుగూడ తెలిసినదియా

ధర్మా . వ్రాసినచో కుండలీకరణము చేసెదను లెమ్ము దానికి నిన్నేమియు చేయరాదు' అని క్రింద షరా వ్రాసెదను? చెప్పుము

అసిరి రహస్యముగా ఏదియో చెవిలో చెప్పెను

ధర్మా అహహా మతము చెప్పుటలో ఇది గూడ భాగము కావలయును ఈ రీతిగా కూడ దోచుకొనవలయును నీ వృత్తి రహస్యములన్నియు నాకు చెప్పుచుంటివికదా! నేను పోయి పోలీసువారితో చెప్పిన ఏమి చేసెదవు?

అసిరి . నా వద్ద దొంగసొమ్ము చూపించ వలయును పట్టుకొనవలయును ఇంకొక మార్గము లేదు మా కందరకును 'లా" తెలుసునండీ!

అందరును కొండదిగియింటికి పోయిరి అసిరిని బలవంతము చేసి పశుపతి రెండురూక లిచ్చెను వాడు "నే నూరకే తీసికొన" ననగా ధర్మారావు "నీవు మాకీనాడెంత చదువు చెప్పితివి? దానిబదులు తీసికొ' మ్మనెను

అసిరి చదువమ్మి డబ్బు తీసికొనరాదండి' అనెను ధర్మారావు 'నే నటువంటివాడనేలే, నా దగ్గర పుచ్చుకొన్నచో దోషములే' దని యిచ్చి పంపించెను మరునా డరుంధతీ ధర్మారావులు సుబ్బన్నపేటకు ప్రయాణమైరి

పశు, జేబులో డబ్బు జాగ్రత్త

ధర్మా సుబ్బన్నపేట దాక రైలుఛార్జి మాత్రమే ఉన్నది

పశు కాదెక్కువయున్నదేమో చూడుము

ధర్మా నీ వేమైనా వేసితివా యేమి? – అని చూచుకొనగా ఐదు రూపాయల నోట్లుండెను.

ధర్మా ఇదా? ఏమిటా బరువుగా ఉన్నదనుకొంటిని ఎందుకీ డబ్బు నా జేబులో పెట్టితివి?

పశు నేను పెట్టలేదు ధర్మారావు దానిని మరల పశుపతి కీయబోయెను

సూర్య : వద్దులే, జేబులో నుంచవయ్యా! మరల చూచినచో వైదికుడవు నియోగులవలె బెట్టు పోయెదవు, అని గద్దించెను

ధర్మా అతని డబ్బుకు నీ యధికార మేమిటి?

సూర్య పశుపతిగారు నీ కంతమాత్ర మీయవచ్చునులే– రైలు కదలిపోవుచుండగా సూర్యపతి పశుపతులకు మహాపురుషుడొకడు తమ్ము వదలిపోవుచుండె ననిపించెను ధర్మారావునకు తాను పశుపతి డబ్బు తీసికొనినట్లే లేదు రైలులో మధ్యమధ్య సతీపతులు మాట్లాడు కొనిరి.

అరుం అరుంధతి వత్తునని యేడ్చునది తల్లి కోపపడెను బుద్ధితెలిసిన పిల్ల గనుక ఊరకున్నది

ధర్మా : తీసికొని రాకపోతివా! నీ పని కొంత యదియు చేసెడిది

అరుం . బాగుగానున్నది, స్నేహము పేరుచెప్పి ధనవంతుల పిల్ల చేతనుగూడ పనిచెయించుకొన వలెను.

ధర్మా వచ్చెడి మగడామెను సుఖపెట్టుననే నమ్మక మేమిటి?

అరుం మీవంటి వారైనచో అంతే, రైలు మరికొంత దూరము పోయెను

అరుం ఒక్కతెయు అత్తయ్య యెట్టుండెనో!

ధర్మా ఎంత యత్తింటి కోడలివే! ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినదత్తగారు

రైలు దిగిరి కుమారస్వామి యెదురుగా వచ్చెను ధర్మారావు చేతిలోనుండి పెట్టె తాను తీసికొనెను ధర్మారావు కొడుకు నెత్తుకొనెను. వాడు బుస్సలు కొట్టుచు తండ్రిమీధి కురికెను

అరుం అంతసే పెత్తుకొనిన దానిని నేను పోయినాను– అరుంధతి బండిలో నెక్కెను కుమారస్వామి ధర్మారావులు కలిసి నడచుచుండిరి

కుమా చక్రవర్తి ఉడాయించె నండోయి! ఆరోజున మీరు వెళ్ళిన తరువాత మరల మిమ్ము గూర్చి పెద్దచర్చ మీరంత చెప్పకుండ వెళ్ళితిరేమి? మరునాడు మీ యింటికి వచ్చితిని మీరు లేరు ప్రతిరోజును, ప్రతిరైలునకు మీ కొరకు వచ్చుచుంటిని

ధర్మా నేను వచ్చిన తర్వాత ఏమన్నారేమి?

కుమార : లక్షయున్నవి, ఒకటి ధ్రువము మంగమ్మ మన పక్షము

సావిత్రమ్మగారు బండి ఆగినంతన మనుమనికి పేద దృష్టి తీసి, కోడలికి కాళ్ళ మీద నీళ్ళు పోసి, లోనికి తీసికొని పోయెను (ఇంకా ఉంది)

## ఇ'వేమన' పద్యాలు

## రాచకురుపు




**ఎంత జేసి జేసి యేపాటు పడినను**
**రాచకురుపు నమ్మరాదు సుమ్మ**
**పాముచెలిమి విడువు పదివేలువచ్చిన**
**విశ్వదాభిరామ వినురవేమ**

# వారఫలం

**13-5-1988 శుక్రవారం నుండి 19-5-1988 గురువారం వరకు**

★ **మేషం** : గ్రహించండి. వారమంతా అనుకూలమే. బలయుతమైన నక్షత్రబలం. తెల్లవస్త్ర విక్రేతలకు అనుకూలం. రాజకీయ రంగాన ప్రతికూలం, గ్రహిస్తారు. ముద్రణా మంత్రాంగం, గనులు, కార్ఖానాలందు శ్రమించే వారికి అనుకూలం. స్త్రీలకు : ఆదాయం. అనుకూల వార్తా శ్రవణం, వృత్తియందు మేలు.

★ **వృషభం** : సమయానికి డబ్బు అందుతుంది. మాటకు విలువ పెరుగుతుంది. అయినవారి సంబంధం నిశ్చయం కావచ్చు. సుఖ శాంతులకులోపం లేదు. శుభకార్య నిశ్చయ ముంటుంది. అతిథి అభ్యాగతులను ఆదరింప గలుగుతారు. వారమంతా హాయిగా ఉన్నదని ఆనందిస్తారు. స్త్రీలకు : ముఖ్యంగా ఉద్యోగం చేసే వారికి అనుకూలం.

★ **మిధునం** : వారమంతా హడావుడిగా ఉంటారు. ఏదో పోగొట్టు కొన్నట్లు, ఏవో కొనదలచినట్లు, ఎక్కడికో వెళ్ళాలనుకొన్నట్లు బాధ పడుతారు, చివరకు ఎందుకు యింత హంగామా' అని అనుకొంటారు. అనుకొన్న రీతిగా డబ్బు అందదు, గ్రహించండి. స్త్రీలకు : సుఖ శాంతులు, ప్రసిద్ధుల పరిచయం. రాజకీయంగా కొంత మేలు చేకూరుట నిశ్చయం.

★ **కర్కాటకం** : వారఫలం సర్వానుకూలం. సకల విధాల లాభదాయకం, ఎందులకో! వారబలం బాగుండబట్టి, కాలం బాగున్నప్పుడు ఏమి చేసినా మేలే. ఎలా చేసినా మేలే. ఆదరించే వ్యక్తులుంటారు. సమయం వస్తే సహాయం చేస్తారు. స్త్రీలకు : వృత్తిరీత్యా అనుకూలం. చేసే ఉద్యోగంలో ప్రసిద్ధి, శుభకార్య సిద్ధికి అవకాశం గలవారం.

★ **సింహం** : ఇరుగు పొరుగు వారితో మాట్లాడే సమయానగాని, వ్యాపారం సాగించే సమయానగాని ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. సభా వ్యవహారాలందు జాగ్రత్త పడటం ఎంతైనా మంచిది. పుణ్యకార్యాచరణమునకు అనుకూలం. స్త్రీలకు : వృత్తి వికాసం, ధనలబ్ధి, మిత్ర సందర్శనం, నాట్యరంగాన మేలు చేకూరనైన వారం.

★ **కన్య** : సభా మరియాదకు అనుకూల వారం. వృత్తియందు చాల మేలైన దినాలు. ఒక్కమాట, ఎంత లాభించినా ఎంత దూరం ప్రయాణం చేసున్నా, ఆరోగ్య విషయంగా శ్రద్ధవహింపక తప్పదు. 'అష్టమశని' బాధ లేకపోదు. స్త్రీలకు : వృత్తి వికాసం, నలుగురిలో ప్రతిష్ఠ, స్వల్పంగా ధనలబ్ధి.

★ **తుల** : అసాధారణ విషయాలు ఒకరేవునకు రాగలవు. 'శని' అనుకూల గ్రహంమీకు. ఒకవిధంగా 'రాహువు' అనుకూలుడే. ధనానికి గాని, గౌరవానికి గాని ఎలాంటి లోటురాదు. మిత్ర సమాగమం. రాజకీయాలందు స్త్రీలకు ఈవారమంతా మేలే.

★ **వృశ్చికం** : ఉద్యోగ వృత్తులందు ఎంత జాగరూకత వహిస్తే అంత మేలు. మీ మేలు కోరినవారు యింటికి రాగలరు. వృత్తి యందు చెప్పదగిన మార్పులు రాగలవు. స్త్రీలకు ఉద్యోగరీత్యా అనుకూల సమయం. అంతో యింతో చేతికి అందటంలో ఆక్షేపణ లేదు.

★ **ధనుస్సు** : రాజకీయాలందు ఈ వారమంతా సంకటం ఏర్పడవచ్చు. అనవసర వ్యవహారాల జోలికి పోరాదు. ఎంత శాంతంగా ఉంటే అంత మేలైన వారం. నాట్యనాటక రంగానుభవం గలవారికి అనుకూలమున్నది. గ్రహించండి. స్త్రీలకు : మీరు వ్యాపారం చేస్తారా? మేలే. ఉద్యోగమందు స్థిరపడదలచినారా? అనుకూలమే.

★ **మకరం** : వృత్తి యందు వికాసమున్నది. ఇంటా బయటా గౌరవాధిక్యత గలవారం. మీతో పూర్వం విరోధించి, ఎడమొగం పెడమొగంగా ఉన్నవారు, దాపునకు రాగలరు. మీకేదో ఉపకారం కూడా చేయగలరు. కొందరకు అప్రయత్నాదాయం. స్త్రీలకు : అనవసర వ్యవహారాలలో జోక్యం చేసికోవటం, అధికంగా మాటలాడటం తగదు.

★ **కుంభం** : వారాంతాన చెప్పరాని మేలు జరుగనున్నది. అంటే కావలసినంత ఆదాయం గలదని భావం. మీకు మేలుచేయాలని బంధు వర్గీయులు యింటికి రానున్నారు. పూర్వం సహాయం చేసినవారి సహాయ సంపత్తులు మరలా లభ్యమవుతాయి. స్త్రీలకు : కృషియందు లోపర్తి లేకపోతే అన్నివిధాలా మేలే.

★ **మీనం** : రాజకీయ వాదులకు అధిక లాభం. సభాగౌరవమున్నది. పత్రికా గౌరవానికి అస్కారమున్నది. సాటివారిలో పోటీ అధిక మవుతుంది. ఇంట శుభం జరుగుటకు అస్కారం, చివరకు వారమంతా కొంత బాగున్నదే, అని మీరే అనుకొంటారు. స్త్రీలకు : సకల రంగాలందు శ్రమించేవారికి అనుకూలం.

-విద్వాన్‌కోట సత్యరంగయ్యశాస్త్రి

# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...



## నేను న్యూ ఇండియాతో పశువుల భీమా చేయించి వుండకపోతే



నా ఎద్దులు చచ్చిపోయాయి, కాని పని మాత్రం ఆగి పోలేదు
ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త ఎద్దులు కొనుక్కోగలిగా.

రైతుకు అతడి ఎద్దులు ఎంత విలువైనవో, అతడికి. అతడి కుటుంబం వారికి బాగా తెలుసు. కాని, ఆ ఎద్దులకు రోగమొస్తే, ప్రమాదంలో దెబ్బ తగిలి పనికి రాకపోతే లేదా చచ్చిపోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యూరెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

**న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారి పశువుల భీమా**

ఒక ఏదాదిలో, పశువుల ఖరీదును బట్టి, ప్రతి 100 రూపాయలపై గరిష్ఠం 4 రూపాయలు చెల్లిస్తే చాలు! దేశమంతటా న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి ఎక్కువ వివరాల కోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

## న్యూ ఇండియా ఎష్యూరెన్స్




జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

పశువుల భీమా-నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!

R K SWAMY NIA 3574 TEL

"వింటర్ ఒలింపిక్ క్రీడలు గురించి మనకు అంతగా తెలియదు మంచుపై శీతాకాలములో జరిగే యీ క్రీడోత్సవాలలో ఉన్న దేశాలు అంతగా [illegible] మనము తెలుసుకొనలేము ఒలింపిక్ క్రీడోత్సవాల వలె యీ క్రీడోత్సవాలు నాలుగు సంవత్సరములకు ఒకసారి జరుగుతాయి 15వ శీతాకాల ఒలింపిక్ క్రీడోత్సవాలు ఫిబ్రవరి 13 నుండి 28 వరకు 16 రోజులు దిగ్విజయముగా కెనడాలోని కాల్‌గరీ మంచుకొండల మధ్యగల పట్టణములో జరిగాయి







మన దేశం కూడా పాల్గొన్నది ఈసారి పోటీలు తిలకించడానికి ప్రతి రోజూ లక్ష మంది క్రీడాభిమానులు వివిధ దేశాల నుండి వచ్చారు పోటీల సమాచారము అందించుటకు పత్రికా విలేఖరులు, టి.వి. రేడియోలకు చెందిన వారు అయిదు వేల వరకు యున్నారు

1976 ఒలింపిక్ క్రీడోత్సవాలు (వేసవి ఒలింపిక్స్) మాంట్రియల్‌లో జరుపుట వలన కెనడా దేశ ఆర్థిక పరిస్థితి తారుమారు అయినది ఒక బిలియన్ డాలర్లు కెనడా దేశము మాంట్రియల్ ఒలింపిక్స్ నిర్వహణ వలన అప్పు చేయవలసి వచ్చినది కాని 12 ఏళ్ళ తర్వాత సాహసించి శీతాకాల ఒలింపిక్ క్రీడోత్సవాలు కాల్‌గరీలో తిరగి జరిపినది ఈ పోటీలు జరుపుటకు 4168 లక్షల డాలర్లు వ్యయము అయినది పోటీల వలన 30 లక్షల డాలర్లు లాభము కెనడా దేశానికి లభించినది శీతాకాల ఒలింపిక్ క్రీడలు జరుపుటకు కెనడా దేశం 1964, 1968, 1972లలో దరఖాస్తు చేయగా అవకాశం లభించలేదు కాల్‌గరి మాంట్రియల్ నగరము నుండి 1881 దూరములో గల ప్రశాంత ప్రదేశము కేలగరీ జనాభా 6,40,000 భరించరాని చలి, మంచుతో కప్పబడిన కొండలతో ఎంతో సుందరమైన ప్రకృతి కలిగియున్న ప్రదేశము పోటీలు జరుపుటకు అనువుగా ఆదునిక క్రీడాంగణములు నిర్మించబడ్డాయి, ఐస్ హాకీ, ఫిగర్ స్కేటింగ్ పోటీలు జరుపుటకు "ఒలింపిక్ సాడిల్ డోమ్" క్రీడాంగణము, స్కీ జంప్స్ నిమిత్తం 70 మీటర్లు 90 మీటర్లు కలిగిన 'మెనాంగ్లి'లో

70మీ., 90మీ., స్కీజంప్స లూమ్"మెనాంగ్లి"

ప్రత్యేకముగా నిర్మించారు పోటీలకు కావలసిన ఐస్‌తో కూడిన క్రీడా స్థలములు ఏర్పడుటకు అత్యంత అధునిక మెషినరీలు ఏర్పాటు చేసారు యు ఎస్ ఎ నుండి 134, సోవియెట్ రష్యా నుండి 121, కెనడా నుండి 111, పశ్చిమ జర్మనీ నుండి 106, స్వీడన్ నుండి 96, ఆస్ట్రేలియా నుండి 92 క్రీడాకారులు పాల్గొన్నారు ఐస్‌పై శీతల వాతావరణములో జరిగే పోటీలు చూచుటకు ఎంతో ఉత్తేజకరముగా, ఇంద్రజాలములా అనిపిస్తాయి ఐస్ హాకీ, ఫిగర్ స్కేటింగ్, స్కీ జంపింగ్, స్కీ స్లోప్స్, క్రాస్ కంట్రీ స్కీయింగ్, స్పీడ్ స్కేటింగ్ ఎంతో ఆసక్తికరముగా ఉంటాయి

ఒలింపిక్ ఫ్లేమ్ (జ్వాల) 620 అడుగుల ఎత్తుగల కాల్‌గరీ టవర్‌పై పోటీలు జరిగిన 16 రోజులు వెలుగుతూనే ఉన్నది

ఆధునిక ఒలింపిక్స్‌ను వేసవి క్రీడలు అంటారు 1896లో ఏథెన్స్‌లో ప్రారంభమయాయి 1988 సియోల్ ఒలింపిక్స్ 24వ ఒలింపిక్ క్రీడోత్సవాలు శీతాకాల ఒలింపిక్ క్రీడోత్సవాలు 1924లో ప్రారంభమయాయి

1956, 1960, 1964, 1972, 1936, 1980, 1984 శీతాకాలపు ఒలింపిక్స్‌లో ప్రథమస్థానము పొందిన సోవియెట్ రష్యా యీసారి 11 స్వర్ణ, 8 రజిత, 9 కాంస్య (29) పతకములు సాధించి తిరిగి మొదటి స్థానము కైవసం చేసుకున్నది 1924, 28, 36, 52, 68లో ప్రథమ స్థానం పొందిన నార్వే 11వ స్థానము పొందినది 1932లో ఒక్కసారి యు ఎస్ ఎ (అమెరికా) మొదటి స్థానము సాధించినది ఈసారి 2 బంగారు, 1 రజిత, 3 కాంస్య పతకములు గెల్చి 9వ స్థానము పొందినది ఈసారి తూర్పు జర్మనీ (9-10-6)

## శీతాకాల ఒలింపిక్ క్రీడోత్సవాలు

| | పోటీ తేదీలు | పోటీలు జరిగిన ప్రదేశం | పాల్గొన్న దేశాలు | క్రీడా కారులు |
|---|---|---|---|---|
| 1 | 1924 జనవరి 25 నుండి ఫిబ్రవరి 4 | ఛమోనిక్స్ (ఫ్రాన్స్) | 16 | 294 |
| 2 | 1928 ఫిబ్రవరి 11-19 | సెయింట్ మొరిట్ (స్విట్జర్లాండ్) | 25 | 495 |
| 3 | 1932 ఫిబ్రవరి 4-15 | లేక్ ప్లాసిడ్ (యు ఎస్ ఎ ) | •17 | 306 |
| 4 | 1936 ఫిబ్రవరి 6-16 గ్యార్‌మిచ్-పెంటిన్‌క్రిచెన్ (జర్మనీ) | | 28 | 455 |
| | 1940, 1944 రెండవ ప్రపంచ యుద్ధము వలన జరగలేదు | | | |
| 5 | 1948 జనవరి 30- ఫి బ్రవరి 8 | సెయింట్ మొరిట్స్ (స్విట్జర్లాండ్) | 28 | 713 |
| 6 | 1952 ఫిబ్రవరి 14-25 | ఓస్లో (నార్వే) | 30 | 732 |
| 7 | 1956 జనవరి 26- ఫిబ్రవరి 5 | కార్టిన డాపెజ్జో (ఇటలీ) | 32 | 818 |
| 8 | 1960 ఫిబ్రవరి 18- 28 | స్క్వా వ్యాలీ (యు ఎస్ ఎ ) | 30 | 665 |
| 9 | 1964 జనవరి 29- ఫిబ్రవరి 9 | యన్స్‌బ్రక్ (ఆస్ట్రియా) | 36 | 1186 |
| 10 | 1968 ఫిబ్రవరి 6- 118 | గ్రానో బల్ (ఫ్రాన్స్) | 37 | 1293 |
| 11 | 1972 ఫిబ్రవరి 3- 13 | సప్పోరో (జపాన్) | 35 | 1232 |
| 12 | 1976 ఫిబ్రవరి 4- 15 | ఇన్స్‌బ్రక్ (ఆస్ట్రియా) | 37 | 1128 |
| 13 | 1980 ఫిబ్రవరి 14- | 23లేక్ ప్లాసిడ్ (యు ఎస్ ఎ ) | 37 | 867 |
| 14 | 1984 ఫిబ్రవరి 7- | 19సరిజేవో (యుగస్లావియా) | 41 | 1180 |
| 15. | 1988 ఫిబ్రవరి 13- 28 | కాల్‌గరి (కెనడా) | 59 | 2600 |

ద్వితీయ, స్విట్జర్లాండ్ (5- 5- 5) తృతీయ స్థానములు దక్కినవి మన దేశమునకు అలవాటు అయిన ఓటములే మిగిలాయి

23 ఏళ్ళ యువోనీ వాన్ గెన్నిప్ (నెదర్లాండ్స్) మహిళల 5000, 3000, 1500ల స్కేటింగ్‌లో బంగారు పతకములు గెల్చి రికార్డు నెలకొల్పినది నార్డిక్ కంబైన్డ్‌లో స్విట్జర్లాండ్ వాసి కేంప్ గెల్చాడు సోవియెట్ రష్యా అఖండ విజయం సాధించినది నేత్ర పర్వంగా మంచు కొండలలో, ఎంతో ఉత్తేజము, ప్రమాదకరమైన యీ పోటీలు తిలకించు భాగ్యము అందరికీ లభించదు □

—ముకరమ్

# దూరదర్శనం

## లత



## రామాయణ్

అంగద రాయబారం చూపించారు అగడ్త కోట ద్వారం బాగున్నాయి రాముడి శాంతి సందేశం వలవ అంగదుడు రావణుడి దగ్గరకి వెళ్ళాడు

నీవు నా మిత్ర పుత్రుడవు- ప్రస్తుతం నీ తండ్రిని చంపి నిన్ను అన్యాయం చేసిన వారి పక్షాన ఉండద్దు అన్నాడు రావణుడు అదంతా సరేగాని తోక సింహాసనం, లంకా దహనం ముందు హనుమంతుడవని అనుకుంటాను కాని ఆ వాల సింహాసనం అంగదుడికి తగిలించారు డైలాగులు బాగున్నాయి ఈ వారం టోటల్‌గా బాగా లేదు

## కాంతిపథం

ప్రచార నాటకమైనా బాగుంటున్నది పటేల్ సుదాకర రెడ్డి వేసి నతను మంచి నటుడు ఆ రోజుల్లో రెడ్ల గడీలూ- వారి రాజనాలూ- మళ్ళీ దయాదాక్షిణ్యాలూ- అతని నటనలో ప్రతిఫలిస్తున్నయ్

బాగ్యవంతు లయిన భూస్వాముల్ని కూలీలూ పంతుళ్ళూ ఏడిపిస్తున్నంత చక్కగా నటిస్తున్నాడు అతను పంతులు ఫరవాలేదు మిగతా వాళ్ళు ఫరవాలేదు మొత్తానికి ఈ సీరియల్- అవినీతిని అరికడదాం- అనే సీరియల్ లాగా కాస్త చూడ బుద్ధి వేస్తున్నది కరెంటు పోయే వేళయింది

## పాలవెల్లి - దేవులపల్లి

కరెంటు పోయి వచ్చే సరికి వీరేంద్రనాథ్ ఏదో సంగీతకార్యక్రమం సమర్పిస్తున్నాడు- ఇది కొత్త కార్యక్రమం కృష్ణశాస్త్రి గారి మీద లాగుంది వీరేంద్రనాద్ అర నిముషం కనిపించాక మల్లీశ్వరిలో పాట వేశారు తరువాత ఎవరో ఒకావిడ మాట్లాడింది- ఆమెని గుర్తించ లేదు

మళ్ళీ వీరేంద్రనాద్ ఏదో చెప్పాడు ఆనందో బ్రహ్మ మీద కృష్ణశాస్త్రి గారి ప్రభావం ఉందని అన్నాడు- తులసిదళం మీద విశ్వనాధ లతల ప్రభావం ఉందని అతను గతంలో చెప్పాడు కాని జనం అతన్ని కాపీ రైటరనీ దయ్యాల పోతురాజనీ అనటం అన్యాయం అని నేను ఒప్పుకుంటున్నాను

ఈ కార్యక్రమం చాలా బాగుంది టి వి వారికి అబివందనాలు- పాలవెల్లి దేవులపల్లి- అని చివరలో తెర మీద వేశారు

మీరూ ఆలోచించండి లాటి పరమ చెత్త నాటిక కోసం ఈ ...ం గొంతు నొక్కేయటం అన్యాయం ... పిచ్చి నాటకాలు?



"రామాయణ్"లో అరుణ్‌గోవిల్

పాలవెల్లి దేవులపల్లి

నిన్న ఈ కార్యక్రమం గొంతు నొక్క బడ్డది ఈ పూట పూర్తి కార్యక్రమం చూపిస్తున్నందుకు సంతోషం

మల్లీశ్వరి పాట వేశారు- నిన్న గుర్తు పట్టలేని ఆవిడ పేరు నిర్మలాదేవి

## సాహితీ లత

ఈ లత ఏం చేసిందో మరో లత చెపుతుంది ః స్త్రీ లత అని రమేణీ సన్యాల్- మంచి స్పీచ్ ఇచ్చిం... రమణి అంద మయిందే

## భలే సుబ్బారావు

కాఫీ పోసి బ్రీఫ్ కేసులు మార్చటం వలన అతని కంపెనీకి మేలు జరుగు తుంది బాగానే ఉంటోంది ఈ సీరియల్

## యక్ష

రవీంద్రనాధ ఠాకూర్ ఒక వృద్ధుడు ధనమే సర్వస్వం అనుకుని కోడలికి మందు ఇవ్వకుండా చంపుతాడు కొడుకూ, మనవడూ భరించలేక వెళ్ళి పోతారు

కొంత కాలానికి మనవడు తాత దగ్గరికి వస్తాడు దనరాసు లున్న గదిలో ఆ పసివాడిని ఉంచి తలుపేసి వాడు ఏడుస్తున్నా తలుపు తీయడు వృద్ధుడి కొడుకు వచ్చి తన కొడుకు గురించి అడుగుతాడు ఆ పిల్లవాడు మనుమడని అంతకు ముందు తెలియదు పిచెత్తి పోతుంది ముసలాడికి అవసరానికి మించిన దనం 'ఎలా పిశాచ' రూపం దాలుస్తుందో రవీంద్రుడు చక్కగా చెప్పారు

## హానీ - అన్ హానీ

అలోకశర్మ పెద్ద రచయిత అతని తల్లి ఆత్మ అతని ద్వారా వ్రాయిస్తూ ఉంటుంది పబ్లిషరుకి ఇద్దరు కొడుకులుంటారు అందులో పెద్దవాడు చిన్న వాడిని చంపుతాడని ఆ ఆత్మ చెపుతుంది శేట్‌కి ఇదీ విషయం అని చెపుతాడు శర్మ శేట్ నమ్మడు కాని ఆ టైముకి తనే పోలీసుల్ని తీసుకొచ్చి హంతకుడిని పట్టిస్తాడు ఇదంతా తల్లి ఆత్మ ప్రబావం నాటకంలో తల్లి ఆత్మ జీవించి ఉన్నట్లే మాట మాటకీ వస్తుంది ఇట్లాంటి కథలు చాలా ఉన్నాయి అయినా రాత్రి పూట ఆ తల్లి దెయ్యం కథ చూపించటం ఏమిటో గోల మొత్తానికి అయినా కాకపోయినా కథలు బాగుంటున్నాయి

## అధికార్

ఉష అనే అమ్మాయి కాల్చుకు చచ్చి పోతుంది ఆమె సోదరుడు సాక్ష్యాధారాలు సంపాదించి ఆమె భర్తా అత్తారూ కట్నం కోసం ఆమెను పీడించారని ఋజువు చేస్తాడు

సరే బాగానే ఉంది ఈ రోజున పొరపాటున కొంగు అంటుకు చచ్చినా అత్తవారి కొంప మునుగుతున్నది అత్త కోప్పడినా ఓర్పులేక భర్త పరిహసించినా ఓర్పులేక పైశాచిక ఆత్మహత్యలు చేసుకునే ఆడపిల్లల్ని నేను సమర్థించటం లేదు- చట్టం ఈ విషయంలో గుడ్డిగానే ఉంది- అసలు తల్లి తండ్రులు కట్నం ఇవ్వలేనప్పుడు ఇస్తామని ఎందుకు చెప్పాలి? ఇందులో పూర్తిగా మొగాడే దోషి అంటే నేను ఒప్పుకోను

* * * * *

బంగారు చిలుక బాధ ఈ వారంతో ఒదిలింది చెత్త నాటిక □

# హైదరాబాద్ నోట్‌బుక్

## డాక్టర్ వాసాప్రభావతి రష్యా పర్యటన:

ఏ కొత్త దేశాన్ని చూడాలన్నా మనస్సు విమాన వేగాన్ని అధిగమించి పయనిస్తూ ఉంటుంది అందులోను నూతన సిద్ధాంతంతో ఉదయించి, ద్వితీయ ప్రపంచ సంగ్రామం అటు పోట్లకు తట్టుకొని, అతిస్వల్ప కాలంలో అభివృద్ధి చెందిన సోవియట్ యూనియన్‌ను చూడాలంటే మనస్సు మరీ తొందరపడింది విమానం నుంచి నేల మీది పట్టణాలు బొమ్మరిండ్లలాగ అగ్గిపెట్టెల్లాగ, ఎడారిమీదుగా పోతున్నప్పుడు వయసు వస్తున్న ఆడపిల్లలు నేర్చుకొనడానికి పెట్టే ముగ్గుల్లా భూమి వంకరటింకర గీటలతో వింతగా కనబడింది -అన్నారు రెండునెలల క్రితం సోవియట్ యూనియన్‌లో రెండు వారాలపాటు పర్యటించి వచ్చిన సోదరి డాక్టర్ వాసా ప్రభావతి డాక్టర్ ప్రబావతి ఇస్కస్ ఆంధ్రప్రదేశ్ పక్షాన కిన్నెర సాంస్కృతిక బృందంలో శ్రీయుతులు కె వి బాస్కరరావు, సుంకు బలరాం, సుంకు అన్నపూర్ణలతో పాటు పర్యటించి వచ్చి, అక్కడి జీవిత విశేషాలు తెలియ జేశారు ఇలా:- మా విమానం తాష్కెంట్‌కు రాత్రి 7-15కు చేరింది మా చేతి గడియారాలు 9-45 చూపిస్తున్నాయి కనుక మేము గడియారాలను వెనక్కు తిప్పాము ఆ విమానం కిందికి దిగుతూంటే కాళిదాసు అన్నట్టు విద్యుద్దీపాలతో వెలిగి పోతున్న ఆ నగరమనే నక్షత్ర లోకాన్ని ఎవరో మా వైపునకు తోసుకుని వస్తున్నట్టు కనిపించింది విమానం దిగగానే అంతవరకు లేని చలి ఒక్క విసురు విసిరింది బుజాల మీది కోట్లను కప్పుకున్నాము పిదప ఉజ్‌బెకిస్తాన్ హోటలుకు వెళ్ళాము రషీమా, మేరీ అనేవారు మా ఏర్పాట్లు చూశారు వీరు పదిహేను రోజులూ మా వెంబడే వున్నారు ఇది ఆ నగరంలో పెద్ద హోటల్ ఇరవై అంతస్తులది ఒక్కొక్క అంతస్తులో వంద గదులున్నాయి నా గది 1456 వది ఆధునిక సదుపాయాలన్నీ కలది మేము లేనప్పుడు గది సర్దినా మా వస్తువులు ఏమి పోలేదు గోడలకు పెట్టిన డిజైనులలో అందమైన లతల మీద జుట్టు వదలి కూర్చున్న వనితల చిత్రాలు భారత దేశాన్ని తలపించాయి మాకు ఏర్పాటు చేసిన శాకాహార భోజనంలో పచ్చి కూరలు, బన్, బ్రెడ్, వెన్న, మజ్జిగ, పాలు, ద్రాక్ష, ఏపిల్, సంత్రావంటి పళ్ళు, కిస్‌మిస్ వంటి మేవాలు, సూపులు, చక్కెర లేకుండా పరమాన్నం, కోకో కోలా, మినరల్ వాటర్, కాఫీ, టీ, ఐస్‌క్రీం ఉన్నాయి శ్రావ్యమైన పాటలు వినిపించేవి బొంబాయి నుంచి వచ్చిన రూపా అక్కడి వారితో కలిసి నృత్యం చేసి ఆనంద పరచింది ఉదయం బ్లాక్ కాఫీ నాకు కొంత ఇబ్బంది కలిగించింది లిఫ్టులో వెడుతున్నప్పుడు నా మెడలోని బంగారు గొలుసు, చేతులలోని గాజులు చూచి విదేశీయులు బంగారంవి అంటే ఆశ్చర్య పోయేవారు జార్జి అనే ఆమె మన వివాహ పద్ధతులు తెలుసుకొని విస్తుపోయి, ఇండియా అంటే తనకు ఇష్టం అన్నది తాష్కెంట్ నగరంలో ఉదయం 7-0 గంటలయితేనే గాని వెలుగు రాదు ఆ నగర స్త్రీ, పురుషులు పొడవైన శరీరాలతో, పచ్చని రంగుతో తీర్చైన ముఖాలతో నల్లని కళ్ళతో చకచకా నడచి పోతూంటే 'ఆధునిక వేషాల్లో' దేవతలు నడచి వెళ్ళుతున్నట్లని పించింది భయము సోకని గుండెలవి మాం-ద్య మెరుగని అడుగులే అవి- అనిపించింది విశాలమైన వీధులు అటు ఇటు చెట్లు, విరగబూచిన రంగు రంగు గులాబీ మొక్కలు మంచు అద్దం ముక్కల్లా చెట్లు మొదట్లో తెల్లధా పరచుకొని వుంది ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత 1966లో నిర్మింపబడినది ఈ నగరం భూకంపాలు ఎక్కువ కావడం వల్ల ఆరు అంతస్తులకు మించిన భవనం లేదు ఈ అంతస్థుల్లో మొదటిది డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ తక్కినవి నివాసాలు రష్యాలో జీతాన్ని బట్టి కాక జనాబాను బట్టి గృహ వసతి ఏర్పాటు వుంటుంది అక్కడి స్టేట్ లైబ్రరీ చూచాము లైబ్రరీలో ఉజ్‌బెక్, రష్యన్ భాషల గ్రంథా లున్నాయి లైబ్రరీ ముందు గులాబి తోట ఈ లైబ్రరీ ఎదుట మంత్రుల భవనాలు, నవోయీస్ థియేటర్ ఉన్నాయి దాని పక్కన 30 మీటర్ల లెనిన్ కాంస్య విగ్రహం వుంది అక్కడ ఇండియా ఫెస్టివల్ కోసం పెరేడ్ అభ్యసిస్తున్న పిల్లలు మామిడి పండ్లలా ఉన్నారు ఇండియా కరెన్సీ అడిగారు ముందుగానే పట్టుకు వెళ్ళడం వల్ల వారికి చిల్లర పంచాము నెహ్రూ బొమ్మ కావాలంటే ఇచ్చాము అక్కడి పెద్దవారికి గాంధీ, నెహ్రూలను గురించి తెలుసు పూర్వపు భారత ప్రధాని లాల్ బహాదూర్ శాస్త్రి తాష్కంట్‌లో మరణించారు మూడు రోడ్ల కూడలిలోని పెద్ద పార్కులో ఆయన విగ్రహం వుంది ఆ వీధికి ఆయన పేరు పెట్టారు ఒక స్కూలు కూడ ఆయన పేర వుంది అక్కడ మేము ఫోటో దిగాము మన నాయకునికి నివాళులు అర్పించాము అక్కడి సూపర్ బజారు చూచాము పూవులమ్మే ఆడవారు పరమ సుందరులు ప్రబంధాల పుష్ప లావికలు జ్ఞాపకం వచ్చారు వారితో పాటు ఫోటోలు తీసుకున్నాం మేము వెళ్ళుతూ వుంటే, మా కుంకుమ బొట్లు, పట్టు చీరలు చూచి ఆడవారు వచ్చి పలకరించి మా పట్టు చీరలు తాకి ఇండియా అని సంతోషించేవారు ఇండియన్ స్టూడెంట్స్ కౌన్సిల్ మీటింగులో పాల్గొన్నాము కావలి నుంచి వచ్చి ఇంజనీరింగ్ చదువుతున్న విజయకుమార్, గన్నవరం నుంచి వచ్చి మెడిసిన్ చదివే అమ్మాయిలు యామిని, గౌరి మాతో ఉన్నారు అక్కడి తెలుగు లైబ్రరీకి నా అమ్మ, మానవతా శిఖరం కావ్యాలను, న్యాయం గుడ్డిది కథా సంపుటీ ఇచ్చాను మేము దిగిన హోటలు ఎదుట ఉన్న కట్టడం రైటర్స్ బిల్డింగ్ దానిమీద పుస్తకం, దాని మధ్య పాళీ చిత్రాలున్నాయి రచయితలు సమావేశ మవుతుంటారు.



లెనిన్‌గ్రాడ్‌లో ఇండియన్ ఫెస్టివల్ ఆఫీసులో శ్రీ కె వి భాస్కరరావు, మేరీ, వాసా ప్రభావతి, శ్రీమతి సుంకు అన్నపూర్ణ, శ్రీ సుంకు బలరాం, లూథా, నతషా

ఒక కొత్త రచయితను కలుసు కొన్నాము మరుసటి దినం లెనిన్ మ్యూజియం చూచాము ఇలాటి మ్యూజియంలు మొత్తం మూడు ఉన్నాయి అసలు మ్యూజియం మాస్కోలో వుంది దీనిలో లెనిన్ జీవితం సమగ్రంగా వుంది మూడవ రోజు మేము విమానంలో లెనిన్ గ్రాడ్ చేరాము దీని అసలు పేరు పీటర్స్ బర్గ్ విప్లవానంతరం లెనిన్ గ్రేడ్‌గా మారింది ఉదయం ఊరంతా ఎర్ర జెండాల కాంతితో వెలిగి పోతుంటే, మబ్బు తెరలు తొలగించుకొని సూర్యుడు ఉదయిస్తుంటే,

అప్పుడప్పుడే ఉదయిస్తున్నాడు సూర్యుడు
ఎర్ర జెండాల నిగనిగలతో తన వేడిమి కొలుచు కోవాలని

అనే భావం మనస్సులో తళుక్కు మంది మేము దిగిన హోటలు పేరు ప్రిబెవికిస్త యస్తాన్ బలిసిన చేప అని అర్థం ఈ ఖరీదైన హోటలు భోజనం మరపు రానిది హోటల్ వెనుక బాగంలో ఫిన్‌లాండ్ దీవులను కలిపే నల్లని జలసంధి ఉంది అందులో నీరు తియ్యగా వుంటుంది ఆ నగరంలో చాలా ద్వీపా లున్నాయి మేమున్న హోటలు ఒక ద్వీపమే ఈ నగరం చుట్టూ 45 నదు లున్నాయి 500 వంతెన లున్నాయి నీవానది నీల రంగుతో నిగనిగలాడుతూ వుంటుంది ఎర్ర జెండాలు రెపరెపలాడే పెద్ద పెద్ద ఓడలు నగర వ్యాపార వైభవాన్ని తెలుపుతూ లంగరు వేసి వుంటాయి పీటర్ చక్రవర్తి నిర్మించిన అద్భుత భవనం పీటర్ చర్చి నేడు మ్యూజియంగా మారింది ఈ నగరం ప్రాచీన శిల్ప వాస్తు వైభవంతో విరాజిల్లే నగరం పీటర్స్ చర్చ్‌లో 14 వేల మంది కూర్చోవచ్చు ఇక్కడి ఎల్బాగ్రేడ్‌లో పారిశ్రామిక శిక్షణ పాఠశాల చూచాం దీనిలో 15 రకాల వృత్తులకు శిక్షణ ఇస్తారు మా బృంద నాయకుడు శ్రీ కె వి బాస్కర రావుకు అక్కడి పిల్లలు మెమెంటోలు ఇచ్చారు ఆయన వారికి బారత దేశం మెమెంటోలు ఇచ్చారు లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయం చాల పెద్దది 15 బాషలు నేర్పుతారు రెండువేల మంది ఉపాధ్యాయు లున్నారు ఇక్కడ విద్యార్థులకు సకల సౌకర్యాలూ ఉన్నాయి లెనిన్‌గ్రాడ్ మ్యూజియంలో 250 గదు లున్నాయి మేము కొన్నే చూడ గలిగాము మహాకవి గోర్కీ వాడిన మంచం, టేబిలు మొదలయినవి చూచాము ఇండియన్ ఉత్సవ శాలలో మన త్రివర్ణ పతాకను చూడగానే ప్రాణం లేచి వచ్చింది నమస్తే అన్న మాట విని వెనక్కు తిరిగాము ఎర్రని కుంకుమ బొట్లతో పచ్చని రంగుతో వున్న ఇద్దరు యువతులను చూచి, భారతీయులా అని అడిగాము కాదు వారి పేరు లూథా, నతీషా లింగ్రాయత్ యూనివర్శిటీలో ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం నేర్చు కున్నారు సంస్కృతంలో మాట్లాడ గలరు లెనిన్‌గ్రాడులోని లుకూస్ థియేటర్‌లో కొన్ని రూపకాలు చూచాము అవి చాలవరకు భారతీయ రూపకాలను పోలి వున్నాయి నవంబర్ 4న రాత్రికి రైలులో మాస్కో చేరాము మాస్కో స్టేషనులో మాస్కోవా, మాస్కోబా అని వ్రాసి వుంది మేము దిగిన మాలస పెద్ద హోటలు అన్నిటికీ కేంద్రంలో వుంది మాస్కో లెనిన్‌గ్రాడ్ అంత పెద్దది కాకపోయినా, ఆధునికంగా అత్యున్నతి సాధించిన నగరం మాస్కో నగరం రెడ్‌స్క్వేర్‌లో లెనిన్ మృతదేహం చూచాము బయట వీరుల సమాధు లున్నాయి కొత్తగా వివాహమైన దంపతులు ఆ సమాధులపై పుష్ప గుచ్ఛాలు వుంచుతారు నో స్మోకింగ్ బోర్డులు అక్కడ కూడ ఉన్నాయి చప్పుడు చేయవద్దని పోలీసులు సైగ చేస్తుంటారు లెనిన్ దేహం జీవకళ ఉట్టి పడుతుంది దానికి ఎదుట హిస్టరీ మ్యూజియం చూచాము అక్కడి ప్రగతి ప్రచురణలో పని చేసే నిడమర్తి ఉమా రాజేశ్వర రావు, రేడియో తెలుగు శాఖలో పని చేసే బండారు శ్రీనివాసరావు కలిశారు అంతఃపురాల్లా అద్భుత శిల్పకళా ఖండాలతో నిర్మించిన మెట్రో అండర్ గ్రౌండ్ స్టేషన్ చూచి ఉక్కిరి బిక్కిరి అయి, వారింటికి చేరాము మల్లెపూలలా మంచు వర్షం కురుస్తోంది పాదం మునిగేంత మంచు పడింది వారింట్లో జరిగిన సమావేశంలో వివిధ విషయాల చర్చ జరిగింది అక్కడి సాహిత్యం క్రైమ్, సెక్స్ ప్రవేశించ లేదని, కవిత్వంలో హాస్యం ఎక్కువయి నట్లు వారు తెలిపారు శ్వక్లినా అవెక్సీయేవిచ్ అనే ఆమె ఉమా రాజేశ్వరరావు కలిసి రష్యన్ గ్రంథాలను అనువదిస్తున్నారు రష్యా- తెలుగు నిఘంటువు తయారు చేస్తున్నారు రెడ్‌స్క్వేర్‌లో జరిగే రెవెల్యూషన్‌డే ఉత్సవం చూచాము 69 దేశాల ప్రతినిదులు ఈ వుత్సవంలో పాల్గొన్నారు ఆ రాత్రి ప్రపంచ ప్రఖ్యాత మైన రష్యా సర్కస్ చూచాము అక్కడి ఆచారాలను గురించి కొద్దిగా తెలుసు కొన్నాము పిల్లలు పెద్ద వారయి ఉద్యోగాలు వచ్చేవరకు పెద్దవారి దగ్గర ఉంటారు వివాహం మాత్రం పెద్దలు కుదిర్చినవి కావు అన్నీ ప్రేమ వివాహాలే పెద్దలు సాదారణంగా అడ్డు చెప్పరు వివాహం రిజిస్ట్రార్ ఆఫీసులో ఉంగరాల మార్పు, పుష్ప గుచ్ఛాల మార్పులతో జరుగుతుంది ఇంట్లో ఇష్టులకు విందులు చేసుకోవచ్చు మంగళ ప్రదమైన సంగీతం వుంటుంది ప్రేమ వివాహా లయినా, విడాకులు ఎక్కువగానే ఉన్నాయి అలా విడిపోయి నప్పుడు పిల్లలు సాధారణంగా తల్లి వద్దనే వుంటారు అక్కడక్కడ ఉమ్మడి కుటుంబాలూ ఇంకా ఉన్నాయి వివాహమయిన పిదప తలిదండ్రులతో ఉంటామంటే ప్రభుత్వం పెద్ద యిల్లు కేటాయిస్తుంది మనలాగ అమ్మాయి అత్తవారింటికే వెళ్ళుతుంది మతానికి స్వేచ్ఛ వుంది ప్రజలు తమ ఇష్టం వచ్చినట్లు ఇండ్లలో మతాన్ని అనుసరించ వచ్చు కాని బహిరంగ ప్రచారం చేయరాదు అయినా, చర్చిలు, మసీదులు పని చేస్తున్నాయి ముసలివారి విషయంలో శ్రద్ధ ఎక్కువగా వుంది పిల్లల పెంపకంలో చాల శ్రద్ధ కనబరుస్తారు బాలింతల లీవు రెండు నెలలు మాత్రమే ఎక్కువ కావాలంటే జీతం నష్టం మీద గుమాస్తా జీతాలు 90 నుంచి 130 రూబుల్సు వరకు ఆడా, మగా బేదం లేకుండా అందరూ అన్ని పనులూ చేస్తారు వారి క్రమశిక్షణ గొప్పది లెనిన్ గ్రాడ్‌లో ట్రాము ఎక్కాము టికెట్లు ముందుగా కొనుక్కో వాలని తెలీదు కండక్టరు లేడు ఏం చెయ్యాలో తోచలేదు ఇంతలో ఒక కుర్రాడు వచ్చి జేబులోంచి టికెట్లు తీసి, మూల ఉన్న పంచి దగ్గరికి వెళ్ళి పంచ్ చేసి మాకు ఇచ్చాడు బస్సు ట్రాముల్లో ఎక్కడికి వెళ్ళినా టికెట్టు ఐదు కోపెక్కులు మాత్రమే వారికి మతపరమైన పండుగలు లేవు గాని న్యూఇయర్స్‌డే, రెవెల్యూషనరీ డే, ఇండిపెండెన్స్‌డే, లేబర్‌డే వంటి పండుగ లున్నాయి మాస్కో నుంచి రైల్లో కేవ్ పట్టణానికి వచ్చి, అక్కడ 30 మీటర్ల ఎత్తయిన వీరనారీమణుల యుద్ధ స్మారక చిహ్నం చూచాము కేవ్‌లో ఇస్కస్ కార్యాలయంలో జరిగిన సమావేశంలో అందరూ ప్రసంగించారు నేను వ్రాసిన కవిత ఆంగ్లానువాదం చదివాను కేవ్ నుంచి విమానంలో సోచీ నగరం చేరాము సోచీ మన అరకులోయ లాగ వుంది అక్కడి శానిటోరియం చూచి 150 రకాల కొమ్మలకు 150 రకాల కాయలు కాచే నిమ్మ చెట్టు ఫ్రెండ్‌షిప్ ట్రీ చూచాము అక్కడ దేశ దేశాల నుంచి తెచ్చిన మట్టి కుప్పలు ఉన్నాయి మళ్ళీ తాష్‌కెంట్ మీదుగా ఢిల్లీ చేరాము రెండు వారాల రష్యా పర్యటన మా హృదయాలలో చెరగని ముద్ర వేసింది ఎన్నో సుందర దృశ్యాలు మా కళ్ళముందు నిలిచాయి

## ఉపశ్రుతి:—

ఏరు ఏరు పో, తల్లిపో మున్నె- ఎక్కు, ఎక్కు పో.తో సుకొని ముందుకు పో- అన్నాడు మద్రాసులో బస్సు ఎక్కుతున్న నన్ను ఇదేమిటి మా హైదరాబాద్ బస్సు కండక్టర్ల భాష మీకు ఎలా వచ్చింది'- అన్నాను హైదరపాక్కమా? కండక్టర్ల బాష దేశంలో ఎక్కడయినా ఒకటే? అన్నాడు ఆ తమిళ కండక్టర్ సోదరుడు

— తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003 Acting Editor M Madhava Rao, Chief Editor · S Radhakrishna.
Phones Business: 61247, 61248, 75569 Editorial 75667